# నరుడు



# నక్షత్రాలు

గుంటూరు శేషేంద్రశర్మ

ప్రథమ
ముద్రణ
1963
డిసెంబరు

# విషయసూచిక




మూల్యం
రు. 2-50

త్రినాథ్ ఆర్టు
ప్రింటర్స్
విజయవాడ – 2.

# ఉపోద్ఘాతము

✿✿✿✿✿✿✿✿✿

గడచిన రెండు మూడు సంవత్సరాల్లో ఆంధ్రప్రభ దినపత్రిక వ్యాసానుబంధంలో ప్రకటింపబడిన నా వ్యాసాలు కొన్ని పుస్తక రూపంలో ముద్రించాలనే అభిలాషతో ఈ పని చేశాము.

నా "ఋతుఘోష" కావ్యముద్రణ సందర్భంలోను. ఈ గ్రంథాన్ని ముద్రించే సందర్భంలోనూ ముద్రణా కార్యభారాన్ని యావత్తు తన మీద వేసుకుని రెండు గ్రంథాలనూ చాక్షుష క్రతువులుగా రూపొందించిన నా తమ్ముడు, ప్రసిద్ధ కథా రచయిత, చిరంజీవి పెద్దిభొట్ల సుబ్బరామయ్యకు ఏ విధంగా కృతజ్ఞత చెల్లించుకోగలనో చెప్పలేను. ఆయనకు నా హృదయపూర్వక ఆశీర్వచనములు.

వైజ్ఞానిక వ్యాసరచన పాశ్చాత్య వాఙ్మయంలో ఒక ప్రసిద్ధ శాఖగా నెలకొన్నది. ఏ యితర వాఙ్మయ ప్రక్రియలనూ ముట్టుకోనకుండానే ప్రసిద్ధ రచయితలుగా పరిగణింప బడిన వారు ఎమ్మర్సన్ నుంచీ రస్సెల్ వరకు ఎందరో ఉన్నారు

కానీ మన వాఙ్మయంలో యింతవరకూ అట్లాంటి సంకల్పం కూడా వచ్చినట్లులేదు (పానుగంటివారిని, జొన్నలగడ్డ సత్య నారాయణమూర్తిగారిని మినహాయిస్తే)

నిరంతర విజ్ఞాన సాగర మథన ఫలితంగాను, దీర్ఘకాల తపః పరిణామంగాను, లోకవృత్త పరిశీలనా సముత్పన్నంగాను, సమకూడిన భావసారానికి అప్పుడప్పుడు జిజ్ఞాసువుల ఆలోచ నార్థం అక్షర రూపం యిస్తూ వచ్చాను - ఒక అపూర్వభావం చెప్పడానికి గానీ లేక ఒక అపూర్వ ధోరణిలో చెప్పడానికి గానీ అవసరం వస్తేనే కలం పట్టాలన్న నియమం ఉన్నవాణ్ని. (చర్వితచర్వణం ఎందుకని ?) భావోల్బణం ఆపుకోలేనప్పుడే వ్రాసేవాడిని. భావోద్వేగ శాంతికోసం హృదయం ఖాళీచేసు కోవాలి. నా వ్యాసాలు ధారావాహికంగా ప్రకటించి అటి శాంతి నాకు లభింపజేసిన, చేస్తూ ఉన్న, శ్రీ ఆంధ్రప్రభ పత్రిక వారికి శాశ్వతంగా నేను ఋణపడి ఉన్నాను.

—గుంటూరు శేషేంద్రశర్మ

# అంకితము

సరసుడు సాహితీపరుడు సద్గుణసింధువు సత్యవాది ని
ర్భరకరుణా మరంద రుచిరప్రచుర స్తవనీయమూర్తి భా
సుర సురభూరుహ ప్రథిత శుభ్రయశస్కుడు శేషయాఖ్య భూ
వరుడు వెలుంగు శిష్టజనవర్గము పాలిటి దుర్గమోయనన్.

మా శేషయ్య మహోన్నతాశయుడు,
శుంభత్కావ్యపీయూష భా
షా శేషాహి, రసప్రసిద్ధ రచనాసందర్భ గర్భీకృత
క్లేశజ్ఞాన విశిష్ట బుద్ధియనియుల్లేఖింతు నీ యావదా
కాశక్రోశ విశాల పత్రమున నక్షత్రాక్షర ప్రౌఢిమన్.

నీలమరాజు వంశమున నిర్మల శంభు కిరీట వాటికన్
బాలశశాంక రేఖవలె భాసిలు వారికి యావదాంధ్రలో
కాలఘు పత్రికా సమధికారికి సాధుజనోపకారికిన్
బాలిత కామకోటి గురుపాద విహారికి శేషసూరికిన్.

నాకుం గల్గిన స్నేహా
త్సేకంబున కేది గూర్చు చిహ్నంబగు నీ
లోకంబున నాకంబున
నేకంబగు రీతి కీర్తి నేది యొసంగున్.

అని వితర్కించి యిట్లొనర్చితిఁ గావున—

మిత్రులు సాధు చంద్రములు మీరని తీరని కోర్కి పెంపునం
బాత్రమటంచు నెంచి మృదుభావ సమంచిత రీతి నెంచి న
క్షత్ర నరాభి ధానమగు గ్రంథము సంకితమిచ్చుచుంటి మీ
గోత్ర శుభంబు గోరి కవికుంజర పంజర ! శేషయాగ్రణీ !

శ్రీకర భూసురాఖ్య కుల శేఖర ! బాంధవ మిత్రలోక చా
మీకర ! శాంకరోక్తినద మీన సమాన గుణాకరా ! సుధా
శీకర వాగ్విలాస బుధ చిత్తవశీకర ! రమ్యభావర
త్నాకర ! నీక శేష శుభమస్తు సమస్తదిశాప్రశస్తిగన్

❁❁❁❁❁❁❁❁❁

'నరుడు – నక్షత్రాలు' అనే శీర్షిక క్రింద వెలువరింప బడిన వ్యాసాలు చదువగా స్పష్టంగా కలిగే అభిప్రాయాలు కొన్ని వున్నాయి.

మొదట యీ ప్రయత్నం తెలుగులో అతి నూతనం అనే విషయం బోధపడుతుంది. తెలుగులో యిటువంటి ప్రయత్నాలు ఎడనెడ తప్ప తరచుగా జరిగినట్టు తోచదు. వ్యాసం ఒక సాహిత్య ప్రక్రియగా పరిపూర్ణతను యిప్పు డిప్పుడే సంతరించుకుంటున్నది. ఏవేవో సాహిత్య విషయాలపై చర్చల రూపంలో తప్ప ఆప్రక్రియను క్షుణ్ణంగా ఉపయో గించు కోవడం ఇంతవరకూ గమనించ దగినంతగా జరగ లేదనే చెప్పాలి. మానవ విజ్ఞానంలో శరవేగంతో వస్తున్న మార్పులనూ, పరిణామాలనూ వివరించడానికి వ్యాసంకన్నా బలమైన సాధనం మరొకటి లేదనే విషయం నిర్వివాదం. అందువల్ల వివిధ విషయాలను గురించి వ్రాయబడి పరిత్ర లోకంలో ఆలోచనలను రేకెత్తించగల యీ వ్యాస పరంపర అత్యంత శ్లాఘనీయమైన ప్రయత్నం.

'ఋతుఘోష' వంటి కావ్యం వ్రాసి 'కవి'గా మన్నన లందుకున్న శ్రీ శేషేంద్రశర్మ యీ వ్యాసావళి ద్వారా మనలను ఆలోచింప జేయగల వ్యాసకర్త, అవుతున్నారు. ఈయన కవి మాత్రమే కాక ఆలోచనాపరుడూ, విజ్ఞానీ, అని వెంటనే అనిపిస్తుంది. రచయిత విజ్ఞాన శాస్త్రమూ, చరిత్ర, రాజకీయాలూ, తత్త్వము, సాహిత్యమూ, ఛందస్సు, అలంకార శాస్త్రం... ఒకటేమిటి, మానవ విజ్ఞాన శాఖ

లన్నిటిలోనూ కృషి చేస్తున్న బహుముఖ ప్రజ్ఞాశాలి అ
విషయం వెంటనే స్ఫురిస్తుంది.

ఈ వ్యాసాలన్నిటిలో మరొక ముఖ్యలక్షణం వుంది. ప్రతి శీర్షిక క్రిందా, ఏదో ఒక అపూర్వ విషయాన్నో లేదా ఒక అపూర్వ సిద్ధాంతాన్నో ప్రతిపాదించడం జరిగింది. 'ఏదో అపూర్వ విషయాన్ని అపూర్వ ధోరణిలో చెప్పవలసి వచ్చినప్పుడే కలం చేపట్టాలి అనే నియమాన్ని గ్రంథకర్త పాటిస్తున్నట్టు ద్యోతకంఅవుతుంది. అది విశేషమే.

అందువల్లనే యీ ప్రయత్నంఅత్యంతఅభిలషణీయం. రచయిత మనలో ఆలోచనలను రేకెత్తించగల మరెన్నో రచనలు చేయగలరని ఆకాంక్ష.

విజయవాడ,
20-12-63.

పెద్దిభొట్ల సుబ్బరామయ్య

# నరుడు న లు

తాజమహాల్ ప్రపంచంలో చాలా చిత్రమయిన దంటారు. అట్లా అనుకోవడం ఎంత గుడ్డితనమో! అంతకంటే విచిత్రమయినవి, మనకు అర్థంకానంత ఆశ్చర్యమైనవి ఈ సృష్టిలో ఎన్ని లేవు? తాజమహాల్ కాదూ, తలిరాకు ఎంత చిత్రమైనది! అంతకంటే ఇసుక రేణువు, ఈగతల, దోమ ముక్కు, చీమకాళ్లు—ఇంతకంటే విచిత్రమైనవి ఊహించ గలమా? మహావృక్షానికి గర్భకుహరమైన మర్రివిత్తనాన్ని గురించి ఆలోచించి ఆలోచించి వెర్రిపట్టి పోవలసిందేగాని, దాని రహస్యం యిసుమంత అయినా అవగతం అవుతూ ఉందా? నదులూ, పర్వతాలూ, నక్షత్రాలూ, బ్రహ్మాండాలూ, వీటన్నిటికంటే సమస్త సృష్టిలోనూ మానవుడు ఎంతవిచిత్రమైన దృశ్యం!

కాని మనదౌర్భాగ్యం ఏమిటంటే, ఈ విచిత్రాలను మన కళ్ళు చూడవు. అవ్యవహితంగా సంసార చక్రంలో పరిభ్రమిస్తూ ఉండడంచేత మనలో చాలా మందికి సృష్టిలోని అద్భుతసత్యాలు గోచరంకావు. మన కళ్ళముందే నక్షత్రాలు

ప్రకాశిస్తుంటాయి, ఆకులు రాలుతుంటాయి, నదులు ప్రవహిస్తుంటాయి. సముద్రాలు ఘోషిస్తుంటాయి, ప్రకృతిఅంతా ప్రవర్తిస్తూ ఉంటుంది. కానీ మనం అవి ఎంతవిచిత్రమయినవో గుర్తించము. ఆ వస్తుజాలంలో అంతర్భూతమై ఉన్న క్రమత్వమూ, ఏకత్వమూ, యిత్యాది విచిత్ర విశ్వసూత్రాలు మనకు గోచరించవు. కాని సత్యమేమిటంటే — యీ విశ్వమంతా వివిధ రూపాలలో విలసిల్లుతున్నప్పటికీ వాటి మూలభూతాలు ఒకటే అనీ, సూర్యచంద్రులనుండి సూక్ష్మజీవుల వరకూ, శీతాచలంనుండి చిల్లిగవ్వవరకూస్థావర జంగమాత్మకమైన సృష్టిఅంతా క్రమబద్ధమనీ ఒకటే. నిధి ఉన్నభూమిమీద నిద్రించే దరిద్రుడిలాగా ఎప్పుడూ చూస్తూ ఉంటారు, "ఏమిటి?" అనుకోరు. చెట్లు పెరగడంలోను, అవి ఆహారం తయారుచేసుకోవడంలోను, వాటి కొమ్మల్లో, రెమ్మల్లో ఆకుల్లో, ఈనెల్లో సైతం క్రమత్వంఉంది. కొన్ని రసాయనిక శక్తులూ భౌతిక శక్తులూ వాటిలో ప్రయోగం అవుతూవుంటాయి... చీమంత చిన్న ప్రాణికికూడా ఒకతల ! అంత చిన్నతలలో కళ్ళు మొదలైనక్లిష్ట నిర్మాణం కలిగిన అవయవాలు, ఆతలలోనే భయము, ప్రేమ, క్రమప్రీతి మొదలైన భావాలు యిన్ని యిమిడి వున్నాయి.

ఈ చీమను, ఆకును, ఇసుకరేణువును, యిల్లాగే సృష్టిలో అన్నివస్తువులనూ విభజిస్తూ పోతే చివరకు అణువులు వస్తాయి. మేధావులైన శాస్త్రజ్ఞులు సృష్టిలోని వస్తుజాలాన్నంతా యీ విధంగా విభజనాత్మకంగా పరిశీలించి ఫలితం ఏమని తేల్చారంటే—సృష్టిలోని వస్తువులన్నీ 92 మూల

పదార్థాల నానావిధ సమ్మేళన చేతనే ఏర్పడ్డాయని. అంటే సృష్టిలోని వస్తువుల్ని విభజిస్తూ పోగా అణువుల దశలో 92 విశిష్టమైన అణువులున్నట్టు తేలింది. తర్వాత శాస్త్రం అభివృద్ధి పొంది అణువును కూడా విభజింపగలిగారు. అప్పుడు వారు చూచిన అద్భుతమైన సత్యమేమిటంటే—ఈ 92 విశిష్ట గుణాలు కలిగిన అణువులు కూడా అణుదశలోనే ఈ విభిన్నత, ఈ విశిష్టతలు కలిగిఉండి, విభజింపగానే ఆగుణాలను, రూపాలను, కోల్పోయి, అన్ని అణువులూ ఎలెక్ట్రాన్లు, ప్రోటాన్లు అనే శక్తికణాలుగా విడిపోతాయి. ఈ మహత్తర పరిశోధనా ఫలితాల మూలంగా రూపగుణ రహితమైనశక్తి, అణుదశలో పదార్థంగా మారి రూపగుణాలు పొంది చెట్లు, జంతువులు, నదులు, కొండలు, మనుష్యులు యిత్యాది నానావిధ వస్తుజాలంగా రూపొందింది. శక్తి కణాలైన ఎలెక్ట్రాన్లు ప్రోటాన్లు కలిసి ఏర్పడిన రూపమే అణువు. ప్రోటాన్లు కేంద్రంగా చుట్టూ ఎలెక్ట్రాన్లు పరిభ్రమిస్తూ ఉన్న ఒక నిర్మాణంపేరు అణువు. అంతరిక్షంలో పరిభ్రమించే అనంతకోటి తారాచక్రాలు అణుగర్భ ప్రతిబింబమే అనడానికి ఏ సందేహమూ లేదు. క్రమత్వమూ, ఏకత్వమూ మొదలైన ప్రాథమిక విశ్వ సూత్రాలు అణువులోనే ప్రారంభించాయి. నరుడినుంచీ నక్షత్రాలవరకూ అంతా ఒకటేసూత్రం. అంతా ఒకటే శాస్త్రం,

కాని నిత్యజీవిత కల్లోలంలో నిమగ్నులైన మన సంసార జంతువులకు యీ ఆశ్చర్యాలేవీ అక్కర లేదు. జ్ఞాన సంపదకు కీలకమూ, అసంభృతమండనమూ అయిన బుద్ధీంద్రియాన్ని ఉపయోగించరు. "చక్షుర్వైసత్యం", కనపడునంత

వరకే సత్యం అనుకునే భ్రమ జీవులు, " అచ్చపు జీకటింబడి
గృహవ్రతులై విషయానురక్తులై చచ్చుచు బుట్టుచున్",
అన్నట్లుగా అంధజీవులు. విశ్వాధార సూత్రాలు తమ జీవా
ధార సూత్రాలని యెరుగరు.

ఈ విశాలమైన భూగోళమూ, దానిమీద అజ్ఞానంతో
అర్థంలేని కోలాహలం చేస్తూ యిటూ అటూ పరుగిడుతూ
వుండే చిన్న చిన్న మానవులూ యిదంతా చూస్తే మన
జీవితం ఎంత తుచ్ఛమయినదో అవగాహన అవుతుంది. అయితే
యిట్లాంటి అజ్ఞానానికి ప్రజలను నిందించడం కూడా న్యాయం
కాదు. మన ఆర్థిక సాంఘిక విధానాలే మన ప్రజల మానసిక
దారిద్ర్యానికి కారణాలనేది ఏనాడు గుర్తిస్తామో అనాడే
మానవ సమాజ మహోజ్జ్వల భవిష్యత్తుకు ద్వారాలు తీసిన
వాళ్ళమవుతాము. తిండిలేనివారి ఆకలి తియ్యటి కావ్యాలు
తీరుస్తాయా ? దేశం సుభిక్షంగా ఉన్నప్పుడే విజ్ఞానం వర్థిల్లు
తుంది. చరిత్ర పేజీలు తిప్పితే దిన జీవితం పుష్కలంగా ఉన్న
రోజుల్లోనే, విజ్ఞాన సౌరభాలు దిగంత సీమలకు వ్యాపించి
నట్లు తెలుస్తుంది. ఈ విధంగా ఆకలికి అజ్ఞానానికీ అవినాభావ
సంబంధం ఉందని ఋజువవుతూవుంది.

అయితే యిన్ని ఆటంకాలున్నప్పటికి కొందరు దిదృ
క్షులు ఈ ఆశ్చర్యకరమైన విశ్వసృష్టి పొలిమేరమాటున దాగి
ఉన్న రహస్యాలను తెలుసుకున్నారు. తుచ్ఛమయిన
యింద్రియ బంధాలను విచ్ఛేదించుకుని, జ్ఞానజీవులై, కాల
దూరాలను అధిగమించి విదూర శూన్యంలోని గ్రహతారా
గణాల గర్భకుహరాలు పరిశోధించారు. విశ్వపు అవధులు

మట్టుకున్నారు. విశ్వ సౌధాలకు పునాదిరాళ్ళు అయిన అణు హృదయంలోకి ప్రవేశించారు. ఈ రీతిగా అణువునూ అజాం డాన్ని ఆకలించుకున్న ఆ జ్యోతిర్మూర్తులముందు సత్యం ప్రత్యక్షమయింది. మాటలకందని ఆ పరమానుభవంతో వారి భౌతిక జీవితాలు కృశించాయి. వారిలోని జ్ఞ[illegible] జ్యోతిమాత్రమె ప్రకాశించింది. దూర[illegible]ష్టి వారి ఋ[illegible] [illegible]లు మిథ్యగా ఋజువయినాయి. [illegible]కత్వం [illegible]విష్కరించింది. అనంతకోటి బ్రహ్మాండమండితమైన ఆకాశమే జటాజూటమైన ఆ సర్వజ్ఞులు ప్రత్యక్షమైన పరమసత్యం [illegible]ందు పారవశ్యంతో తాండవం చేశారు. ఆ వ్యోమకేశులకు భూమిదోమగా కనుపిస్తూఉంటే, యిక దేశాలు, జాతులు, కులాలు, పొలాలు, బలాలు తుచ్ఛ మనే మాటను కూడా చాలవంటే ఆశ్చర్యమేముంది? ఆ సత్య దృష్టి ప్రకారం అనంత విశ్వంలో భూగోళం ఒక సూక్ష్మ బిందువు అయినప్పుడు. ఆ బిందువులో మానవాతీతులమనుకునే భూస్వాములు, అధికారులు, అహంకారులు వగైరా సూక్ష్మ జీవులకు సూక్ష్మాతి సూక్ష్మబిందువులయితే గాని చోటు లభిం చదు పాపం!—అదీ జ్ఞానదృక్కుల లోకచిత్రణం!

ఈ విధమైన బ్రహ్మజ్ఞానాన్ని పొందినవారు ప్రాచీన కాలంలో ఒక్క భారతదేశంలోనే కనుపిస్తారు. డెమొక్రటిస్, సోక్రటీస్, మొదలైన విజ్ఞానులు గ్రీసులో ఉండేవారు కాని వారి విజ్ఞానం భారతీయ ఋషుల సునిశిత సుస్పష్టశాస్త్రం వంటిది కాదు. షడ్దర్శనాల్లో జరిగిన వాస్తవ విచారం శాస్త్రక్రమ మైన మహత్తర విజ్ఞాన వికాసమేగానీ, కేవలం బుద్ధి ప్రగల్భ మాత్రంకాదు. గ్రీసులో కొన్ని ఆధ్యాత్మిక భావాలు అంకు

రించినా వాటికిశాస్త్రంవంటిపరిణతస్వరూపంలేదని తాత్పర్యం. 17, 18 శతాబ్దాల్లో యూరపులో క్యాంటు, హ్యూము ప్రభృతులతోనే శాస్త్రీయమైన సత్యవివేచన ప్రారంభమయింది. భౌతిక శాస్త్రవిజ్ఞానం విస్తరించి విశ్వపు బాహ్య స్వరూపాన్ని అర్థంచేసుకుని వాళ్ళు యిప్పుడిప్పుడే అంతస్సీమలకు వెళ్ళుతున్నారు. ఈ శతాబ్దంలోనే పాశ్చాత్యులు మొదటిసారిగా "నేను" అనే విచిత్రం మీదికి దృష్టి సారించారు. అలెక్సికారల్ వ్రాసిన "మ్యాన్ ది అన్‌నోన్" అనే గ్రంథమే పాశ్చాత్యతత్త్వ విచారంలో పొడసూపిన ఈ పరిణామానికి ప్రథమ ప్రతిబింబంగా కనుపిస్తుంది.

ప్రాచీన భారతీయర్షులు వారు పొందిన బ్రహ్మానుభవాన్ని ప్రజాసంగ్రహణార్థం ప్రచారం చేశారు. ఉపనిషత్తులు, దర్శనాలు, యిత్యాది కేవలశాస్త్ర సామగ్రి కోవిద మండలికి మాత్రమే అనుభవసాధ్యం అవడంచేత, ఆ విజ్ఞానం సర్వమానవ పర్యాప్తం చేయాలనే మహదాశయం వారిని అష్టాదశ పురాణసృష్టికి పురికొల్పింది. శిలలకంటే చెట్లు గొప్పవనీ, చెట్లకంటె జంతువులు గొప్పవనీ, జంతువులకంటే మనుష్యజన్మ గొప్పదనీ, ఆ జన్మలోనే ఉత్తమ చింతనతో జీవితం గడిపినట్లయితే, మోక్షం లభిస్తుందనీ, హరికథా కాలక్షేపాల్లోనైతం ఆ విజ్ఞానమే సామాన్య రూపాలను సంతరించుకుని గోచరిస్తూ వుంటుంది.

లింకన్ బార్నెట్ అనే ఒక అమెరికన్ శాస్త్ర వాఙ్మయ రచయిత వ్రాసిన ఒక గ్రంథానికి తొలిపలుకు వ్రాస్తూ, ఐన్‌స్టీన్ మహర్షి ఈ ఆశయాన్నే ప్రస్తావించాడు.

నా గది గోడల్ని తేజోవంతం చేస్తూవుండే ఈన్‌స్టీన్ చిత్రం తరచూ నా దృష్టిని అకర్షిస్తూ వుంటుంది. ఆ ఆకర్షణ అనివార్యం. తైల సంస్కారం లేక నలుదెసలకూ విరిసిపోయిన నెరసిపోయిన తలవెంట్రుకలు ఆ మేధస్సులో పరిభ్రమించే అగణ్య తారాచక్రాలు విరజిమ్మే కాంతుల్లాగా భాసిస్తున్నాయి. "ఆకాశోజ్జ్వల కేశపాశుడు." ఏవస్తువుమీదా పడకుండా అన్నిటినీ దూసుకునిపోయి ఎక్కడో విశ్వపు సరిహద్దుల్లో సంచరిస్తున్నట్లుంటుంది ఆయన దృష్టి. ఏ దేశానికీ సంబంధించడు. ఏ జాతికీ చెందడు. ప్రపంచ పౌరుడు అనే పదానికి కూడా అందడు. విశ్వపౌరుడు. సత్యవేత్త, తత్త్వఖని. కపిల కణాద యాజ్ఞవల్క్య కుమారిల శంకరాది పరంపరలోనివాడు. అందుచేత అనాటినుంచీ యీ నాటివరకూ ఆ పరంపర పరమార్థము. సత్యాన్వేషణా, లోకకల్యాణము అందుచేతనే ఆ నాడు అష్టాదశ పురాణసృష్టి జరిగింది. ఈనాడు ఈన్‌స్టీన్ విజ్ఞాన పీయూషానికి కొందరేగాదు, ప్రపంచమానవులందరూ భోక్తలని ఉద్ఘాటించాడు. మారణకళాపారీణులై శాస్త్రజ్ఞానాన్ని గోప్యంగాఉంచుకునే క్షుద్రశాస్త్రజ్ఞుల్ని నిరసించాడు. విజ్ఞాన వాహిని అఖండం, అవిభాజ్యం, రాజకీయాది హద్దులూ, ఆటంకాలు దానికిలేవు అనే సందేశాన్ని లోకానికి యిచ్చాడు.

మన పూర్వులు యింత విజ్ఞాన సంపదను గడించి, ప్రపంచమానవులందరూ దానికి వారసులని వదిలిపెట్టి పోయినప్పటికీ, మనలో అనేకులు ఆ వారసత్వానికి అర్హతకూడా గడించుకోలేకున్నారంటే చాలా శోచనీయం. అర్థమూ,

అధికారమూ పరమార్థాలుగా పరిగణించి, అంతకంటే మనం సాధించవలసినవి లేవనుకుంటూ వాటికోసమే ఆర్రులుజాస్తూ, అవి లభించగనే పరమార్థం ఫలించినట్లుగానే భావిస్తూ, ఒక సంకుచిత మార్గంలో పోతున్నాము. అర్థం ఏమిటి అధికారం ఏమిటి? ఎట్లా అవి మానవసమాజంలో ఉద్భవించాయి? అవి ఉత్కృష్టమయినవా? నికృష్టమయినవా? మనం ప్రాకులాడ దగిన అర్హత వాటికున్నదా ? అవి మన అభ్యుదయానికి అంతరాయాలు కావా అని ఎవ్వరూ సవిమర్శగా ఆలోచిం చరు. జీవితాలు వ్యర్థంచేసుకుంటారు. ఈ హ్రస్వ దృష్టిని తొలగద్రోసుకుంటేనే వారికి సత్యాన్ని చూచే అవకాశం ఏనాటికైనా లభిస్తుంది.

ఈ కొండ లేమిటి, నదులేమిటి, నక్షత్రాలేమిటి, ఈ చరాచర సృష్టిఅంతా ఏమిటి. మనమేమిటి, అనే విచారం లేక కనుపించే మేడలు, మిద్దెలూ, అసెంబ్లీలూ, అధికారాలు, దర్పాలూ, డాంబికాలు, అంతవరకేచూస్తూ జీవించే జీవితం క్షుద్రమయింది. అందులో ప్రశంసించతగినదేమీ లేదు. అట్లాంటి వాడు మానవుడనే బిరుదొకటి తగిలించుకుని తిరగ టంలో అర్థంలేదు. వారికియిండ్లుకాదు, కోష్ఠాలు సముచిత స్థానాలు. పంచభక్ష్యాలు కాదు, పచ్చిగడ్డి సముచితాహారం. అట్లాంటివారిని జీవనభృతికోసం ఆశ్రయించవలసి వచ్చిందనీ, సేవించవలసి వచ్చిందనీ విచారిస్తుంటాను.

అధికార రోగపూరిత బధిరాంధక శవాలూ ధనైక లోభులూ, అసూయా, ద్వేషమూ, మొదలైన దుష్టజాడ్య పీడితులూ యిత్యాది నికృష్టజాతులకు ఆకాశపతనం అసమాన

ఔషధంగా పనిచేస్తుంది. నక్షత్రావలోకనం, నవజీవనాన్ని ప్రసాదిస్తుంది. ఉదయంనుంచీసాయంకాలంవరకూ, ప్రాపంచిక కోలాహలంలో బురదపూసుకుని యింటికివచ్చి నిర్మలాకాశం క్రింద పడుకుని పాలబాటలో కాస్సేపు పచారుచేస్తే, ఆకాశ గ్రంథాన్ని కాస్సేపు అధ్యయనంచేస్తే, బయట పూసుకుని వచ్చిన జంబాలపటలం వదలిపోయి నిర్మల మనస్కుడౌతాడు, ఈ అనంత విశ్వంలో తన స్థానాన్ని గుర్తించడంతో, ఏది అల్పం, ఏది అనల్పం ఏది సత్యం, ఏది అసత్యం ఏది తుచ్ఛం, ఏది స్వచ్ఛం అనే సత్యదృష్టి అవతరిస్తుంది. జీవితంలో దేనికి విలువనివ్వాలిఅనే విచక్షణా, దేన్ని ప్రతిఘటించాలి అనే ధైర్యమూ అవిర్భవిస్తాయి. ఇట్లా విశ్వ సూత్రాలను విదితం చేసుకోవడంతో మన దృక్పథమూ, మన జీవితమూ, మన సర్వస్వమూ మారిపోయి, దేశమూ, జాతి అనే క్షుద్రబంధాల నుంచీ భూగోళం సూర్యగోళం యిత్యాది విశ్వబంధాలనుంచీ బయట పడటమే కాకుండా మనం ఇంద్రియ పరిమితమై బాధాబంధురమైన శారీరక పంజరంనుంచే ఒకానొక ఆత్మ విముక్తిలాంటి అనుభవాన్ని పొంది కేవలం జ్ఞానజ్యోతిగా మాత్రమే ప్రకాశిస్తాము.

ఈ అనంతకాలంలో మానవజీవితం స్వల్పం. ఇందులో సగం నిద్రకు పోతుంది. మన దౌర్భాగ్య విద్యావిధానం పాతి కేళ్ళు వ్యర్థమైనా కాలేజీలకు, హైస్కూళ్ళకుగాను పొట్ట బెట్టుకుని, అపక్వ అసమర్థదశలోనే బయటకు త్రోస్తుంది. ఇక ఎంతకాలం మిగిలింది మానవుడికి! ఈ స్వల్పాతిస్వల్పకాల

మైనా సత్యవివేచనకు వినియోగించక భౌతిక అవసరాలే సర్వస్వంగా పరిగణిస్తూ వ్యర్థంచేయడం పొరపాటు. నిజం చెప్పాలంటే — సత్యం తెలుసుకుని పశుజీవితంకాని జీవితాన్ని గడపాలంటే ఉద్యోగాలను, వ్యాపారాలను, సంపాదనాపర మైన డాంబికమైన కార్యకలాపాలు విసర్జించి అవి అవసర మైనప్పటికే సాధ్యమైనంతవరకూ తగ్గించుకుంటూ, ఉన్నత లక్ష్యాలకోసమే కాలాన్ని వినియోగించాలి. ఈ విషయంలో మనం డ్యూటీ అనీ, బాధ్యత అనీ, కుహనా ధర్మాలు పాటిం చడం పరమమూఢత్వం. రుచికరమైన ఆహారంకోసం అంద మైన బట్టలకోసం, భవనాలకోసం, దిండ్లకోసం, తివాసీల కోసం, కాలమూ ఆలోచనా, వ్యర్థం చేయడం పాపం. గౌతమబుద్ధుడు ఇవన్నీ లేకనా వాటిని వ్యర్థమైన వన్నాడు? అశోకుడు కళింగదేశం తర్వాత జయించలేకనా యుద్ధం పరిత్యజించాడు? వివేకానందుడూ, అరవిందఘోషూ మొద లైన వారికి మన తాసిల్దార్లూ. కలెక్టర్లూ మొదలైన ఘనుల కున్నపాటి తెలివితేటల్లేకనా అధికారానికి ప్రాకులాడక, అధి కారాలకు అర్రులుచాచక, ఆశ్రమాల్లో పడివున్నారు? కాదు — జీవితంలో దేనికి విలువివ్వాలిఅనే విచక్షణాత్మక దృష్టి ఫలితమే అది. ఒక జీవితకాలం చాలదుకదా, అనేక జన్మలెత్తినా గడించలేని అపార విజ్ఞానాన్ని పాండిత్యాన్ని గడించినవారి జీవితాలు పరిశీలిస్తే, అదంతా వారెట్లా గడిం చారనేది తెలుస్తుంది. ఈనస్టీనుకు గడ్డం గీచుకోడానికి, మంచి దుస్తులు వేసుకోడానికి, భోజనం రుచులు విశ్లేషించ డానికీ దర్పమైన వేషంతో ప్రపంచ నాటకంలో పాల్గొన

దానికి కాలం ఉందనుకుంటే అది బుద్ధిమాలినతనమే అవు తుంది. ఇవన్నీ అతని దృష్టిలో అప్రధానం. స్నానంచేయడం, మానివేయడమే కాదుగదా వాల్మీకి ఒంటిమీద మట్టిపుట్టలు పెట్టుకుని పోతున్నాకదల్లేదు. మెదల్లేదు – లోకోత్తర పురుషు డైన వాల్మీకి మహారాజ సింహాసనానికి కూడా అతీతుడేగదా!

ఈ దృష్టి రావాలి ప్రతి మానవుడిలోనూ. దీనికి సాధనం వెనక చెప్పాను. ఆకాశపఠనం అసమాన ఔషధంగా పనిచేస్తుంది. నక్షత్రావలోకనం నవజీవనాన్ని ప్రసాదిస్తుంది. రోజూ పడుకోబోయేముందు ఒక గంటసేపయినా ఆకాశ గ్రంథాన్ని అధ్యయనం చెయ్యాలి.

# విజ్ఞానానికి అవరోధం

స్త్రీ పురుషాకర్షణ ప్రకృతి ధర్మం. శరీరంలోని ప్రతి అణువూ ఆ నిసర్గ పరితర్పణ కోసం ఆకాంక్షిస్తుంది, ఆక్రోశిస్తుంది; తృప్తిలభించకపోతే కృశించి నశించి పోతుంది. ఆ ఆకర్షణ కేవలం, ఏ ఒక్క ఆలింగనకోసమో కాదు, ఏ రతి క్రీడ కోసమో మాత్రమేకాదు. పోయేకొలది ఆ ఆకర్షణ, ఆ ఆకాంక్ష, సంపూర్ణ ఐక్యాను సంధానంకోసమే. ఎక్కడో, ప్రకృతి గర్భకుహారంలో ఉన్న అవ్యక్తానంద జ్వాలా సంతృప్తి కోసం యిరువురు అనుభవించే నిరంతర ఆవేదన అది. అందు చేతనే భర్తృహరి అన్నాడుగదా, "అదర్శనే దర్శనమాత్ర కామా, దృష్ట్వాపరిష్వంగ రసైకలోలాః, ఆలింగ తాయాం పునరాయతాక్ష్యా, మాశాస్మహే విగ్రహయోరభేదమ్—"

అయితే ఇది ఒక అనివార్యమైన ప్రకృతి ధర్మమని సామాన్యంగా గుర్తించరు, అర్థంచేసుకోరు. నీచకార్య మంటారు, పండితమ్మన్యులు నిగ్రహించుకోవాలంటారు. "ప్రకృతిలో సహజంగాఉన్నవాటిని జయించడమేగదా మానవుడి విలక్షణమైనశక్తి! అనేక ప్రకృతిశక్తుల్ని జయించి అనేక లోకోపకారక ఫలితాలు సాధించినట్లే కామశక్తిని కూడా నిగ్రహించి అంతకంటే ఉన్నతమైన లోకోత్తర కార్యాలకోసం ఆశక్తిని:వినియోగించడమే ఉత్తమపురుష లక్షణం"అంటారు. ఇక్కడ ఒక సూక్ష్మం ఉంది-గత సమాజ చరిత్ర పరిశీలిస్తే మానవ కృషికి పరమార్థం విజ్ఞాన శిఖరారోహణంగా కను

పిస్తుంది. వర్తమానంలోనూ భవిష్యత్తులోనూ ఇదే సత్యం. సృష్టికి మూలకారణమేమిటి? బ్రహ్మపదార్థం. అయితే అదేమిటి? అసలుసృష్టి ఏమిటి? ఇట్లాంటి అంతిమ ప్రశ్నలకు సమాధానాలు అన్వేషించడం—(ఇదేజ్ఞానము, అన్యజ్ఞానం జ్ఞానంకాదని తాత్త్వికులమతం) అట్లాంటి జ్ఞానాన్ని సాధించడానికి గాని లేక లోకంలో మరే ఉత్తమకార్యాన్ని సాధించడానికి గాని దినంలో ఎక్కువ భాగం దానికోసం వినియోగించాలి. అంటే, తదేక దీక్షతో పని చెయ్యాలి. ఉదాహరణకు గాంధీగారి జీవితం తీసుకుంటే, ఆయన దేశ స్వాతంత్ర్య సాధన కోసం యావజ్జీవితమూ అర్పించాడు. మరేపనీ చెయ్యలేదు. కనుకనే లక్ష్యాన్ని సాధించాడు. అట్లాకాక మామూలు ఉదర పోషణా నిమగ్నమైన జీవితం గడుపుతూ అందులో లభించిన స్వల్ప విశ్రాంతి కాలాన్ని లక్ష్యంకోసం వినియోగించి ఉన్నట్లయితే, ఆ లక్ష్యసిద్ధి ఈ జన్మలో జరిగిఉండేదికాదు. తన కృషికూడా అసమగ్రంగానే ఉండేది. గాంధీ మహాత్ముడేకాదు, ఎవడయినాసరే ఒకమహత్తర లక్ష్యాన్ని సాధించాలంటే వేళకు భోజనమూ స్త్రీజనమూ లభించాలనీ, వడ్డించిన విస్తరిలాంటి జీవితంకావాలనీ తాపత్రయపడటంపనికిరాదు. యావజ్జీవితమూ అంకితం చెయ్యాలి. ఇది అందరికీ సాధ్యమా? కాదు. ఎందు ఎందుచేతనంటే—వారికి భార్యాపిల్లలూ దారిలో అడ్డుగా నిలుస్తారు. వారిని పోషించాలి. తననుపోషించుకోవాలి. ఈ పోషణకు అవసరమైన ద్రవ్యార్జనకుగాను, కృషిచెయ్యాలి. ద్రవ్యార్జన అంత సులువైనపనికాదు కనుక, ఎక్కువకాలం దానికే వ్యయం అవుతుంది. యావజ్జీవితమూ దానికే అర్పిత

మవుతుంది. లక్ష్యం లక్ష్యంగానే మిగిలిపోతుంది. అందుచేత మనపూర్వులు లక్ష్యసాధనకు కుటుంబ భారం ఉండకూడదనే నిర్ణయానికి వచ్చారు. ఈ కుటుంబ భారానికి మూలకారణం ఎవరు ? స్త్రీ.

స్త్రీని కన్నెత్తి చూస్తేచాలు, ఈ దుష్టపరిణామాలన్నీ ఒకదానివెంట ఒకటి రావడం అనివార్యం. స్త్రీనిచూడగానే మోహం కలుగుతుంది. అది సంయోగానికి హేతువవుతుంది. ఆ సంయోగం సంతాన కారణం అవుతుంది. సంతానం సంపాదనావసరానికి దారితీస్తుంది. సంపాదనకు కృషి, కాల వ్యయమూ కావాలి. కృషి చేసినంత మాత్రంచేత సంపాదన ఉంటుందన్న గ్యారంటీలేని ఈ సమాజంలో, దరిద్ర భారం చేత సకుటుంబంగా ఆత్మహత్యలు చేసుకుంటున్న ఈ సమాజంలో, ఎంతకృషి ఎంత కాలవ్యయం చేసినా లాభంలేదు. అందుచేత జీవితాలు జీవితాలే ఉదర పోషణార్థం వ్యర్థంగా ఖర్చయిపోతున్నాయి. అట్లాంటి పరిస్థితుల్లో ఉత్తమ లక్ష్యా లనుగురించి ఆలోచించే అవకాశమేది ? అందుచేత వారు వైజ్ఞానికంగా పెరగరు. అజ్ఞానులుగానే చనిపోతారు. కనుక మనిషి వైజ్ఞానికంగా పెరగాలంటే అతడికి జీవితంలో కావలసి నంత వ్యవధి కావాలి. ఆ వ్యవధి కుటుంబ పోషణాభారం ఉన్నంత కాలం లభించదు. ఈవిధంగా కుటుంబపోషణా భారానికీ విజ్ఞానాభివృద్ధికీ వైరుధ్యం ఉంది

ఈ వైరుధ్యాన్ని అధిగమించి వైజ్ఞానిక సంపత్తిని గడించడానికి పూర్వం మన వారికి రెండు మార్గాలు గోచ రించాయి. ఒకటి—భార్యాపిల్లలున్నప్పటికీ. కోరికలు తగ్గించు

కుంటే, అంటే పటాటోపాలకు పరుగులెత్తకుండా క్లుప్తంగా బ్రతక గలిగితే కాలవ్యవధి జీవితంలో లభిస్తుంది. ఉత్తమ జిజ్ఞాసకు అవకాశం ఉంటుంది. అందుచేతనే "ఆశాపాశము తాకడున్ నిడుపు, లేదంతంబు రాజేంద్ర", అనీ "తృప్తిం జెందని మనుజుడు సప్తద్వీపములనైన చక్కంబడునే" అనీ ఆశను గర్హించడం, తృప్తిని ఉగ్గడించడం జరిగింది. భాగవతంలో రుక్మిణీ కల్యాణ ఘట్టంలో "ప్రాప్తలాభముదిత మానసులకు... వినతు లేనొనర్తు", అని కృష్ణపరమాత్మచేత అట్టివారికి నమస్కారం చేయిస్తాడు గ్రంథకారుడు. ఇక రెండవ మార్గం—స్త్రీసాంగత్యం చేయడ మెందుకు? తత్ఫలితంగా వచ్చిన పరిణామాలను భరించే స్తోమతలేక. జీవితావసరాలను క్లుప్తంచేసుకుని, సౌఖ్యాలకు దూరమై, జ్ఞానసంపాదనకుగాను క్లేశంతో బ్రతకడం ఎందుకు ? నీవేకాక నీతోపాటు భార్యాపిల్లల్నికూడా ఆ క్లేశానికి గురిచేస్తున్నావుకదా! ఇదంతా ఎందుకు ? అసలు స్త్రీ సాంగత్యమే లేకపోతే-ఆశను గర్హించ నక్కరలేదు. తృప్తిని పొగడవలసిన అవసరంలేదు. సులువుగా నీ సమస్య తీరిపోతుంది.

అందుచేత, ఎట్లాచూచినా స్త్రీ అజ్ఞానానికి కారణం, విజ్ఞానానికి ఆటంకం; అనే అభిప్రాయానికి వచ్చి స్త్రీని గర్హించడం పూర్వవిజ్ఞానుల సంప్రదాయం అయింది. ఎప్పుడు స్త్రీ ఆత్మనాశనహేతువని నిర్ణయించారో అప్పుడే ఆ నినాదాన్ని చాలా ఎత్తుకు తీసుకుని వెళ్ళారు. శాస్త్రాల్లో పురాణాల్లో కావ్యాల్లో సర్వత్రా స్త్రీ గర్హణ నింపివేశారు. "స్మృతా భవతి తాపాయ, దృష్టా చోన్మదకారిణీ, స్పృష్టాభవతి మో

హేయ, సానామదయతాకథం—" స్త్రీని తలుచుకుంటేచాలు తాపాన్ని కలిగిస్తుంది, చూస్తేచాలు పిచ్చి ఎక్కిస్తుంది, స్పృశిస్తేచాలు మోహ నిమగ్నుడ్ని చేస్తుంది, అట్లాంటిది ప్రియురాలేమిటి? అని ఆక్షేపిస్తాడు "—కాంతాకార ధరా నదీయ మభితః క్రూరాశయా నేష్యతే, సునారార్ణవ మజ్జనం యది తదా దూరేణ సంత్యజ్యతామ్"—స్త్రీ ఒక ఆకర్షణీయ మైన నది. అందులో పడ్డామంటే సంసార సాగరంలోకి కొట్టు కుని పోవడం తథ్యం. సంసార సాగరంలో పడగూడ దను కుంటే స్త్రీని దూరంగా త్యజించాలి, అని సలహా. "ప్రత్యక్షా శుచి భస్త్రికాం", అనీ "స్వర్గద్వారస్య విఘ్నో, నరకపుర ముఖం, సర్వమాయాకరండం," అనీ నానావిధాలుగా నిందిం చడం పూర్వనీతికర్తల ఆచారమయింది.

ఈ పని ఆరోజుల్లో ఎంతటి పెద్దవారుచేసినా వారిమీద మనకున్న ప్రమాణబుద్ధి ఎంతపాటిదయినా, వారి పద్ధతిని సిద్ధాంతంగా స్వీకరించి మోకరించడం సమంజసంకాదు. ఆ దృష్టిమానవుడికి విశిష్టభూషణమైన హేతువాదశక్తిని నిరర్థకం చేస్తుంది. అది ఆత్మహత్యా సదృశం.

ఈ ధోరణిలో ప్రధానంగా ఒకదోషం ఉందని స్పష్ట మవుతుంది. మానవలోకం అంటే పురుషుడే అనుకున్నారు. పురుషుడికే వైజ్ఞానిక అభివృద్ధి కావాలా? స్త్రీకి అక్కర లేదా! అక్కరలేదనడానికి మరొకరికి హక్కు ఉందా? ఉంటే అదెవరిచ్చారు? నీవు కల్పించుకున్నదే కదా? ఇత్యాది ప్రశ్న లన్నీ వస్తాయి. ఒకవేళ స్త్రీ స్థానం బలవత్తరం అయి స్త్రీకే విజ్ఞానాభివృద్ధి కావాలి, మగవాడికి అక్కరలేదు. మగవాడు

మోహకారణం, వాడిని కన్నెత్తి చూడగూడదు, చూస్తే సంసార సాగరంలో పడుతాము, అందుచేత మగవాణ్ణి నిందించాలి, త్యజించాలి'' అనే ఒకధోరణి బయలుదేరితే? అప్పుడెట్లా ఉంటుంది? అదట్లాఉంచుదాం. మగవాడే శాస్త్రాలువ్రాశాడు. కావ్యాలు చెప్పాడు. నగరాలు నిర్మించాడు. రాజ్యాలేలుతున్నాడు. శాసనాలు చేస్తున్నాడు. మానవ సమాజంలో జరిగే కృషిఅంతా మగవాడే చేయడంచేత అన్నీ పురుష పక్షంగానే ఉన్నాయి. అందుచేత ఈ సామాజిక పద్ధతి అంతా పురుషుడి అభివృద్ధికి దోహదం చేసేదే. కానీ దీనికి అతీతమైన ఒక న్యాయముంది. జ్ఞానాభివృద్ధి కావలసింది కొందరికిమాత్రమేకాదు, అందరికీ కావాలి, అందరికీ ఆ హక్కు సమానంగా ఉంది, అనేదే ఆ న్యాయం. అందరికీ అంటే కులమతాది కృత్రిమవర్గీకరణకు అతీతంగా అని అర్థము. అట్లాగే లింగ భేదంకూడా లేకుండా అని.

తన విజ్ఞానాభివృద్ధికోసం స్త్రీని తొలగించడము ఒక సంకుచిత దృష్టిమూలంగా అవలంబించిన ఉపాయమేగానీ, అది సహేతుకమైన సమగ్రమైన మార్గంకాదు. భౌతిక అవసరాలకోసం ఎక్కువకాలం వ్యర్థం అవుతుందని భార్యాపిల్లలను త్యజించాలనే సిద్ధాంతంకంటే, భార్యా పిల్లలు ఉన్నాసరే తానొక్కడే వారి భౌతిక అవసరాలకోసం కృషిచెయ్యవలసిన బాధ్యతలేని సామాజిక వ్యవస్థ సృష్టించుకున్నట్లయితే, ఎవరి బాధ్యత వారిదే అయిన వ్యవస్థ ఏర్పడితే, అంటే ఎవరిమీదా ఎవరూ ఆధారపడవలసిన అగత్యంలేని సమాజంవస్తే అప్పుడు

ఎవరూ ఎవరికీ భారంగా ఉండరు. వారి వారి పోషణకోసం వారే కృషిచేసుకుంటారు. అప్పుడు ప్రతివాడి జీవనభారం తగ్గిపోతుంది. కృషిచేయలేని శిశువులు, వృద్ధులు, కుంటి, గ్రుడ్డి ఇత్యాదుల బాధ్యత అందరూ కలసి భరించాలి. అంటే సమాజమంతా కలసి. అట్లాంటి వ్యవస్థలో స్త్రీ పురుషులు స్వతంత్రులుగా ఉంటారు. వారి అన్యోన్య సంబంధాలు స్వామి సేవకపద్ధతిలోగాక గౌరవ సహితంగా ఉంటాయి. భరించే వాడూ భరింపబడేదీ అనే సంబంధం లేదు గనక భార్యా భర్తలు అన్న వ్యవస్థ అంతరించి కేవలం స్త్రీ పురుషులుగా వుంటారు. దీని సారాంశం నాలుగు ముక్కల్లో చెప్పినా వ్యాఖ్యానంచేస్తే ఒక గ్రంథమంత తయారవుతుంది. ఈ విధంగా మానవులు తమ జీవన భారాన్ని తగ్గించుకుని, కాల వ్యవధిని సంపాదించుకుని, వైజ్ఞానిక పురోగమనం పొందగల ఒక న్యాయమైన పద్ధతి వుండగా స్త్రీని నిందించడం మూఢత్వమే అవుతుంది.

**అయితే** మన దేశంలో ప్రాచీన సామాజిక వ్యవస్థ పరిశీలిస్తే స్త్రీని త్యజించి బ్రతకడం అసాధ్యమనీ, అసహజమనీ, సమాజ వ్యతిరేకమనీ భావించినట్లుగా కూడా గోచరిస్తుంది. అందుచేతనే వారు ఆశ్రమధర్మం ప్రతిపాదించారు. గృహస్థాశ్రమం కర్తవ్యంగా చెప్పారు. తర్వాత వానప్రస్థం, భార్యాసమేతంగా వనాలకు వెళ్ళి అక్కడ ఉత్తమ జిజ్ఞాసతో జీవించడం. ఒకేసారి ఒక్కగంతులో బ్రహ్మచర్యాశ్రమం నుంచి సన్యాసాశ్రమానికి వెళ్ళగూడదా అంటే, ప్రకృతి విరుద్ధమైన పనిచేసి, దాన్ని తుదముట్ట నిర్వహించలేక ఆ పని

భగ్నం అవడంకంటే క్రమంగా ముందుకు వెళ్ళినట్లయితే అది సవ్యంగానూ దృఢంగానూ ఉంటుందని వారు భావించారనేది స్పష్టం. గృహస్థాశ్రమంలో కొంత భౌతికతాపం చల్లారుతుంది. అవశేషం ఏదయినా ఉంటే వానప్రస్థంలో పూర్తిగా నశించి పురుషుడికి-స్త్రీ అవసరం లేకుండా పోతుంది. అప్పుడు పురుషుడు నిర్వికారంగా వైజ్ఞానిక కృషిలో నిమగ్నం కావచ్చు. అయితే ఇక్కడే వస్తుంది ప్రధానమైన ప్రశ్న. జీవితమంతా పురుషుడి పాదసేవచేస్తూ నీడలాగా వెంటనంటి సంచరించిన స్త్రీని వనంలో పరిత్యజించి సన్యాసాశ్రమం స్వీకరిస్తే, ఆ స్త్రీ గతి ఏమిటి? వనంలో క్రూరమృగాలకు ఆహారం కావాలా? లేక సమాజంలో అంతకంటే క్రూరమృగాలకు బలికావాలా? కాదు, తానూ ఒకప్రక్క కూర్చుని తపస్సు చేసుకోవచ్చునంటే, అది సరియైన సమాధానంకాదు. తానేమి తపస్సు చేస్తుంది? పురుషుడు బ్రహ్మచర్యంనుంచి విజ్ఞానాభివృద్ధి పొందుతూ తదభివృద్ధికి పరిణామంగా అతనికి సన్యాసం అవసరమయింది, తపస్సు చేసుకుంటున్నాడు. స్త్రీకి జీవితంలో ఆ వైజ్ఞానిక పరిణామమేది? అందుచేత తపస్సు చేసుకో అని చెప్పి వెళ్ళిపోవడం బాధ్యతారహితమైన సమాధానం. అయితే ఈ బాధ్యత పురుషుడికి ఎట్లా వచ్చింది? అది స్వయంకృతాపరాధము. పురుషుడే స్త్రీ స్వాతంత్ర్యాన్ని తొలగించి, స్త్రీ అభివృద్ధిని నిరోధించి, అ బాధ్యత తనమీద వేసుకున్నాడు. ఆ బాధ్యతే తన అభివృద్ధికి ఆటంకమయింది.

ఇక స్త్రీ తప్పిదమేమిటని విచారిస్తే, స్త్రీ కృషి చేయకుండా జీవన సౌకర్యాలు అనుభవించే ఒక సులువైన పద్ధతి

కోసం తన స్వాతంత్ర్యాన్ని పురుషుడికి అమ్మివేసి ఆత్మగౌర వాన్ని కోల్పోయింది. శేషశయ్యాగతుడయిన విష్ణువు పాదాల చెంత జేరి పాదసంవాహనంచేసే లక్ష్మి స్త్రీకి ఆదర్శమయింది గానీ, శివుడిలో సగం పంచుకొని నిలిచిన పార్వతి ఆదర్శం కాలేకపోయింది.

ఈనాడు మార్పు చెందుతూ ఉన్న పశ్చిమ దేశాల్లో స్త్రీ పురుషుల ప్రణయ గాథలకూ, మన దేశంలో ప్రణయ గాథలకూ ఎంతో భేదం కనుపిస్తుంది. మన సాహిత్యంలో నాయికలు భర్తకు పరిచారికలుగను, భర్త దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి జీవించేవాళ్ళుగాను ఉంటారు. అదే ఆదర్శ భారత నారీమణి పద్ధతి అని యింకా అంటారు మనలో కొందరు. స్త్రీని ఇట్లాచిత్రించే చలనచిత్రాలు చూచినా సాహిత్యం చదివినా ఆడపిల్లలను గన్న తండ్రులకు కడుపు మండిపోతుంది. "నేను కన్న నా చిన్నారితల్లి ఇట్లాంటి కడ గండ్లపాలు కావాలా ? అయితేనే గొప్పది లేకపోతే కాదా? అందులో పురుషుడి దుష్ప్రవర్తనకి శిక్ష ఉన్నట్లు చూపించడే? ఎవడీ నవలవ్రాసిన వెధవ, ఎవడీ చిత్రం తీసిన గాడిద?" అని ఆగ్రహ పరవశులవుతారు. అవ్వాలి. అవకపోతే వాడు మూర్ఖుడన్నమాట. పశ్చిమదేశాల ప్రణయంలో స్త్రీకి ఇంత నీచమయినస్థాయి కనిపించదు. స్త్రీ పురుష సంబంధాలు సమానస్థాయిలో ఉంటూ గౌరవప్రదమైన ప్రవర్తనతో కూడుకొని ఉంటాయి. మన భారతీయ వాఙ్మయంలో బహుశా శరత్ చంద్రచటర్జీ సమగ్రంగా కాకపోయినా చాలావరకు గౌరవప్రదమైన పద్ధతిలోనే స్త్రీస్థానం చిత్రించాడు. ఆయన

దేవదాసులో పాత్ర పార్వతి నాకు పూర్తిగా నచ్చదు కనుక "సమగ్రంగా కాకపోయినా చాలావరకు"అని వాడాను. నాకు శేషప్రశ్నలోని కమలపాత్ర ఆదర్శప్రాయంగా కనుపిస్తుంది— బహుశా శరత్ హృదయంకూడా అంతేనేమో.

స్త్రీ పురుషులమధ్య సమానత్వం రావాలి అని మనం తరచుగా అనుకునేది కేవలం ఒక సాంఘిక దృశ్యాన్ని ఉద్దేశించి మాత్రమే. అంటే అది అడుగుకుపోయి సమగ్రంగా అవగాహన చేసుకుని చెప్పే మాట కాదనిభావం. స్త్రీ పురుష సమానత్వం అంత సులువుగా వచ్చేదికాదు. పునాదులనుంచీ సమాజాన్ని పునర్నిర్మాణం చేస్తేకాని సాధ్యంకాదు.. ఉపన్యాసాలతో రాదు, వ్యాసాలతో రాదు, లేకపోతే స్త్రీ పురుషులు సమానంగా కుర్చీల్లో కూర్చున్నా ఉద్యోగాలుచేసినా అంతమాత్రంతో రాదు. దానికి ఒక్కటే మార్గం. స్త్రీకి ఆర్థిక సమానతవస్తే సాంఘిక సమానత వస్తుంది. ఆర్థికస్థితివున్న స్త్రీలు ఇప్పుడుకూడా పురుషుడితో సరిసమానంగా గౌరవంగా వున్నారు. ఇది నిత్యజీవితంలో కనుపించే దృశ్యం. సమాజమంతా ఆ విధంగా నిర్మాణం అయిననాడు అది సుస్థిరం అవుతుంది. సాంఘిక సమానత రావాలంటే ఆర్థిక సమానత రావాలి అనడం ఒక్క స్త్రీకి వర్తించేదేకాదు. ఎవ్వరికయినా అంతే. ఆర్థిక సమానతే అన్ని సమానతలకూ మూలకారణం. ఆర్థిక సమానత మూలంగానే వైజ్ఞానిక సమానతకూడా సాధ్యమవుతుంది. ఆర్థికసమానతకోసం లోకంలో వ్యాపిస్తూవున్న మానవకల్లోలమంతా చివరకి వైజ్ఞానిక సమానత్వం కోసమే. ఇది తెలియకుండా జరుగుతున్న సృష్టిపరిణామం. ఈ నిగూఢ

సత్యాన్ని ద్రష్టలు అయినవారు అర్థంచేసుకుంటారు. కాని వారు ఈ కల్లోలాన్ని ఈసడించుకుంటారు.

మానవులు ఋషులుగా, ఋషులు అనిమిషులుగా మారడం సృష్టిపరిణామధోరణి. ఈ పరిణామాన్ని ఏశక్తీ అడ్డలేదు. ఈ పరిణామమార్గంలో వున్న ఆటంకాల నన్నిటినీ మానవుడు అధిగమిస్తాడు. మానవాత్మ భౌతిక అవసరాలనే పంజరంలో బంధింపబడివుంది. కానీ యీ పంజరంలోనుంచి బయటపడి స్వేచ్ఛగా వ్యూహావిహాయసంలోకి ఎగిరిపోవాలని తహతహలాడుతూ వుంది మానవాత్మ. తిండి బట్ట యిల్లు అనేవాటి కొరత మానవుణ్ణి పైకి ఎగిరిపోనీకుండా భూమికి బంధించింది. ఈ భౌతిక బంధాలను త్రెంచుకుంటున్న దృశ్యమే సమానత్వం కావాలనీ, సౌకర్యాలు కావాలనీ, అందరికీ తిండీ బట్టా ఉండాలనీ ఈనాడు భూనభోంతరాళం నిండా వ్యాపిస్తున్న కోలాహలం. పూర్వం ఏ ఒక్క జీసస్సో, గౌతముడో ఈ భావాలు చెప్పారు. కానీ సమాజంలో ఏ ఒక్కరి ద్వారానో భావాలు వ్యాపించే దశ గతించింది. భావాలు వాస్తవరూపం ధరించే దశ వచ్చింది. దానికోసం ఉద్యమాలు బయలుదేరుతున్నాయి. లోకంలో ఒక ప్రజాసంఘటనాధోరణి ఉదయించింది. అసంతృప్తితో అన్యాయంతో అలమటించే మానవులందరూ కలుస్తున్నారు. సంఘటిత శక్తిగా రూపొందుతున్నారు. ఎవడిబాధ వాడు తీర్చుకోవడానికి ప్రయత్నించే రోజులుపోయి, సమానబాధలున్నవాళ్ళంతా కలసి సంఘటిత మయ్యే రోజులు వచ్చాయి. ఈ సంఘాలు ఈ ఉద్యమాలు అపూర్వం. ఇవన్నీ పరిశీలిస్తే అంతర్గతంగా ఒక సత్యం గోచ

రిస్తుంది.—అందరికీ భౌతికబాధలు నివారణ కావాలి. భౌతిక బాధాపంజరంనుంచి మానవులందరూ విముక్తి కావాలి. ఎందుకు? ఇంకా ఎత్తుకు ఎగిరిపోవడానికి. కేవలం భౌతికజంతువుగా వున్న మానవుడు వైజ్ఞానిక జీవిగా మారడానికి. అందుచేత ఈ నూతన అలజడి కేవలం "పొట్ట ఆత్రంతో" చేసే గోల అనుకోవడం అవివేకము, గ్రుడ్డితనము.

తొలుత స్త్రీ ఆటంకమని భ్రమపడ్డాడు. కానీ క్రమముగా అసలు ఆటంకమేమిటో అర్థంచేసుకుంటున్నాడు. ఎవరోకాదు. స్త్రీ తన తల్లి, తన చెల్లెలు, తన అక్క, తన కూతురు, తన భార్య—అనేక రూపాలుగా స్త్రీ తన జీవితంలో వ్యాపించి, తన ఉనికికే కారణమై, తనలో సగమై తానే అయిన స్త్రీ తన అభివృద్ధికి ఎట్లా ఆటంకం అవుతుంది? నిజంగా స్త్రీ అభివృద్ధిని నిరోధించడం మూలాన తనకే అపకారం జరుగుతూవుంది. తనలో ఒక భాగాన్ని నిహతం చేసుకున్నట్లవుతూఉంది. ఆ వెనకబడ్డతనం, ఆ లోపం తన పిల్లలకు వస్తూఉంది. తద్వారా భావితరానికి అపకారం చేస్తున్నాడు పురుషుడు. పురుషుడు ముందుకు వెళ్ళాలంటే, తన స్త్రీ వెనుకబడుతూవుంటే, జీవితం దుర్భరమై తన అభివృద్ధి నిరోధించబడుతూవుంది. ఇది వర్తమానానికి చేస్తున్న అపకారం—పోతే సమాజానికే ఇది తీవ్రమైన అపకారం. సమాజంలో చెరిసగం జనాభా పురుషుడిమూలంగా వెనకబడి ఉంటే, మానవాభ్యుదయంకోసం సమాజంలో సగంమందే కృషిచేస్తున్నారన్నమాట. సగంమందివూరికేఉన్నారు. వారూ కృషిచేస్తే మానవాభ్యుదయం ఇంకా స్పీడుగా కొనసాగేది.

మార్గం సుగమం అయ్యేది. దాన్ని నిరోధించడంచేత పురు షుడు సమాజానికి అపకారం చేస్తున్నాడు—ఇదంతా మానస పుడిలో ఈనాడు చెలరేగుతున్న అంతర్గత భావపరిణామం. అందుచేత తన ఆటంకం స్త్రీలో లేదు. ఇరువురి అభివృద్ధికీ ఆటంకం మరోకచోట ఉంది. అదే తన భౌతిక అవసరాలు తీర్చని సామాజికవ్యవస్థ. ఆ పంజరంలోచిక్కి భౌతికఅవసరాల పూచల్లోంచి విశాలాకాశంలోకి చూస్తూ ఆవేదన పడుతూ వుంది మానవాత్మ. ఆ పూచలు విచ్ఛిన్నం చేస్తాడు. విజ్ఞానా భ్రంలోకి ఎగిరిపోతాడు. మానవుడు ఋషి అవుతాడు.

ఆ దశలో సమాజం ఒక స్వేచ్ఛాజీవుల సముదాయం. ఈనాటి నీతులు ఆనాడు అర్థరహితం అవుతాయి. ఇప్పుడు దయ, త్యాగము, సౌజన్యము గొప్పగుణాలు. ఎందు చేతనంటే యిప్పుడు కొందరు పీడితులున్నారు. ఈ గుణాలు ఉండకపోతే పీడితులకు ఉపకారం జరగదు. ఆ విధంగా నిరంతరమూ ఒకవైపు పీడితులూ మరోకవైపు దయామ యులు త్యాగశీలురు ఉండడం ఈసమాజలక్షణం. పీడితవర్గం పోయి సమాజంలో అందరూ సమానం అయితే ఎవరి త్యాగమూ ఎవరికీ అక్కరలేదు. సర్వమానవ సమానత్వం సాధించిన భావి జగత్తులో ఈ కృత్రిమ మహాపురుషులుండరు. అందరూ అప్పుడు మహాపురుషులే. అందుచేత విశేషమేమీ లేదు.

ఆ దశలో మానవులు నిర్వికారులు. నిర్గుణులు. నిర్లి ప్తులు. ఆకాశంలో విహరించే పక్షుల్లాగా వారికి ఆస్తి ఉండదు. నిరంతరం స్వేచ్ఛగా ఆనందంగా ఉంటారు. కామ

క్రోధ లోభమోహ మదమాత్సర్యాలు అంతరించి శమ దమాది గుణ సంపత్తి ప్రబలుతుంది. అందుచేత బహిర్గత గవర్నమెంటు పనిలేక అంతర్ధానమైపోతుంది. మానవుడిలో ఒక అంతర్గత గవర్నమెంటు అవతరిస్తుందన్నమాట. ఆమానవుడి లక్షణం "ఒరులేయవి యొనరించిన, నరపం. అప్రియము తన మనంబున కగు తా నొరులకు నవి సేయకునికి పర్గాయణము పరమధర్మపథముల కెల్లన్" అనే పద్యంప్రకారం నడుచుకోవడం.

తర్వాత పరిణామం మరొక దశకు సాగిపోతుంది. "మానవ సమాజంలో ఒక వర్గానికి పరిమితమై ఉన్న జీవన సౌఖ్యాన్ని వర్గాతీతంచేసి సమాజానికంతా పంచిపెట్టాము, యావత్ సమాజమూ అభ్యుదయ పథంలో నిరాఘాటంగా పురోగమిస్తూ ఉంది, కానీ విశ్వ సృష్టిలో ఈ ధర్మాన్ని ఒక మానవ సమాజానికే వర్తింపజేయడం న్యాయమా?" అని ప్రశ్నించుకుంటాడు. సృష్టిలో మానవుడేకాదు, ఇంకా ఎన్నో అశేష జీవరాసులున్నాయి. వాటికి జ్ఞానభాగం వర్తించక పోయినా, జీవన సౌఖ్యాన్ని విస్తరింపజేయడం కర్తవ్యం కాదా అనే హేతువాదం ప్రజ్వలిస్తుంది — అప్పుడు ఎండలో తిండిలేక అలమటిస్తూ వచ్చిన కుక్కకు తిండిపెట్టి ఆదరిస్తాడు. మేఘాలు ఉరిమి, ఝంఝామారుతం వీచి, కుంభవృష్టి కురిస్తే కొమ్మల్లోని గూడు నేల కూలితే, ఇల్లులేక, చలికి తాళలేక కిటికీలో తలదాచుకున్న పక్షికి ఆశ్రయమిస్తాడు. లేగ దూడల నోళ్ళుకొట్టి గేదెలపాలు, ఆవులపాలు త్రాగడు. తన

జిహ్వాచాపల్యం తీర్చుకోవడంకోసం కోళ్ళను గొర్రెలను గొంతులుకోసి వాటి భార్యాపిల్లల కడుపులో చిచ్చు పెట్టడు. చిగురించి, పూచి, కాచి పచ్చగా బ్రతుకుతున్న చెట్లను తీగ లను తన శరీర పోషణకోసం హింసించడానికి పూనుకోడు. "శాకాహారులు కందభోజులు శిలోంఛప్రక్రముల్ తాపసుల్," అనే స్థితిని దాటిపోతాడు. ప్రస్తుత ఆహారం మాని, ఆహారం పరమార్థమేదో దాన్ని నెరవేర్చే ఏదో నిర్జీవ పదార్థాన్ని శాస్త్రజ్ఞాన సహాయంతో మాత్రలు చేసుకుని భుజిస్తాడు. తనకు వూడిగం చెయ్యడానికి ఎడ్లనీ గుర్రాల్నీ అణచి, వాటి మూపులమీద పెట్టిన దాస్యభారాన్ని తొలగించి స్వేచ్ఛగా వదలివేస్తాడు. యంత్రం ఈ పరిణామానికి దోహదం చేస్తుంది. శాస్త్రజ్ఞానం సహకరిస్తుంది.

ఇట్లాంటి విశ్వవిస్తృత వ్యవస్థ రూపొందేసరికి సమాజ చిత్రం విచిత్రంగా ఉంటుంది. శీతాతపాలనుంచి రక్షించుకో డానికి ఇళ్ళు ఉంటాయేగానీ, తనది అని దాచుకోవలసిన దేన్నయినా రక్షించుకోడానికి కాదు. అందుచేత తలుపులు తాళాలు, కాంపౌండుగోడలు అప్పుడు ఉండవు. అవి ఇప్పుడు ఉండడం మనస్వార్థానికి నిదర్శనమేగానీ మన సంస్కారాని కాదు. మనవారి స్వార్థం ఎంతదోగదా! భూమిలో ప్రతి అంగుళం కొలిచి లెక్కవేసి స్వంతం చేసుకుంటున్నారు. దాన్ని జాగ్రత్తగా కొలవడానికి ఒక సర్వే డిపార్టుమెంటు పెట్టారు. ఉత్తరోత్తరా తప్పీలు రాకుండా ఉండగలందులకు గాను పత్రాలమీద వ్రాసి హక్కును శాశ్వతపరచడానికి రిజిస్ట్రేషను ఆఫీసులు పెట్టారు. దాన్ని రక్షించడానికి శాస

నాలు తయారుచేశారు. ఆ శాసనాలు అమలుజరగడానికి కోర్టులు నెలకొల్పారు. వాటికి మద్దత్తుగా సైన్యాలు సిద్ధం చేశారు. ఆ స్వార్థాన్ని సుప్రతిష్ఠితం చెయ్యడానికి ఎంత తాపత్రయపడుతున్నారు!

కానీ ఆదశలో ఇవేవీ ఉండవు. తన భార్యా పిల్లలే గాక, ఆవులు, గేదెలు, కుక్కలు, కాకులు అన్నీ కలసి తన కుటుంబంగా భావిస్తాడు ఆనాటి మానవుడు. అది, "యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవాను పశ్యతి" అనే ఉపనిషద్వాక్యం అమలుజరుగుతున్న దశ. ఋషులదశనుంచి అనిమిషుల దశకు వెళ్తారు.

అంటే సృష్టిచైతన్యరహితమైన నిర్జీవ పదార్థంఅయి, తర్వాత జీవపదార్థంగా రూపొంది చైతన్యవంతమై, ఆ చైతన్యం వృక్ష మత్స్య కూర్మ వరాహాది పరిణామంలో క్రమాభివృద్ధి చెంది, మానవదశచేరి, సంస్కారమార్గంలో పురోగమించి, తపించి జపించి తననుతానే అర్థంచేసుకుని, "తత్త్వమసి" అనే మహావాక్యాన్ని అనుభవించి, తనలో తాను లీనమైపోతుంది. సృష్టిలోనుంచే మానవుడు వచ్చాడు. మళ్ళీ సృష్టిలోనే కలిసిపోతాడు. "పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే! పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే."

# విజ్ఞానంలో ఊహ పాత్ర



ఒకప్పుడు నేను ఏకాంతంగా కూర్చొని దూరపు కొండలుచూస్తూ సాయంత్రంవేళ గడుపుతూవుండగా, హఠాత్తుగా ఒక చిత్రమైన ఆలోచనవచ్చింది. "ఈ భూగోళానికి ఒకవైపునుంచి మరొకవైపుకు కేంద్రంగుండా ఒకపెద్ద రంధ్రం త్రవ్వితే ఏమవుతుంది?" అని. ఆపని సాధ్యమా ? ఒకవేళ సాధ్యమైనా మానవాళిమీద, అసలు భూగోళంమీద దాని ఫలితాలేమిటి ? అని ఆలోచనలు ఒకదానిమీద ఒకటి అరేబియన్ గుర్రాల్లాగా పరుగెత్తసాగాయి.

మనిషికి అసాధ్యమయినదంటూ లేదు అనే సిద్ధాంతం ఈ ఆలోచనకు పునాదిగా నిలిచింది— మానవుడు ఆకాశాన్నంటే పిరమిడ్డును కట్టలేదా ? 'క్రీస్తుకు పూర్వం 5000–3200 సంవత్సరాల మధ్య ఈజిప్టులో పిరమిడ్లు అనే చిత్రమయిన గోపురాలు ఈజిప్టు రాజుల్ని సమాధిచేయడానికిగాను కట్టారు. పిరమిడ్ నేలమట్టం దగ్గర నలుచదరంగా వుంది. పైకి పోను పోను వెడల్పు తగ్గుతూ, చివరకు శిఖరంగా మారుతుంది. దానిఎత్తు 480 అడుగులు, నాల్గుపార్శ్వాల్లో ఒక్క పార్శ్వం నేలమట్టం దగ్గర 755 అడుగులు. 5 మిలియన్ల టన్నుల రాళ్ళతో ఒక్కొక్క పిరమిడ్ నిర్మించారుట. అంటే పిరమిడ్ ఎంత బ్రహ్మాండమైన నిర్మాణమో వూహించండి. అద్భుత మానవశక్తికి యింకా చిత్రమైన మరొకనిదర్శనం చూడండి. క్రీస్తు పూర్వం 200 ఏళ్ళ క్రిందట షిహువాంగ్‌టి అనే చక్ర

వర్తి చైనా చరిత్రలో మొదటిసారిగా యావత్ చైనాను ఒక్క గొడుగుక్రిందికి తెచ్చి ఏలాడట. ఆయన చిన్ అనే వంశానికి చెందినవాడు. చిన్ వంశాన్నిబట్టి చైనా అని దేశం పేరు వచ్చింది. ఆ చక్రవర్తి శత్రువుల దాడినుండి దేశాన్ని రక్షించడానికిగాను బ్రహ్మాండమయిన గోడ ఒకటి దేశపు సరిహద్దుల్లో కట్టించాడు. దాని పొడవు 1,800 మైళ్ళు. 50 అడుగుల ఎత్తు, 25 అడుగుల వెడల్పు. కాల్చిన ఇటుకలు, బురద కలిపి, ఆ గోడ కట్టారు — పోతే ఈనాడు ఆకాశంలో పరుగెత్తే స్పుత్నిక్కులను చూస్తూనే వున్నాము. ఇంకా చిత్రమేమిటంటే చిరకాలం స్వప్నంగావున్న జీవోత్పత్తికూడా సూత్రప్రాయంగా మానవుడు 1962 ఆగస్టు మాసంలో సాధించాడు.

ఇవన్నీ చూస్తూంటే భూగోళానికి రంధ్రం వెయ్యలేడా అనిపిస్తుంది, శాస్త్రదృష్ట్యా మాత్రం అది అసాధ్యం కాదు. భూమధ్యరేఖమీదవున్న సింగపూర్‌లోగనుక రంధ్రం త్రవ్వడం ప్రారంభిస్తే అది కేంద్రంగుండా వెళ్ళి అవతలివైపున భూమధ్యరేఖమీదనేవున్న (దక్షిణ అమెరికా) ఈక్వేడార్ ప్రదేశంలో తేలుతుంది. అంటే సింగపూరులో ఎవరైనా ఆ రంధ్రంలోకి దూకితే దక్షిణ అమెరికాలోని ఈక్వేడార్‌లో పడిపోతాడు. అంతేనా లేక భూమధ్యకేంద్రం వచ్చేసరికి అతని గమనం ఆగిపోతుందా? ఇక్కడ ఆలోచన ముడిపడుతుంది. మొత్తంమీద ఇది మానవ ప్రయాణవిషయంలో ఒక గొప్ప సంఘటనగా మాత్రం తయారవుతుంది. భూమి చుట్టుకొలత సుమారు 25000 మైళ్ళు. భూభ్రమణవేగం గంటకు 1000

మైళ్ళు దాని వ్యాసం 8000 మైళ్ళు. అంటే సింగపూరు నుండి ఈక్వెడారుకు చేసిన రంధ్రం పొడవు 8000 మైళ్ళు ఉంటుందన్నమాట. భూమిమీద ప్రయాణించేస్తే సింగపూరు నుండి ఈక్వెడారుకు సుమారు 12500 మైళ్ళు ఉంటుంది. సింగపూరు రంధ్రంగుండా గనుక అయితే దూరం 4500 మైళ్లు తగ్గుతుంది. ఇది ఒక మహత్తరమైన విషయం. ప్రయాణంమాట అట్లావుంచి ఇంకా ఎన్ని చిత్రమైన విషయాలు తెలుస్తాయో! ఈరంధ్రం మూలంగాను భూగోళపు అంతర్భాగము సంగతులు ఎన్నో తెలుస్తాయి. భూకంపాల కారణాలు, కొండలు, సముద్రాలు, వగైరాల మార్పుల విషయాలు, ఎన్నో తెలుస్తాయి.

అయితే, ఈ కార్యంలోవున్న సాధకబాధకాలు చాలా చిత్రంగా వుంటాయి. భూగోళం ఒక్క గంటకు 1000 మైళ్ళ వేగంతో తన కేంద్రంచుట్టూ తాను తిరుగుతూవుంది. ఈ పరిభ్రమణమే దివారాత్రాలకు కారణం. ఇంత వేగంగా తిరుగుతూవున్న పరిభ్రమణం చేతనే భూమికి ఆకర్షణశక్తి ఉద్భవించింది. పరిభ్రమణం లేకపోతే భూమి గోళంగా ఉండలేదు. పొడిపొడిగా విడిపోతుంది. ఆ పొడిగా అవటం అణువులవరకు కూడా విచ్ఛిన్నంకావచ్చు—ఈ కారణాలమూలంగా భూకేంద్రము గోళపు అంచులను ఆకర్షిస్తూ వుంటుంది – అందుచేత కేంద్రంవరకు చేసే గమనం పాకడం అవుతుంది. అతి సులువైన పని. కాని, అక్కడనుండి అవతలి అంచుకు వెళ్ళడం మాత్రం దూకడం కాదు. పైకి వెళ్ళడం అవుతుంది—అంటే కేంద్రం చేరిన తరువాత మనిషి కేంద్రాకర్షణశక్తిని

అధిగమించే ప్రయత్నం చేయండే ఏ అంచుకూ వెళ్ళలేదు. అంటే మన సింగపూరు అంచుకుకూడా అన్నమాట! అయితే ఈ మహత్తర కృషిలో మానవుడు సులువుగా సాధించిన లాభం ఒకటి. ఏమిటంటే 4000 మైళ్ళ వరకూ అంటే భూగో ళపు అంచునుంచీ కేంద్రంవరకూ ఏ శ్రమాలేకుండా కారు గానీ, రైలుగానీ, విమానంగానీ లేకుండా సులువుగా చేర వచ్చు. ఆ మిగతా 4000 మైళ్ళకోసం మాత్రమే ఏదో ఒక ఏర్పాటు చేసుకోవాలి—మరొకటి. ఈ రంధ్రం త్రవ్వుతూ వుంటే కేంద్రాకర్షణశక్తిమూలంగా రంధ్రం పూడిపోతూ వుండదా? ఇది ఒక ప్రశ్న. అ అవకాశంవున్నా దాన్ని ఎదుర్కొని రంధ్రం త్రవ్వవచ్చు. ఇది బైబిల్లో చెప్పిన బేబెల్ స్తంభ నిర్మాణం లాంటిది. సర్వమానవాళీ కలిసి చెయ్యవల సిన కార్యమేగానీ, ఆటంబాంబుల నిర్మాణంలో పోటీపడ్డట్టు ఈ విషయంలో గనుక దేశాలు దేశాలమధ్య పోటీవచ్చి తల కొక రంధ్రం త్రవ్వడం ప్రారంభిస్తే ఇంకేముంది!

ఇట్లా పడకకుర్చీలో కూర్చుని ఆలోచిస్తూ, ఉన్న ట్టుండి ఇది ఎంత గమ్మత్తయిన వూహా అని ఉలికిపడి లేచాను. మరుసటిరోజు హిందూ పత్రిక ఎడిటర్‌కు ఈసంగతి ఉత్తరం రూపంగా వ్రాశాను. కానీ, పిచ్చివ్రాత అనుకున్నా రేమో ప్రకటించలేదు. ఆ ఉత్తరంకోసం ప్రతిదినమూ పత్రిక చూచేవాణ్ణి. ఇట్లా చూస్తూవుండగా, నా ఉత్తరం కనుపించ లేదు సరిగదా, ఒక చిన్న రిపోర్టు కనుపించింది. అది చూసే సరికి నాకు ఎలక్ట్రిక్ షాక్ కొట్టినట్లయింది. అమెరికాలో కొన్ని మిలియన్ల డాలర్ల పెట్టుబడితో భూగోళానికి రంధ్రం

వ్రాయడం ప్రారంభించారట. ఇదంతా 1959వ సం॥ ఏప్రిల్, ఆగస్టు మాసాల ప్రాంతంలో జరిగిన సంగతి. 'రాక్షసులు పురాణ కాలంలోనే కాదు ఈనాడుకూడా వున్నారు. అయితే వాళ్ళు మనలాగే మామూలు దుస్తులు వేసుకుని మామూలుగా మనలాగే ఉంటూ వాళ్ళ రాక్షసకృత్యాలు కొనసాగిస్తూ వుంటారు, అంటూ చక్కటి వ్యంగ్యం థ్యాకరేకు స్ఫురించింది. అది వ్యాసంగా రూపొందించి, పత్రికకు పంపిద్దామనుకుంటూ ఆలస్యంచేస్తూ వచ్చాడట. ఇట్లావుంటే అకస్మాత్తుగా ఇదే వ్యంగ్యాన్ని మరొక రచయిత వ్యాసంగా ప్రకటించాడట. అది చూచి థ్యాకరే గుండె బ్రద్దలయింది. ఈ విషయం ప్రస్తావిస్తూ హిందూ ఎడిటర్ నాకు రాబోయే కీర్తిసంపద కంతటికీ సైంధవుడిలా అడ్డుపడ్డాడంటూ వ్యంగ్య గర్భితమైన ఒక సుదీర్ఘవ్యాసం వ్రాసి పంపించాను. అదికూడా తన పూర్వుల్లాగే ఎడిటరుగారి బుట్టలోకి వెళ్ళిపోయింది. అయితే, అది వేరే విషయం.

మరి రెండు ఊహాలు ఆలోచనాళువులకు ఆహారంగా యిస్తాను. కాంతి అయస్కాంత సీమలో కేంద్రంవైపు వంగుతుందనీ, కాంతికి మాస్ (అంటే వస్తుత్వం అని తర్జుమా చేయవచ్చు) ఉందనీ ఆధునిక శాస్త్రం తెలుసుకుంది. ఈ రెండు లక్షణాలు శక్తికిలేవు. ఇవి పదార్థానికి మాత్రమే వున్న లక్షణాలు. అయితే శక్తిరూపం అయిన కాంతికి ఈ పదార్థలక్షణాలుండడం ఒక చిత్రమైన, ఆలోచనాయోగ్యమైనవిషయం. సృష్టిపరిణామఫలితం. ఈపరిణామం కోతులనుంచి మనుష్యులు రావడం వరకే అన్వయించి, మిగతా సృష్టిజాలానికి అన్వ

యించకుండా ఉండదు.అందుచేత యావత్ సృష్టిపరిణామ ఫలితమేఅనుకోవాలినిర్జీవపదార్థంనుంచిజీవపదార్థంవచ్చిందన్నారు అయితే నిర్జీవపదార్థంకూడా ఒకపరిణామఫలితమే. నానావిధ నిర్జీవపదార్థాలు పరిణామఫలితంగా ఏర్పడడమేకాకుండా నిర్జీవ పదార్థంకూడా మరొకదానిలోనుంచి పరిణామఫలితంగావచ్చి ఉండాలిగదా, అనే భావం స్ఫురించక తప్పదు. ఎందుచేత నంటే నిర్జీవపదార్థం సృష్టికి ఆదికాదు. నిర్జీవపదార్థం శక్తి లోంచి వచ్చింది. నిర్జీవపదార్థం, ఆఖరు యిటుక అయిన ఆటము రెండు శక్తికణాల కలయికవల్ల వచ్చింది. అందు చేత పదార్థానికి శక్తి మూలకారణం. అయితే శ పదా ర్థంగా ఒక్కసారిగా మారిందా అని ప్రశ్న వేసుకుంటే మనం ప్రస్తుత సందర్భానికి వచ్చి వాలుతాము. శక్తి విశ్వంలో తొలుత ఉండి ఉంటుంది. తర్వాత శక్తి క్రమేణా నానారూ పాలుగా పరిణమించింది. చివరకు ఒక ప్రాథమిక ఆటంగా అంటే ఒక ప్రోటాను ఒక ఎలెక్ట్రాను ఉన్న హైడ్రోజన్ ఆటంగా రూపొంది ఉంటుంది. తర్వాత అక్కడినుంచీ రకర కాల ఆటములు వచ్చి ఉంటాయి. అయితే శక్తి పదార్థంగా మారే మధ్యయుగంలో శక్తి నానారూపాలు ధరించింది. వేడిగా ఎలెక్ట్రో మాగ్నెటిక్ తరంగాలుగా, ఇన్ఫ్రారెడ్ కిర ణాలుగా, అల్ట్రావైలెట్ కిరణాలుగా, యిట్లా రకరకాల రూపాలెత్తి చివరకు సమగ్రకాంతిగా రూపొంది ఉంటుంది. కాంతి పదార్థం అవుతుంది. కాం దార్థంగా మారుతూ ఉందని శాస్త్రజ్ఞులు ఖగోళ శాస్త్రంలో చెపుతున్నారు.

(5)

విశ్వంలో ఉన్న మండే గోళాలు శూన్యంలోకి ప్రసారంచేసే కాంతి నెబ్యులాగా రూపొంది చివరకు గోళం అవుతుందని అంటారు వాళ్ళు. అంటే కాంతే విశ్వంలో నూతన గోళాల ఉత్పత్తికి మూలకారణం అని వారి ఉద్దేశం. అందుచేత శక్తి పదార్థంగా రూపొందే పరిణామ మార్గంలో కాంతి ఒక సంధి దశ అనుకోవచ్చునని నా భావన. కాంతికి యిటు శక్తి లక్షణాలు అటు పదార్థ లక్షణాలు ఉండడమే దీనికి కారణం. అటు జీవలక్షణాలూ యిటుజడలక్షణాలూ ప్రదర్శిస్తూ జీవనిర్జీవ పదార్థ ప్రపంచాలకు మధ్యేమార్గంలో ఉన్న వైరసుకు పోలిఉంటుంది కాంతి. అందుచేత నేను కాంతిని ఉప పదార్థం (ఇంగ్లీషులో సబ్‌మ్యాటర్) అంటాను.

ఇంకొక విశేషం నిర్జీవపదార్థం జీవపదార్థంగా మారే సందర్భంలో కూడా ఒక గమనించవలసిన ఘట్టం ఉంది. రాగి, ఇనుము, నైట్రోజన్, హైడ్రోజన్, ఆక్సిజన్, కార్బన్ ఇట్లాంటివి నిర్జీవపదార్థాలు. జీవపదార్థాలు వైరసు, అమీబా ఫంగి, నాచు, చెట్లు, జంతువులు వగైరాలు. వెనక చెప్పిన నిర్జీవ పదార్థాలే తర్వాత చెప్పిన జీవపదార్థాలయినాయి. అది ఆధునిక విజ్ఞానం. అయితే ఇట్లా నిర్జీవపదార్థం జీవపదార్థం అయ్యేముందు నైట్రోజన్, హైడ్రోజన్, కార్బను, ఆక్సిజన్ వగైరా మూలపదార్థాలు ఒక ప్రత్యేక శీతోష్ణ స్థితుల సానుకూలతవల్ల CH, NH, CO, $CO_2$, CN వగైరా గ్రూపులుగా రూపొందుతాయి. వాటినే ఆర్గానిక్ కాంపౌండ్సు అని విభాగం చేశారు. వీటి రూపాలు రూపాంతరాలు జీవపదార్థ ప్రపంచంలో సర్వత్రా ద్యోతకం అవుతాయి. ఈ ఆర్గానిక్

పదార్థాలు జీవపదార్థం రూపొందే పరిణామ మార్గంలో ఒక దశగా పరిగణించాలి. వీటి తర్వాతనే వైరసులు అవతరించిఉంటాయి. ఆర్గానిక్ పదార్థాల్లో జీవపదార్థలక్షణాలులేవు. వైరసుల్లో జీవపదార్థ లక్షణాలూ నిర్జీవ పదార్థ లక్షణాలూ రెండూ ఉన్నాయి. అందుచేతనే వైరసు జీవ నిర్జీవ ప్రపంచాల మధ్య లంకె అంటారు. వైరసుకు ఆహారం తీసుకోవడం, పెరగడం జాతిని అభివృద్ధి చేసుకోవడంలాంటి ప్రాణిలక్షణాలున్నాయి. తర్వాత చక్కెర గ్లిజరన్‌లాంటి (NH, CH వగైరా గ్రూపులు కలిగిన) ఆర్గానిక్ పదార్థాల మాదిరిగానూ ప్రవర్తిస్తుంది. జీవలక్షణాలు లేవుగనక ఆర్గానిక్ పదార్థాలు నిర్జీవ ప్రపంచ సరిహద్దుల్లోనే ఉండిపోయాయి. వైరసు ఆ హద్దుమీద చేరి అటు ఒక కాలు, ఇటు ఒక కాలూ పెట్టి నిల్చుంది. తాత్పర్యం ఏమిటంటే ఆర్గానిక్ పదార్థాలు, నిర్జీవపదార్థం, జీవపదార్థంగా రూపొందే పరిణామమార్గంలో వైరసు అవతరణకు ముందు వచ్చిన ఒక విస్పష్ట దశగా భావించాలి అని.

ఈ భావాలను యింకా విపులంగా పరిశోధనచేసి విస్తృతం చేస్తే సిద్ధాంతాలుగా రూపొందవచ్చునని నా శాస్త్రజ్ఞమిత్రులు అభిప్రాయపడుతున్నారు.

ఆలోచనాపరులకు ఆశ్చర్యకరమైన వూహాలు వస్తుంటాయి. ఆవూహాలే మహత్తర కార్యాలకు కారణాలవుతాయి. భవనాలు, కావ్యాలు, నగరాలు, యిత్యాది యావన్మానవ లోకమూ మొదట వూహాలే. అది రూపం ధరిస్తే భవనాలవుతాయి. నగరాలవుతాయి. కావ్యాలవుతాయి. ఏవేవో

అయి ప్రపంచమంతా వ్యాపిస్తాయి. ఆ మాటకొస్తే సృష్టి కూడా మరొక మహత్తరశక్తి వూహ అంటారు. అయితే అది మనల్ని ఒక వివాదరంగంలోకి ఈడ్చుకుపోతుంది. కానీ మనకు కావలసింది వూహ మానవవిజ్ఞానంలో ఎంత ప్రధాన పాత్ర వహిస్తుంది అనేది. మానవ విజ్ఞాన చరిత్ర సర్వస్వమూ చూస్తే వూహ ముందు, విజ్ఞానం (ఫలితం) తర్వాత నడచి నట్లు స్పష్టంగా గోచరిస్తుంది. అణువుల్లోంచి విశ్వం వచ్చిందని కణాదుడు చెప్పినప్పుడుగానీ ఐన్‌స్టీను సాపేక్షసిద్ధాంతం ప్రతి పాదించినప్పుడుగానీ వూహే దారి చూపించి ముందుకు తీసుకు వెళ్ళింది. కాంతికిరణం అయస్కాంత కేంద్రంలో కేంద్ర బిందు వైపుకు కొన్ని డిగ్రీల కోణంలో వొంగుతుందని ఐన్‌స్టీను చెప్పినప్పుడు ఆయనదగ్గర ఉన్న సాధనాలన్నీ ఒక్క కాగితమూ కలమూ మాత్రమే. దాన్ని ప్రత్యక్షంగా నిర్ధారణ చేసుకోడానికి శాస్త్రజ్ఞులు సూర్యగ్రహణం ఎప్పుడు వస్తుందా అని కాచుకుని ఉండి ఉండి అది వచ్చినప్పుడు భూగోళంమీద అనేక స్థలాలనుంచి దూరదర్శిని యిత్యాది శక్తివంతమైన ఆధునిక యంత్రాల సహాయంతో ఆకాశంలో నక్షత్రాలను పరిశీలించి ఐన్‌స్టీన్ చెప్పినదాన్ని సత్యం అని తెలుసుకున్నారు. ఆయన యిచ్చిన కొలతలు, వారికి ప్రత్యక్షంగా వచ్చిన కొల తలు, ఇంచుమించు సమానంగానే ఉన్నట్టు వాళ్ళు హర్షిం చారు. ఇదేమిటి? ఊహ విజ్ఞానంలో ఎంత ప్రాణభూతమో స్పష్టం చేస్తూ ఉంది ఇదంతా. కానీ అట్లాంటి వూహాలకు మనం యిస్తున్న గౌరవం ఏమిటి?

# ఉత్తమ సాహిత్యం ఉదాత్త మనస్తత్వ సమున్మీలనమే



ఒకప్పుడు నాకు, నా మిత్రుడు గురుతుల్యుడు అయిన నారాయణరావుగారికీ ఒకవాదం వచ్చింది. సాహిత్యం కేవలం వినోద యోగ్యమేగానీ శాస్త్రాల మాదిరి ఉత్తమ ప్రయోజన కారి కాదు అని ఆయన వాదన. శాస్త్రం మానవ సముజ్జ్వల మేథా ప్రకర్షఅనీ, సాహిత్యం విదూషకుల వ్యర్థ ప్రలాపం అనీ ఆయన వాదన తాత్పర్యం. అందుచేత మానవ విజ్ఞాన రంగంలో శాస్త్రానికే అగ్రస్థానం యివ్వాలనీ, సాహిత్యానికి అంత అర్హత లేదనీ వారంటారు.

ఇది చాలాముఖ్యమైన విషయం. ఆ సందర్భంలో నేను ప్రతివాదంచేస్తూ ఒక అపూర్వ దృక్కోణంలో సాహిత్య స్థానాన్ని విమర్శించి సమర్థించాను. అదిసాహిత్యం మీదఒక వినూత్న కాంతిపుంజాన్ని ప్రసారం చేస్తుంది. దీన్ని సాహితీపరులు శ్రద్ధగా పరిశీలించాలని ఆశిస్తున్నాను.

సాహిత్యం గొప్పదా శాస్త్రం గొప్పదా అని ప్రశ్న. సాహిత్యంమీద బ్రతికేవాళ్ళు ముఖ్యంగా ఈ ప్రశ్నకు సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది. సామాన్య ప్రజలకు అనవసరం. ఎందుచేతనంటే నాటకమో, సినిమానో చూచేవాళ్ళు గానీ, లేక హరికథ వినేవాళ్ళుగానీ నవలలు కథలు చదివే లక్షలాది ప్రజలుగానీ వాటివల్ల ఏదో ఉపకారం జరుగుతుం

దనే ఆశతో ఆపని చేయటంలేదు. అది ఒక అవ్యాజమైన ఆకర్షణ. అందుచేత ప్రధానంగా ఇది సాహితీపరుల వ్యవహారం, తర్వాత సామాన్య ప్రజలది.

సాహిత్యాన్ని ఒక దోషభూయిష్టమైనదృష్టితో చూడడం చేతగానీ, ఉత్తమ సాహిత్యంతో పరిచయం లేకపోవడం చేతగానీ, లేకపోతే సాహిత్యాన్ని హృదయపూర్వకంగా సేవించకపోవడంచేతగానీ కొందరు సాహిత్య స్థానాన్ని సమగ్రంగా నిర్ణయించలేక పోతున్నారు. వాస్తవంగా చూస్తే సాహిత్యానికి మానవ విజ్ఞానరంగంలో బహుశా అగ్రస్థానమే ఇవ్వవలసి ఉంటుంది. సాహిత్యంకూడా శాస్త్రతుల్యమే! పైగా శాస్త్రాలన్నిటికంటే సాహిత్యం అత్యుత్తమ శాస్త్రంగాకూడా గోచరిస్తుంది.

"ప్రాపర్టీస్ ఆఫ్ మ్యాటరు" అంటే పదార్థ తత్త్వశాస్త్రంనుంచి మానవశరీరశాస్త్రంవరకూ ఉన్న అనేక విజ్ఞాన శాస్త్రాలను తీసుకుంటే అవన్నీ విశ్వసృష్టియొక్క వివిధ పరిణామదశలను వివరించే శాస్త్రాలు. ప్రాపర్టీస్ ఆఫ్ మ్యాటరు, డైనమిక్స్ వగైరా శాస్త్రాలు జడపదార్థతత్త్వాన్ని వివరిస్తాయి. బాటనీ వృక్షజాతుల్ని గురించి వివరిస్తుంది. జువాలజీ జంతువుల్ని గురించి, ఫిజియాలజీ మనుష్యుల్ని గురించి. ఇట్లా నానాశాస్త్రాలు సృష్టి యొక్క నానా పరిణామదశలను వివరిస్తాయి. కానీ మనిషిసృష్టిలో అవతరించినతర్వాత సృష్టి అంతటితో ఆగిపోలేదు. పరిణామ సూత్రానుసారంగా మనిషిలో శారీరక పరిణామం రాకపోయినా, మానసికంగా మాత్రం పరిణామం కొనసాగుతూనే ఉంది. కొన్ని వేలవండ్ల

క్రిందట గుహల్లో మృగప్రాయుడుగావున్న మనిషి క్రమంగా నాగరకుడయ్యాడు. నగరాలు నిర్మించడం, సామ్రాజ్యాలు ఏలడం, కావ్యాలు వ్రాయడం, ఆకాశాన్ని జయించడం ఇత్యాది కార్యాలు సాధించడం మొదలుపెట్టాడు. అంతకంతకు మనిషిలో ఈ శక్తులు పెరుగుతున్నాయి. ఇవన్నీ మానవ మేధస్సు అంతకంతకు ఇతోధికశక్తి సమృద్ధిపొందడాన్ని సూచిస్తాయి. మనిషి శరీరాన్ని గురించి వివరించే శాస్త్రం వచ్చింది. అంతకంతకూ పెరిగి విశ్వరూపంధరించే మానవ మనసును గురించి వివరించే శాస్త్రం ఏది అని నేను ప్రశ్నిస్తాను. సాహిత్యం అనేదొక్కటే సమాధానం.

మానవ పూర్వ జీవవర్గాల్లో భయము, కోపము, ప్రేమ అనే భావాలున్నాయంటే అవి కేవలం ఆత్మరక్షణ కోసం, వంశవృద్ధికోసం అవసరమైన ప్రాథమికభావాలు. శరీర ధారణకు కావలసినవి మాత్రమే. కాని మానవుడిలో అట్లా కాదు. ఎవరెస్టు విజయంకోసం ప్రాణాలర్పించటం శరీర ధారణకు అవసరమైన భావంకాదు. అణువిజ్ఞానాది నానారూప శాస్త్రాలూ, తర్కమీమాంసాదులు శరీరధారణకు అవసరమైనవికావు. మానవుడిలో కనుపించే ఈ అపూర్వ మానసిక శక్తి, ఈ శేముషీప్రకర్ష, సృష్టి కేవల భౌతిక పరిధులకు పరిమితంగాక దాన్ని అధిగమించి ముందు దశకు గడచిపోతున్న ఒక పరిణామ ధోరణిని సూచిస్తాయి. స్వల్ప జీవరాసులనుంచి ఉత్తమ జీవరాసులవైపుగా పరిణామంచెందే విశ్వసృష్టికి కొట్టకొసన పూచిన సముజ్జ్వలకుసుమం మానవమనస్సు—మనోగర్భకుహరంలో ఉన్న క్లిష్ట భావ ప్రవృత్తిని, తన్నిగూఢ

శక్తి పరంపరను అవగాహన చేసుకుని వివరించి చెప్పడం, మానవ వైజ్ఞానిక కృషికి చివరకి పర్యవసానం అయింది. ఈ సునిశిత కృషిలో మన స్తత్వశాస్త్రమనీ, తత్త్వశాస్త్రమనీ, యోగశాస్త్రమనీ, తంత్రశాస్త్రమనీ, మంత్రశాస్త్రమనీ వివిధశాస్త్రాలు పూర్వం ఆవిర్భవించాయి, యిప్పుడూ ఆవిర్భ విస్తున్నాయి. ఈ శాస్త్రాలన్నిటిలోనూ మానవరూపమైన ప్రస్తుత పరిణామదశను సమగ్రంగా వివరించి చెప్పేది సాహిత్య మొక్కటే.

ఇంతవరకూ విశ్వాన్నిగురించి మానవుడు ఆర్జించిన విజ్ఞానం మనస్సుయొక్క చరిత్రను సూచిస్తుంది. అంటే సృష్టిలో మనస్సు నానావిధ జీవ నిర్జీవవర్గాల్లో ఎట్లా పరిణామం చెందుతూ పురోగమించిందో, ఆ పూర్వగాథను సాహిత్యేతర శాస్త్రాలు చెబితే, సాహిత్యం మనస్సుయొక్క ప్రస్తుత గాథను చెపుతుంది. మనస్సు సృష్టియొక్క ప్రస్తుత పరిణామ దశలో ఎట్లా ఉంది? దాని స్వభావం ఏమిటి? ఏ పరిస్థితుల్లో ఎట్లా ప్రవర్తిస్తుంది? ఏది ఉత్తమ ప్రవృత్తి? ఏది కాదు? అనే విషయాల్ని వివరిస్తుంది. ఒక్క ముక్కలో చెప్పాలంటే సాహిత్యానికి వస్తువు మానవమనస్సు! ఆ వస్తువును ఎంత సమగ్రంగా చిత్రిస్తే ఆ సాహిత్యసృష్టి అంత సమగ్రంగా ఉంటుంది. ఆదర్శప్రాయమైన ఉదాత్తమైన మానసిక ప్రవృత్తిని చిత్రిస్తే. ఆ సాహిత్యం ఉదాత్త భావప్రేరకమై సమాజంలో ఉత్తమ కార్యహేతువవుతుంది. అందుచేత నానావిధ మానవ మనఃప్రవృత్తుల్ని చిత్రించడమే, అందులోనూ ఉత్తమప్రవృత్తిని ఉదీర్ణంగా చిత్రించడమే సాహిత్యం. ఈ

కార్యంలోనే సాహిత్యకర్తల ప్రతిభననుసరించి సంస్కారాన్ని అనుసరించి సాహిత్యంలో తారతమ్యాలు ఏర్పడుతుంటాయి.

మానవ మనస్సును, తన్నిగూఢశక్తి సముచ్చయాన్ని అర్థంచేసుకోవడం అతిదుస్సాధ్యమైన పని. ఏ వాల్మీకికో, ఏ కాళిదాసుకో, ఏ ఇబ్సనుకో టాల్‌స్టాయికో సాధ్యమయింది. నిత్యజీవితంలో అట్లా అర్థంచేసుకొనే శక్తి ఉన్నవారు అజ్ఞాతంగా ఇంకా చాలామంది ఉండవచ్చు. కాని వారు తమ అనుభూతిని లోకానికి చెప్పేశక్తి లేకపోవడంచేత వారు లోకోపకారకులు అవలేకపోయారు. మానవ మనఃప్రవృత్తిని సమగ్రంగా అర్థంచేసుకోగలిగినట్లయితే ఈ లోకంలో అపార్థం అన్నమాటే ఉండేదికాదు. దేశాలమధ్య, మతాలమధ్య సంఘర్షణ ఉండేదికాదు. యుద్ధాలుండేవికావు. లోకం సుఖశాంతులు పాలించే స్వర్గధామంగా ఉండేది. మానవుల మనస్సులు గ్లాసు పెట్టెలుగా మనోభావాలు దృశ్య పదార్థాలుగా ఉండి ఉంటే అపార్థం అన్నమాటే ఉండేదికాదు. సాహిత్యకర్తల కింత విలువ ఉండేదీకాదు. అట్లా కానందువల్ల మనకే ఎక్సరేదృష్టి కావలసివచ్చింది. ఆ దృష్టి కొందరికే కలగడం, కొందరికి లేకపోవడం, కొందరికి అపారంగా ఉండడం, కొందరికి స్వల్పంగా ఉండడంచేతనే సాహిత్యంలో తారతమ్యాలు కలుగుతున్నాయి అని వెనక చెప్పాను. భాసుడు ఉన్నాడు. శూద్రకుడు ఉన్నాడు. కానీ యిద్దరికీ ఒకే స్థానాన్ని ఇవ్వముకదా! కాళిదాసుకంటె గొప్పవాడన్నారు భాసుణ్ణి. ఆ తారతమ్యాలకు కారణం అదే.

అయితే—మానవ మనస్సు వస్తువుగాని సాహిత్యం లేదా? ప్రకృతి వర్ణనలు సాహిత్యం కాదా అనే ప్రశ్న రావచ్చు. అది ఉత్తమశ్రేణి సాహిత్యం కాదంటాను. అక్కడే చిత్రలేఖనం, శిల్పం సాహిత్యాన్ని అందుకోలేని కళలవుతున్నాయి. ఉత్తమ సాహిత్యమంతా ఉదాత్త మనస్తత్వసమున్మీలనమే. రామాయణం ఏమిటి? మేఘ సందేశమేమిటి? అన్నీ అంతే. అందుచేత యావత్సాహిత్యకార్యమూ మానవ మనః ప్రతిపాదన.

ఈ కార్యంలో మనకు ఏ యంత్రాలూ సహాయం చేయలేవు. ఏ శాస్త్రాలూ ఉపయోగపడవు. ఇందుకు సాహిత్యం ఒక్కటే శరణ్యం.

విజ్ఞుల అభిప్రాయం, తొలుత స్వల్పమైనవి క్లిష్టం కానివి అయిన వాటిమీదికే మానవుడి దృష్టి వెళ్ళిందని. అంటే ఖగోళశాస్త్రం మొదట వచ్చిందని. దీనికి ప్రబలాధారాలున్నాయి. వేదాలు నాటికేగాక వేదాలకు పూర్వం కూడా ఇండియా ఈజిప్టు బాబిలోనియా క్రీటుల్లో ఖగోళ విజ్ఞానం ఉన్నట్టు తెలిసింది. ఖగోళ ప్రవర్తనలో సూక్ష్మమైన మర్మాలేమీ లేవు. ఒక నిర్ణీత రేఖామార్గంలో క్రమం తప్పకుండా నడవడమే వాటి ప్రవర్తన. ఇది ఎంతో స్వల్పమైన విషయం. ఈ ప్రవర్తనతో చెట్లపుట్టుక, అభివృద్ధి, వాటి గుణగణాలు పోల్చిచూస్తే ఆ విషయాలు అర్థంచేసుకోవడం ఖగోళ విజ్ఞానంకంటే క్లిష్టతరం. క్రమంగా సృష్టిలో కొనసాగే పరిణామంలో స్వల్ప నిర్మాణం ఉన్న వస్తువుల నుంచి క్లిష్ట, క్లిష్టతర, క్లిష్టతమ నిర్మాణాలున్న వస్తుజాలాని

పురోగమించడం కనుపిస్తుంది. ఖగోళాల నిర్మాణము ప్రవర్తన స్వల్పం. వృక్షాల నిర్మాణము ప్రవర్తన క్లిష్టం. మృగాలది క్లిష్టతరం, మనుష్యులది క్లిష్టాతిక్లిష్టం. సులువైనవాటిని మనిషి మొదట తెలుసుకున్నాడు. క్లిష్టమైనవాటినితర్వాత-ఇట్లా వెళ్ళితే మానవశరీరం అతిక్లిష్ట నిర్మాణం కనుక చాలా ఇటీవలి శాస్త్రం మానవ శరీర శాస్త్రమే. మానవ శరీరమే క్లిష్టమైతే ఆ తర్వాత పరిణామఘట్టమైన నాగరిక మానవమనస్సు అత్యంతక్లిష్టమైనది. దాన్నిగురించి చెప్పే.శాస్త్రం సాహిత్యమన్నాను. ఈ విజ్ఞాన శిఖరారోహణాలో సాహిత్యం శిఖరాగ్రంమీదఉంది. సాహిత్యం శాస్త్రాలకంటే అధమమూ, ఉత్తమమూ ఇప్పుడు చూడండి.

సాహిత్యం వేదాంతంకంటే ఒకమెట్టు తక్కువ అన్న ప్లేటో వాక్యాన్ని కూడా నేను అంగీకరించను. అయితే వేదాంతం విషయంలోమాత్రం స్థాన నిర్ణయంలో కొంత వివాదం రావచ్చు. అది నిరాధారంకాదు. ఎందుచేతనంటే వేదాంతం సృష్టికి మూలకారణం ఏది అని విచారణచేస్తుంది. దాన్నే జడపదార్థంనుంచీ ఉత్తమ జీవపదార్థం వరకూ ఉన్న యావత్ సృష్టిలో అంతర్భూతంగా ఉన్నట్లు గుర్తించి, ఆ కారణమూ, మానవ మనశ్శక్తులూ ఒకటే, అది పెద్దది ఇది చిన్నది, కానీ వస్తువు ఒకటే అని తేలుస్తుంది గనక, ఈ రెండు శాస్త్రాలు ఒకేస్థానానికి పోటీపడడంలో తప్పులేదు. కానీ శాస్త్రదృష్టితోచూస్తే మానవమనస్సునుగురించి సమగ్రంగా చెప్ప గలిగేది వేదాంతంకంటె సాహిత్యమేగనక సాహిత్యం

కంటే వేదాంతమే ఒకమెట్టు తక్కువ అంటాను. (ప్లాటోకు ప్రతికూలంగా)

ఆదినుంచీ నేటివరకూ వచ్చిన విజ్ఞాన శాస్త్రాలన్నీ మనశ్శక్తులు ఎట్లా క్రమాభివృద్ధి చెందాయని మానవమనస్సు యొక్క చరిత్రను చెపుతాయి. కానీ సాహిత్యం మానవ మనస్సుయొక్క ప్రస్తుత స్వరూపచిత్రాన్ని ఇవ్వడానికి ప్రయత్నిస్తుంది. సాహిత్యం తన ప్రయత్నాన్ని సంపూర్ణంగా నెరవేర్చిందని చెప్పలేక పోవచ్చునేమో కానీ సాహిత్యంచేసే పనిమాత్రం అది. ఆ పని మరేశాస్త్రాలు చెయ్యడంలేదు. వేదాంతం "మానవమనస్సు ఏమిటి?" అని అడుగుతుంది. తెలుసుకోవడానికి ప్రయత్నిస్తుంది. కానీ ఏమిటి అని స్పష్టంగాచెప్పలేక అవాచ్యం అవర్ణ్యం అచింత్యం అంటూ ఏదో చెప్పి వూరుకుంటుంది. ఇక్కడ ఒక్కమనవి. మానవమనస్సు అనే సమాసాన్ని వేదాంత పరిభాషగా వాడలేదు. దానికి ప్రస్తుత సందర్భానుసారంగానే అర్థం చెప్పుకోవాలి. అంతేగానీ, "మనో బుద్ధ్యహంకారములు" అంటూ ప్రారంభిస్తేమాత్రం వ్యాసహృదయం ప్రత్యక్షం చేసుకోలేరు. ప్రస్తుత పరిణామదశలో మానవమనస్సుకున్న పరిమితులను అనుసరించి అంతకంటే అర్థంచేసుకోను వీలుగాని ఒకవస్తువును పట్టుకుని వేదాంతం నేరుగా నేను చూస్తాను అంటుంది అతి మూర్ఖంగా. అందుచేతనే ప్రయత్నం విఫలమై అవాచ్యం అచింత్యం, వగైరామాటలతో ముగిస్తుంది. కానీ సాహిత్యం మూర్ఖపద్ధతినివదలి మానవ పరిమితి గుర్తించి ఆ వస్తువును నేరుగా పట్టుకోడానికి ప్రయత్నించక దాని ప్రభావాలైన

విభావానుభావసాత్త్విక వ్యభిచార్యాది భావాలను పరిశీలించి వివరించి రసావతారాన్ని కల్గిస్తుంది. రసమే ఆనందం. ఆనందో బ్రహ్మ. సాహిత్యానికీ వేదాంతానికీ బ్రహ్మ పదార్థం సమానమే. కానీ వెనక చెప్పినట్లు వాటి పద్ధతులు భిన్నంగా వుంటాయి. పెద్దలు కోపించకపోతే ఒక్కటి చెపుతాను—వేదాంతం మూర్ఖపద్ధతిని, సాహిత్యం వివేక పద్ధతిని అవలంబిస్తాయంటాను. వేదాంతం ఎలక్ట్రిసిటీ అంటే ఏమిటో తెలుసుకుందామని దాన్ని పట్టుకుని షాక్ తింటే, సాహిత్యం శీతల విద్యుద్దీపకాంతులు, పంకాగాలీ, వగైరా విద్యుత్ ప్రవృత్తులను బట్టి దాని సంగతి, తెలుసుకుంటుంది.

అయితే మరొకటి—సాహిత్యాన్ని శాస్త్రం శాస్త్రం అంటూ ఘోషిస్తావే దానికి శాస్త్రలక్షణాలెక్కడున్నాయి? అని ప్రశ్నించవచ్చు. కానీ సాహిత్యానికి శాస్త్రలక్షణాలు లేవని ఒప్పుకోవడమే సమంజసమైన సమాధానం. మానవ మనః ప్రవృత్తిని అర్థంచేసుకోవడానికి సలక్షణమైన శాస్త్రం మరొకటిఉంది. అది మనస్తత్త్వశాస్త్రం. దాన్ని ఇంతవరకూ స్పృశించలేదు. ఎందుకంటే ఈ సందర్భంకోసమే. మనస్తత్త్వ శాస్త్రంకామక్రోధలోభాది మనఃప్రవృత్తుల్ని అర్థంచేసుకో డానికి ప్రయత్నిస్తుంది. కానీ దాని కార్యం మనకు సాహిత్య కార్యమంత సుగమంగాను సుబోధంగాను ఉండదు. అందుచేత ఎప్పటికీ మనస్తత్త్వ శాస్త్రఫలితాలు సూత్రాలుగా నిలిచి పోతాయేగానీ ఒక సమగ్ర అవగాహనకు తోడ్పడవు. ఎట్లాగంటే—ఆర్గానిక్ కెమిస్ట్రీ పంచదార నిర్మాణాన్నిగురించి

సూత్రప్రాయంగా వర్ణిస్తుందేగాని దాని తీపి రహస్యం మనకు చెప్పలేదు. మన అనుభూతికి రానివిషయాలు ఎన్ని చెప్పి మాత్రం లాభమేమిటి? అక్కడే వేదాంతశాస్త్రం విఫలమవుతూఉంటే సాహిత్యశాస్త్రం సఫలమవుతూఉంది. మానవుడిలోని ఉత్తమగుణాలను అధమగుణాలను దృశ్యమానంచేసి ఉత్తమగుణాలను ఉత్కర్షచేత దైవస్వరూపంగా వర్ణించి పురుషోత్తముడైన శ్రీరాముడే విశ్వసృష్టికి మూలకారణమని అనుభూతిపూర్వకంగాచెప్పి ఆత్మసాక్షాత్కారం చేస్తుంది సాహిత్యం. కాని వేదాంతం, 'యద్వాచానభ్యుదితం' ఇత్యాది ధోరణిలో చెప్పి విఫలమై నీలోనేఉంది చూచుకో అని గహనప్రాయం అయిపోతుంది. మన స్తత్త్వశాస్త్రమూఅంతే.

అసలు జాగ్రత్తగా ఆలోచిస్తే, మానవమనస్స్వరూపాన్ని లేక మానవాత్మను ప్రత్యక్షం చేయడానికి సూత్రాలుగా, మహావాక్యాలుగా, తయారయ్యే ఏ మానవ కృషీ పనికిరాదని నా భావం. సృష్టిపరాకాష్ఠకు అతి సమీపంగా వచ్చిన ఈ మానవాత్మ ఎంతో క్లిష్టము, దురవగాహము అయినది. మహాసముద్రంలో చిరుచేపను చేత్తో పట్టుకోవడానికి ప్రయత్నిస్తే అది దొరుకుతుందా? పెద్ద వల వెయ్యాలి. సూత్రాలు వాక్యాలు చేత్తో పట్టుకునే పద్ధతి, అసలు భాషాస్వభావాన్నే అర్థం చేసుకోలేవు. అట్లాంటప్పుడు మానవాత్మను, బ్రహ్మ పదార్థాన్ని అర్థం చేసుకోడానికి వేదాంత మనస్తత్త్వ శాస్త్రాల సూత్రాలు చాలుతాయా? విశాలమైన, చిత్రవిచిత్ర కల్పనాసమర్థమైన సాహిత్యావు వల ఒక్కటే ఆ పనికి చాలినది.

మానవుడి మనస్సును ఉదాత్తం చేసే శాస్త్రమే లోకంలో అన్నిటికంటె గొప్పది. ఎందుచేతనంటే శాస్త్రాల మూలంగా సాధించిన అనేక విచిత్ర విజయాలన్నీ లోకానికి ఏవో అపూర్వ ఆధునిక సౌకర్యాలను కలిగించాయనిపిస్తున్నాయే గానీ, సుఖం ఏదీ! రేడియోలు, కార్లు, భవనాలు ఇత్యాది అనంత ఆధునిక భోగవిలసితమైన పాశ్చాత్య సమాజంలో లోపించింది ఒక్కటే — అది మనశ్శాంతి, జీవితసుఖం. ఈ మాట నేను చెప్పేదికాదు. బెర్ట్రాండ్ రసెల్, హక్స్లీ, టాయిన్బీ మొదలైన పాశ్చాత్య విజ్ఞానులు చెపుతున్నదే. మరి ఆ సుఖం లోపించినతర్వాత ఈ భోగాలన్నీ ఎందుకు సమాజానికి? శవాలంకారాలు, అయితే లోకానికి జీవకళ అయిన ఆ సుఖం ఇన్ని భోగాలుండే పశ్చిమదేశాల్లో ఎందుకు లోపించింది? (ఈనాడు మనదేశాల్లోనూ అంతే అయింది లెండి) కారణం - అదే, ఆ మానవ మనః ప్రవృత్తిని అర్థం చేసుకోకపోవడమే. చేసుకునే ఓపిక, సానుభూతి, ఔదార్యం లేక, అట్టి చిత్తసంస్కారం లేక ఇన్ని భోగాలుండీ కూడా సుఖం కరువైంది.

చిత్తసంస్కారానికి సమాజంలో కీలకస్థానం ఉంది. అది లేకనే స్వార్థం పెరిగింది. అది లేకనే లోకమంతా నేనే ఆక్రమించుకోవాలనే తృష్ణ పెరిగింది. అది లేకనే సర్వమానవ సమానత్వం చేదయింది. మానవుల మధ్య గోడలు, కందకాలు లేకెత్తాయి. అందుచేత సకల శాస్త్ర సంజనితమైన ఫలితాలూ, చిత్తశాస్త్ర సంజనితమైన సంస్కారం లేక అనర్థకారమవుతున్నాయి. ఆ చిత్త శాస్త్రమే సాహిత్యం. చిత్తాన్ని

నిబంధించి, ఉదాత్తస్థాయికి ఉద్ధరించి, విశ్వ శ్రేయస్సును సంధానించడమే సాహిత్య పరమావధి. సాహిత్యంవల్లనే మనుష్యులు మంచి మనుష్యులవుతారు. మరే శాస్త్రంవల్లనూ కారు.

అయితే సాహిత్యం ఒక పరమార్థసాధనకు సాధనం మాత్రమే. పరమార్థం మంచిలోకం. నేను చిన్నవాణ్ణిగా ఉన్నప్పుడు, అంటే పుస్తకాలు చదువుతూ అంతా తెలుసు ననుకుంటూ ఉన్నప్పుడు, మంచి గ్రంథాలకోసం కావ్యాల కోసం అన్వేషిస్తూ ఉండేవాణ్ణి. జీవితంలో ఇంకా ముందుకు వెళ్ళిన తర్వాత గ్రంథాల సంగతి వదలివేసి మంచివాళ్ళ కోసం అన్వేషించటం మొదలుపెట్టాను. చివరికి లక్ష సద్గ్రంథాలు దొరుకుతాయిగాని ఒక్క సజ్జనుడు దొరకడం దుర్లభం అని అర్థం చేసుకున్నాను.

గొప్ప పాత్రల్ని సృష్టించి గొప్ప రచనలు చేసేవాడి కంటే ఆ గొప్ప పాత్రగా జీవించినవాడు నిజంగా ధన్యుడు, గణ్యుడు. ఒక మహాకవిని, ఒక మహానుభావుడ్ని తీసుకుని విలువకట్టమంటే నేను మహానుభావుడి వైపుకే మొగ్గుతాను. అత్రి జాబాలి ప్రముఖ తపస్సంపన్నులు, వేదశాస్త్ర పారంగతులుకూడా కేవలం ఒక సత్పురుషుడైన శ్రీరాముడికి చేతులు మోడ్చారు. మంచితనానికి దైవత్వానికి భేదంలేదని నాదృష్టి.

మంచితనం విలువ అర్థంచేసుకోలేక పోవడంచేతనూ, మంచితనం అలవరచుకోలేకపోవడంచేతనూ, మన ఆధునిక లోకం అధోగతిపాలవుతూఉంది అనుకోవచ్చు. యావత్ ప్రపంచ సాహిత్యంలోనూ మంచితనానికి వాల్మీకి చిత్రించిన

శ్రీరాముడిపాత్ర చక్కటి ఉదాహరణగా భావిస్తాను. కఠోర ధర్మవ్రతము, ఔదార్యము, కోమలత్వమూ, ఇంగితజ్ఞత, ఇత్యాది సద్గుణపుంజమే శ్రీరాముడు. ఈ సద్గుణాలన్నింటిని సామూహికంగా ఆత్మ సౌందర్యం అంటాను. అదే మానవ వంశ వృక్షాన పూచిన సముజ్జ్వల కుసుమం.

"జీవితంలో ఎందరు మంచివాళ్ళను చూచాను, ఎంత మంచితనాన్ని అలవరచుకున్నాను" అని ఒక సమీక్ష చేసుకోవడం ఎంతో లాభదాయకం. నా మనస్సులో సర్వదా స్పందించే భావతంత్రి యిదే.

# జడపదార్థం పరిణామ ఫలితమే

ఇటీవల ఆగస్టు చివరివారం హిందూ పత్రికలో చివర పేజీలో చివరకాలంలో నాలుగయిదు చదరపు అంగుళాల స్థలంలో అప్రధానంగా దృశ్యాదృశ్యంగా ఒక బ్రహ్మాండమైన వార్త ప్రకటించారు! కార్వాలిస్ అనే ఒక అమెరికా నగరంనుంచి 27-8-62 తారీఖున వచ్చిన వార్త అది. డా. జార్జి కోక్రాన్ అనే ఒక శాస్త్రజ్ఞుడు రసాయనిక పదార్థాలతో వైరస్ అనే ప్రాథమిక ప్రాణిని సృష్టించాడట. ఒక శాస్త్రజ్ఞుల సమావేశంలో ఆయన ఈ విషయం ప్రకటించాడు. సృష్టించింది ఎంత స్వల్పమైన ప్రాణి అయినా, ఈ కార్యం మానవచరిత్రలో ఎంత ప్రధానమైందో చెప్పడం సాధ్యం కాదు. ఆటంబాంబుకంటె, స్పుట్నిక్ కంటె, అట్లాగే ఎన్నో ఆశ్చర్యకరమైన ఆధునిక విజ్ఞాన విషయాలకంటె, జీవాన్ని సృష్టించడం ఎంత ముఖ్యమైన సంఘటనో సంపూర్ణంగా వర్ణించలేము. నవీనకాలంలో సాధించిన అశేష విజ్ఞానవిజయాలన్నీ ఒక ఎత్తు, ఈ జీవసృష్టి ఒక్కటే ఒక ఎత్తు. కానీ నేనే గనక ఎడిటర్నయితే, ఈ వార్తను మొదటి పేజీలో మొదటి వార్తగా తాటికాయలంత అక్షరాలతో ప్రకటించి ఉండేవాణ్ణి.

ఈ మహత్తర సందర్భాన్ని పురస్కరించుకుని, చిరకాలంగా నా మనస్సులో ఉన్న జీవపరిణామాన్ని గురించిన కొన్ని విచిత్రవూహాలను జిజ్ఞాసులోకంముందు పెట్టడం నా ఉద్దేశం. మానవుడు కోతులనుంచివచ్చాడనీ, జీవం నిర్జీవపదా-

ర్థంనుంచి వచ్చిందనీ చెప్పే ఆధునిక విజ్ఞాన పరిధిని అధిగమించి, నిర్జీవపదార్థంలోకూడా పరిణామముండుందని ఒక అపూర్వ వ్యూహను చెప్పడం దీని తాత్పర్యం. ఇది గొప్ప సాహసమే కావచ్చు., కాని ఆలోచనాపరులకు ఆహారం కాగలదని ఆశిస్తున్నాను. సామాన్య తరగతి సహాయార్థం వివరాలుకూడా ఉపోద్ఘాతరూపంలో సమర్పిస్తున్నాను.

చెట్లు, జంతువులు, మనుష్యులు సృష్టిలో ఒకేసారి పుట్టలేదనీ, క్రమంగా జీవం స్వల్పమైనదశనుంచి ఉత్తమ అత్యుత్తమదశలు అధిగమించి క్రమేణా పరిణామం పొందుతూ వివిధరూపాలు ధరించిందని, అట్లాంటి పురోగమనంలో మానవావతరణ ప్రస్తుతదశ అని చెప్పడం ఈనాడు సామాన్య విజ్ఞానం. పూర్వంకూడా విజ్ఞానానికి జగదేకపీఠమైన భారత దేశంలో దశావతారాలనే పేరుతో ఈ సిద్ధాంతాన్నే ప్రతిపాదించారనీ, ఆధునిక పండితుల్లో అధికసంఖ్యాకుల అభిప్రాయం. అదట్లా ఉంచుదాం. ఈ విధంగా ఒకపరిణామ ఫలితంగా జీవజాలం అభివృద్ధి పొందిందనే విజ్ఞానం ఆధునిక యుగంలో డార్విన్ ప్రభృతులమూలంగా అవతరించింది. మొదట బహుశా, వైరసు, తర్వాత అమీబా, తర్వాత జలచరాలైన చేపజాతి, ఈ ప్రాథమిక జీవవర్గంనుంచి భౌగోళిక వాతావరణ మార్పులద్వారా అంటే పరిసరాల అవసరాల ద్వారా, జలచర భూచర సమర్థం అయిన కూర్మజాతి, ఆవర్గం నుంచి జలసంపర్కం పూర్తిగా వదలలేని వరాహజాతివచ్చిందని, తర్వాత మామూలు జంతువులు, వాటినుంచి క్రమ పరిణామ ఫలితంగా ముందుకాళ్ళను చేతులుగా వాడుకునే కోతుల

వర్గమూ, వాటినుంచి మానవులు అవతరించారని చెపుతుంది ఈ విజ్ఞానం. అయితే జీవసృష్టిలో మానవుడు ఆవిర్భవించేసరికి ఎంతోకాలం గడిచిపోయింది. మానవుడే గుహల్లోనుంచి మహల్లోకి రావడానికి 50వేల సంవత్సరాలయిందనీ, అమీబాలాంటి అతి ప్రాథమిక ప్రాణివర్గంనుంచి చేపజాతి జీవం రూపొందడానికి సుమారు 80 మిలియన్ల సంవత్సరాలు పట్టిందనీ, అక్కడనుంచి కూర్మజాతి రావడానికి 100 మిలియన్ల సంవత్సరాలయిందనీ, అక్కడినుంచి మామూలు మృగాలు రావడానికి 120 మిలియన్ల సంవత్సరాలు, వాటినుంచి మానవుడు రావడానికి 200 మిలియన్ల సంవత్సరాలు అయిందని ఆధునిక శాస్త్రజ్ఞులు నానావిధ పరిశోధనల ఫలితంగా నిర్ణయించారు. ఈ జీవపరిణామానికి ఎంత దీర్ఘకాలం పట్టిందో ఆలోచిస్తే ఆశ్చర్యకరంగా వుంటుంది.

ఒక జీవవర్గంనుంచి మరొక జీవవర్గం రూపొందడం అనే పరిణామమార్గాన్ని పరిశీలిస్తూ వెనక్కుపోతే ఆదిమజీవరూపాలైన అమీబాలాంటివి ఒకే జీవకణం ఉన్నవి అని తేలింది. ఈ జీవకణాన్ని ఆధునిక శాస్త్రపరిభాషలో "సెల్" అంటారు. ఇట్లాంటి సెల్‌లు కొన్ని మిలియన్లు కలిసి క్రమేణా చేపలు, మృగాలు, మనుష్యులు అయినాయి. అతి ప్రాథమిక ప్రాణివర్గాలు తక్కువ సెల్‌లు కలిగినవి. అయితే ఈ సెల్ ఏమిటి? ఇదెక్కడనుంచివచ్చిందనే ప్రశ్నలు వస్తాయి. పల్చని జిగురు పదార్థం, దానిలో ఒక కేంద్ర బిందువు, ఈ రెండు కలసి ఒక సన్నని ఉల్లిపొరలాంటి దానిలో ఉంటాయి. జిగురు పదార్థం, కేంద్రబిందువు, పొర అన్నీ కలసిన నిర్మాణానికి

సెల్ అని పేరు. ఈ నిర్మాణంలో సజీవపదార్థం కేంద్రబిందువే. జిగురుపదార్థం ఆహారం. ఈ సెల్ అనే నిర్మాణానికి ఆహారం తీసుకోనడం, పెరగడం, జాతిని అభివృద్ధిచేయడం, అనే ప్రధానమైన మూడు ప్రాణిలక్షణాలు ఉన్నాయి. అందుచేతనే సెల్‌ను ప్రాణి అనుకోవాలి. కాని తదనంతర పరిశోధన "ప్రాథమిక ప్రాణి సెల్ కాదు. దానికి మూలాధారమైన "జీన్" అనే సూక్ష్మాణువు" అని విశదం చేసింది. సెల్‌లో ఉన్న కేంద్రబిందువు కొన్ని నూలుపోగుల్లాంటివి చుట్టలుగా చుట్టుకొని ఉన్న సమష్టిరూపం మాత్రమే. ఈ నూలుపోగుల్లాంటి వాటిని క్రోమోజోములంటారు. ఈ క్రోమోజోములుముందు చెప్పిన జీనులనే అనేక జీవకణాలు కలసి తయారయిన జీవ తంతువులు. ఈ జీనును మరింత పరిశోధించినప్పుడు అది కేవలం co, nh, oh, లాంటి నిర్జీవ పదార్థాలతో తయారైనట్లుగా స్పష్టమయింది. అందుచేత జీన్ నిర్జీవపదార్థంతో తయారవడంమూలాన జీనే సృష్టిలో అవతరించిన ఆదిమ జీవపదార్థంగా భావించాలి — తాత్పర్యం ఏమిటంటే నిర్జీవపదార్థంతో రూపొందిన ప్రాథమిక జీవపదార్థం జీను. కొన్ని జీనులు కలసి ఒక క్రోమోజోము. కొన్ని క్రోమోజోములుకలసి ఒక సెల్, కొన్ని సెల్‌లుకలసి ఒక మామూలుజీవి. సెల్‌లు కలసే సంఖ్య క్రమంగా పెరిగి వివిధ జీవరాసులు వచ్చాయి—ఆదిమ జీవరూపమైన జీనులోనే ఆయాజాతి ప్రాణివర్గాల లక్షణాలున్నాయి. అంటే చిలుక ఆకుపచ్చరంగు, ఎర్రటిముక్కు, కంఠధ్వని వగైరా లక్షణాలకు, అంటే చిలుక కాకి కాదన దానికి ఏ లక్షణాలు కారణమో ఆ ప్రధానజాతి లక్షణాలకు

జీనులే కారణం. అయితే వివిధ లక్షణాలుకలిగిన జీవజాతులు కావడానికి కారణం వివిధమైన జీనులు సృష్టిలో ఉండడమే.

జీనుల నిర్మాణం పరిశీలిస్తే అందులో సెల్‌లో ఉన్నట్లుగా అంతర్గత సూక్ష్మజీవ పదార్థాలు మరేవీ లేవనీ, నిర్జీవపదార్థాల సమ్మేళన చేతనే ఆధునిక శాస్త్రం నిర్జీవపదార్థాలనుంచే జీవపదార్థం వచ్చిందనీ సిద్ధాంతం చేసింది. అంటే ఉదజని, నత్రజని, ప్రాణవాయువు, బొగ్గు వగైరా నిర్జీవ మూలపదార్థాలు ఒక ప్రత్యేక పరిస్థితుల్లో కలసి ఒకవిధమైన నిర్మాణాన్ని పొందితే అదే జీవలక్షణాలు ప్రదర్శించే జీను అవుతుంది. ఈ విధంగానే మొదట చెప్పిన శాస్త్రజ్ఞుడు డా. జార్జి కోర్రాన్, వైరసును (జీను) సృష్టించాడు. జీనే సజీవప్రపంచానికీ నిర్జీవప్రపంచానికీ మధ్యవున్న లంకె. జీనే ఒకవైపు నిర్జీవపదార్థాల లక్షణాలను, మరొకవైపు సజీవపదార్థ లక్షణాలను ప్రదర్శిస్తుంది. సెల్‌లో ఉన్న జీనులేకాక ప్రత్యేకంగా విడిగా జీనులున్నాయి. వాటినే వైరసులంటారు. ఇవి బయట వాతావరణంలో ప్రత్యేకంగాఉండవు. వృక్షాల్లోనో మృగాల్లోనో మనుష్యుల్లోనో ఉంటాయి. ఈ వైరసులనే పేరుగల వివిధ జీనులే ఇంఫ్లుయంజా వగైరా అంటువ్యాధులకు కారణం. వీటికి ఆహారం తీసుకోనడం, పెరగడం, జాతిని అభివృద్ధిచేయడం అనేమూడు ప్రాణిలక్షణాలున్నాయి.

ఎలక్ట్రాన్లు ప్రోటాన్ల నానావిధ సమ్మేళనం నానావిధ అటముల ఉత్పత్తికి కారణమైనట్లే అటములయొక్క నానావిధ జీనుల ఉత్పత్తికి కారణమయింది. నానావిధ జీనులూ నానా లక్షణాలు ప్రదర్శిస్తాయి. నానావిధ జీవజాతుల ఉత్పత్తికి

కారణం అవుతాయి. ఈ జీనులు మామూలు మైక్రోస్కోపు లకు కనుపించవు. ఎలక్ట్రాన్ కిరణాలతో చూచే ఎలక్ట్రాన్ మైక్రోస్కోపు వచ్చిన తర్వాత జీనులను (వైరసు) కళ్ళారా చూచేటట్లు ఫోటోగ్రాఫులు తీశారు. ఇన్‌ఫ్లుయంజా వైరసు 0—1 మైక్రాన్ల వ్యాసం కలిగిన గోళాకారపు సూక్ష్మజీవులు. పొగాకుకు వచ్చే "మొజేయిక్" వ్యాధి తాలూకు వైరస్ 0.280 మైక్రాన్ల, పొడవు 0- -15 మైక్రాన్ల మందం కలిగిన కర్రపుల్లలఆకారపు సూక్ష్మజీవులు. (మిల్లీ మీటరులో వెయ్యో భాగాన్ని మైక్రాను అంటారు) ఒక ఆటంయొక్క వ్యాసం 0.0003 మైక్రాన్లు గనుక ఒక పొగాకు వ్యాధి వైరసు తీసు కుంటే దానిపొడవున వెయ్యిఆటములు, అడ్డంగా 50 ఆటములు అంటే మొత్తం 2 మిలియన్ల ఆటములు వుంటాయని శాస్త్రి జ్ఞులు గుణించారు.

వైరసు అనే నామాంతరం కలిగిన విడిజీనులు తినడం, పెరగడం, జాతిని అభివృద్ధి చేయడం అనే మూడు ప్రాణిలక్ష ణాలుండడమేగాక, యితర రసాయనిక నిర్జీవపదార్థం ప్రవ ర్తించినట్లుకూడా ప్రవర్తిస్తాయి. క్లిష్టనిర్మాణం కలిగిన ఆల్క హాలు, పంచదార, గ్లిజరిన్ లాంటి రసాయనిక పదార్థాల్లాగే యివీ కూడాను. కొద్ది కాలంలోనే ప్రతివైరసుకు కెమికల్ ఫార్ములా అంటే నిర్మాణ సూత్రాన్నికూడా వ్రాయకలుగు తారని శాస్త్రిజ్ఞులు అనుకుంటున్నారు. ఇంకా చిత్రమేమిటంటే తాము ఉండవలసిన చెట్లు, జంతువులు, మనుష్యులులాంటి వానిలోంచి తీసి బైటవేస్తే వైరసులు మామూలు క్రిష్టల్సుగా మారిపోతాయి. టొమేటోకు సోకే వ్యాధికి కారణమైన వై ర

సుల్ని బయటకుతీస్తే అవి 62 ముఖాలు కలిగిన అందమైన క్రిస్టల్సుగా మారిపోతాయి. మళ్ళీ వాటిని టొమేటోలోకి ప్రవేశపెడితే వెంటనే సూక్ష్మజీవుల సమూహంగా తయారయి అందులో సంచరించడం మొదలుపెడతాయి. నిర్జీవసజీవ లక్షణాలను ప్రదర్శించే ఈ వైరసులను కొద్దికాలంలోనే లేబొరేటరీలో నిర్మించే రోజుకూడా వస్తుందని శాస్త్రజ్ఞులు నిరీక్షిస్తున్నారు. అంటూ నేను ఈ వ్యాసం వ్రాస్తూవుండగా తొలుత చెప్పిన అమెరికావార్త హిందూ పత్రికలో వచ్చింది. శాస్త్రజ్ఞలోకం చిరకాలంగా కంటున్న కలలు ఫలించాయన్న మాట!

కోతుల్లోనుంచి మనుష్యులు వచ్చారనేది సామాన్య విజ్ఞానం. కోతులూ తదితర మృగాలూ, కూర్మ మత్స్యాది పూర్వవర్గాలనుంచి వచ్చాయనీ అమీబాకంటె పూర్వ ప్రాణి వైరసు అనీ వైరసు నిర్జీవపదార్థంలోనుంచి వచ్చిందనీ చెప్పే విజ్ఞానం సామాన్య విజ్ఞానంకాదు., పండితులకు మాత్రమే తెలిసిన విశేషజ్ఞానం. ప్రాథమిక పాఠశాలల్లోకి వెళ్ళి విశేష ప్రచారం పొంది సామాన్య విజ్ఞానం కావాలి.

అయితే, ఇక్కడ నేను చెప్పదలచుకున్న దేమిటంటే – ప్రస్తుతం శాస్త్రజ్ఞులు పరిణామ సిద్ధాంతాన్ని కేవలం సజీవ పదార్థ ప్రపంచానికే అన్వయింపజేశారు. కానీ, దాన్ని నిర్జీవ ప్రపంచానికికూడా అన్వయింపజేయవచ్చునని నా అభిప్రాయం. ఈ వ్యాసం ఆ అభిప్రాయంకోసం. పోతే, ముందుచెప్పిన గ్రంథమంతా దీనికి పూర్వరంగంగా మాత్రమే. సజీవ ప్రపంచావిర్భావానికి కారణభూతమైన నిర్జీవ ప్రపంచం అకస్మా

త్తుగా ప్రస్తుత రూపాన్ని ధరించలేదు. క్రమంగా పరిణామం పొందిందే అని నా భావం. సృష్టిలో 92 మూల పదార్థా లున్నాయి. ఈ 92 ఒక్కసారిగా ఉద్భవించలేదు. కొన్ని సృష్ట్యాదిలో వచ్చాయి, కొన్ని ఆ తర్వాత వచ్చాయి. ఆ తర్వాత మరికొన్ని - అట్లా క్రమంగా పరిణామం కొన సాగింది. సజీవ ప్రపంచంలో స్వల్ప నిర్మాణంతో ఒక సెల్ వున్న ప్రాణి లేక అంతకుముందు యింకా స్వల్ప నిర్మాణం వున్న జీను ఆదిమదశలో ఉద్భవించి క్రమేణా భౌగోళిక మార్పుల మూలంగా క్లిష్ట నిర్మాణాలు, అధిక శక్తులూ కలి గిన జీవజాతులు బయలుదేరినట్లే, నిర్జీవ ప్రపంచంలోకూడా తొలుత స్వల్ప నిర్మాణం కలిగిన పదార్థాలే వచ్చాయి. ఆదిమ పదార్థం హైడ్రోజన్ ఆటం స్వల్ప నిర్మాణం కలిగి నదే. తర్వాత భౌగోళికమార్పుల మూలంగా క్లిష్ట నిర్మాణం కలిగిన రాగి, నికెల్, యురేనియం లాంటి ఆటములు వచ్చాయి. మండే భూమి క్రమంగా చల్లారుతూ సంకోచిస్తూ రాగా, ఆ సంకోచపు ఒత్తిడి మూలంగా క్రమంగా ఎక్కువ ఎలక్ట్రాన్లు, ప్రొటాన్లు అదే స్థలంలో యిముడవలసిన అవ సరం ఏర్పడుతూ, తద్వారా ఎక్కువ శక్తి, ఎక్కువ క్లిష్ట నిర్మాణం కలిగిన ఆటములు ఉద్భవించసాగాయి. నిర్జీవ పదార్థం రూపొందడం దాని పరిణామం కేవలం ఆదిమ భూగోళపు సంకోచ కార్యంమీదనే ఆధారపడివుంటుందని నా అభిప్రాయం. సంకోచము తక్కువ ఉన్నప్పుడు అంటే ఆదిమ దశలో, గోళము మండే సమయంలో, ఉష్ణోగ్రత

హెచ్చుగా ఉన్నప్పుడు తక్కువ సంఖ్య ఎలక్ట్రాన్లు, ప్రోటాన్లు మాత్రమే కలుసుకునేవి. అంటే, ఆ దశలో బహుశా ఒకటి రెండు మూడు ఎలక్ట్రాన్లు, ప్రోటాన్లు కలిగి స్వల్ప నిర్మాణం కలిగిన హైడ్రోజను, హీలియం లాంటి పదార్థాలు రూపొంది ఉంటాయి. ఉష్ణోగ్రత తగ్గేకొలదీ సంకోచం హెచ్చడం, ఎలక్ట్రాన్ల, ప్రోటాన్ల కలయిక కూడా హెచ్చడం సంభవించి ఉంటుంది. సంకోచం మరింత అధికమయ్యేసరికి మరీ హెచ్చు సంఖ్య ఎలక్ట్రాన్లు, ప్రోటాన్లు కలిసి మరింత క్లిష్ట నిర్మాణం కలిగిన నికెల్, రాగి లాంటివి, ఆ తర్వాత మరింత క్రిక్కిరిసిన యురేనియం, రేడియం లాంటి ఆటములు ఉద్భవించి ఉంటాయి. ఈ క్రిక్కిరిసిన ఆటములనుంచి శక్తి ఎప్పుడూ కాంతి రూపంలో కారిపోతూనే వుంటుంది.

అతి ప్రాథమికమైంది ఉదజని ఆటం. దాని నిర్మాణం తదితర ఆటముల నిర్మాణంకంటె స్వల్పంగా ఉంటుంది. కేంద్రంలో ఒక ప్రోటాను చుట్టూ ఒక ఎలక్ట్రాను తిరుగుతూ ఉండేదే ఉదజని ఆటము. హీలియం ఆటములో రెండు ఎలక్ట్రాన్లు, లిథియంలో మూడు, నాలుగు - ఇట్లా క్రమంగా పెద్ద పెద్ద ఆటములు వచ్చాయి. ఎలక్ట్రాన్ల సంఖ్యకూడా వాటి నిర్మాణాల్లో క్రమంగా క్లిష్టత కనిపిస్తుంది. ప్రాథమిక ఆటములలో కేంద్రం చుట్టూ రెండు ఎలక్ట్రాన్లు తిరుగుతూ ఉంటే తర్వాత వచ్చిన సోడియం లాంటి ఆటములలో కేంద్రం చుట్టూ రెండు ఎలక్ట్రాన్లు తిరిగే వలయమేకాకుండా, మరొక వలయంలో 8 ఎలక్ట్రాన్లు తిరుగుతుంటాయి. క్లోరిన్ ఆటముకు మొదటి రెండు వలయాలే కాకుండా, మూడో

వలయంకూడా ఉంది. ఇట్లా అనేక వలయాలు కలిగిన ఆటములు క్రమంగా వచ్చాయి. నిశిత పరిశోధన ఫలితంగా తెలిసిందేమిటంటే, రెండు ఎలక్ట్రాన్లు ఉండే వలయం ఒకటి, దాని తర్వాత 8 ఎలక్ట్రాన్లు ఉండే వలయాలు రెండు, ఆ తర్వాత ఒక్కొక్క వలయానికి 18 ఎలక్ట్రాన్ల చొప్పున ఎన్ని వలయాలైనా ఒక ఆటం కేంద్రం చుట్టూ ఉండవచ్చు. ఇట్లాంటి క్రమం ఒకటి ఆటం నిర్మాణాభివృద్ధిలో కనుపిస్తూ ఉండడమూ, మెండలీవు శాస్త్రజ్ఞుడి "పీరియాడిక్ సిస్టమ్" నిర్జీవ ప్రపంచంకూడా క్రమంగా పరిణామం చెందిందేగానీ ఒక్కసారిగా ఉద్భవించిందికాదనీ స్పష్టం చేస్తాయి.

ఈ విధంగా నిర్జీవ ప్రపంచంలోకూడా ఒక క్రమ పరిణామం ఉందని గ్రహించవచ్చును. అయితే, లేబొరేటరీలుగానీ, గ్రంథాలుగానీ, తదితర అవకాశాలుగానీ లేని మాలాంటివాళ్ళు గాక, విశ్వవిద్యాలయాల్లో కాలం గడిపే అదృష్టవంతులు ఈ వూహలను చేపట్టినట్లయితే వాటికి పుష్టి, తుష్టి చేకూరుతుంది. అవి సిద్ధాంతాలుగా శాస్త్ర పీఠాలు అధిరోహిస్తాయి. అందుచేత వారు ఈ సామగ్రిని పరిశీలిస్తారని ఆశిస్తున్నాను.

—[१]—

# అంద చందాల తెలుగు పద్యం



గగన ఘంటాపథంలో విహరిస్తూ ఉండిన పద్య గంగా ఝరిని తిక్కన తొలుత భూమండలానికి దింపి ప్రజావళికి పంచిపెట్టాడు. ఆనాడు వ్యవహారంలో ఉన్న భాషను కావ్య నిర్మాణానికి స్వీకరించడం ద్రష్ట, సృష్టికర్త అయిన తిక్కనకే సాధ్యమయింది; పండితమాత్రులకు సాధ్యంకాదు. ఇదొక్కటే తిక్కన పద్యానికి చేసిన మహోపకారం. పద్య విద్యలో ఉన్న శిల్పాన్ని లోకానికి వెల్లడిచేసినవాడుకూడా మొదట తిక్కనే అయినా, శిల్పంలోనూ, వ్యవహారభాషా సంగ్రహణంలోనూ దాదాపు రెండు మూడు వందల యేండ్లవరకూ (అంటే శ్రీనాథుడు సాహిత్యరంగంలో అవతరించేవరకూ) కవి జాతి అంతా గురువుగానూ, దేవుడుగానూ, పూజించి అనుసరించి, అనుకరించి అనేక విధాలుగా ఆ కోవను కొనసాగించినా, పద్యం తాలూకు శిల్ప సౌందర్యాన్ని బుద్ధిపూర్వకంగానో లేక స్వభావసిద్ధంగానో పోషించినవారు తొలుత నన్నయ, తర్వాత శ్రీనాథుడు. మధ్యకాలంలోకూడా పద్యశిల్పాన్ని పోషించినవారు లేకపోలేదు. భాస్కర రామాయణంలో బాల, కిష్కింధ, సుందరకాండలు రచించిన మల్లికార్జున భట్టుగాని, నాచన సోమనాథుడుగాని, పద్యశిల్పంలో ప్రత్యేకత సాధించినవారే. వీరినే శబ్దవైచిత్రిలో పోతన అనుసరించాడనేది సుస్పష్టం. కానీ వారి శిల్పకల్పనలు తిక్కన యుగపు బృహత్తరచ్ఛాయల మాటున మణగిపోయాయి. శిశుదశలో ఉన్న

తెలుగు భాషకు మాటలు ప్రసాదించడానికి, మతవాదోద్యంలో పతనమౌతున్న తెలుగుజాతికి పరతత్వాన్ని బోధించడానికి అవతరించిన కారణజన్ముడు తిక్కన. కాని ఈ పరమార్థానికి సాధనంగా తాను గైకొన్న పద్యాలలో "శిల్పంవుంది. దాన్ని సున్నితంగా పోషించండ"ని భావి జగత్తుకు దూరదృష్టితో సూచించి పోయిన ద్రష్టకూడా. మళ్ళీ శ్రీనాథుడు ఒక మహా త్తర యుగకర్తగా అవతరించిన తర్వాతనే పద్యాన్ని తదేక దృష్టితో సుందరంగా రూపొందించడమనే సంప్రదాయం ప్రారంభమయింది. ఆ పలుకుబడిలోనే తర్వాతి ప్రబంధ యుగ మంతా నడచింది. కాని పద్యానికి ప్రజావ్యాప్తి సిద్ధించడం తిక్కన పెట్టిన భిక్ష.

సత్యం అట్లా ఉంటే, తెలుగు కావ్యాలన్నీ ఉన్నత వర్గాలకు మాత్రమే పరిమితమైనవనీ, మిగతా ప్రజానీకానికి అసలు విద్యే లేదని ఒక అభిప్రాయం మనలో ఉంది. అయితే అది సాహిత్యానికంటె ఆనాటి సామాజిక పరిస్థితులను గురిం చిన విచారణ అవుతుంది. అయినా ఒకటిమాత్రం గుర్తించాలి. మన ప్రభుత్వమువారు దయదలచి ఈనాడు ఎక్కువ పాఠశా లలూ, కళాశాలలూ నెలకొల్పిన తర్వాతనే అక్షరాస్యతలో ఎక్కువ పర్సెంటేజి వచ్చిందని, పూర్వం అంటే క్రీ. పూ. 5000 నుంచో లేక హరిశ్చంద్రాదుల కాలం ఎప్పుడో అప్పటి నుంచో అవిచ్ఛిన్నమైన వైజ్ఞానిక చరిత్రకలిగిన భారతదేశంలో ఎప్పుడూ ఇంత పర్సెంటేజి అక్షరాస్యతలేదని అనుకోవడం శాస్త్రీయ దృక్పథం కాకపోవడం అటుంచి అట్లా అనుకునే వారి తెలివితేటలకు ప్రతిష్ఠాకరంకూడా కాదు. ఉపనిషత్

దర్శన శాస్త్రాలను చూచినప్పుడు, నలందా. తక్షశిల విశ్వ విద్యాలయాలను గురించి విన్నప్పుడు, సాహిణి మారడికి "వాకిటి కావలి తిమ్మ"డికి పద్యాలమీద మోజుఉందని తెలిసి నప్పుడూ ప్రజానీకమంతా అజ్ఞానులని, కళలూ శాస్త్రాలూ కేవలం ఒక వర్గం వారివేనని అనుకోడానికి మనస్సు అంగీక రించదు. తెనుగు పద్యం ఆనాడూ ఈనాడూ ప్రజల్లో బహుళవ్యాప్తంగా ఉందని నిరాఘాటంగా చెప్పవచ్చు. ఈ సంగతి మన సాహిత్యంలో ఉన్న విస్తార చాటు కవితా సామగ్రికూడా విశదం చేస్తుంది. అందుచేత తాత్పర్యమేమి టంటే పద్యం ప్రజలందరిదేగానీ ఒక పరిమిత వర్గంది కాదు. దాన్ని తెలుగు ప్రజలు రకరకాలుగా రకరకాల సందర్భాల్లో వాడుకున్నారు. వినోదానికివాడుకున్నారు. అవధానాల్లో వాడు కుంటున్నారు. పెండ్లిసందర్భాల్లోవాడుకుంటున్నారు,పొగడ్తలకు వాడుతున్నారు, శాపనార్థాలకు వాడుతున్నారు, నీతి ప్రచారా రానికి వాడుతున్నారు. భక్తిపరంగా వాడుతున్నారు. భుక్తికి ముక్తికి వాడబడుతున్న తెలుగుపద్యం తెలుగు దేశపు జీవనదులతోపాటు ప్రజాజీవన క్షేత్రాలను శ్యామలమూ కోమలమూ చేసే మరొక జీవనది.

డ్రామాల్లో, సినీమాల్లో విరివిగా వాడబడడం పద్యం యొక్క అద్వితీయ స్థానానికి నిదర్శనం. పద్యంలేని నాట కాన్ని ఊహించగలమా? పద్యాన్ని పాడడమా లేక చదవ డమా అని ఎంత మీమాంస జరిగింది! పద్యం పాడడంలో ఎన్ని ప్రాంతాల్లో ఎన్ని విలక్షణ రీతులు ఆవిర్భవించాయి! తెనాలి, నెల్లూరు, అనంతపూరు ప్రాంతాల్లో కొన్ని ప్రత్యేక

ధోరణులు వెలిశాయి గదా. నాటకంలో పద్యం పాడుతున్న ప్పుడు వింటూ కొన్ని వేలమంది నిశ్చలంగా తన్మయత్వంలో మునిగిపోవడం చూస్తే, పద్యం తాలూకు ప్రభావం తెలుస్తుంది. అయితే, ఇందులో ఒక తమాషా వుంది. నటకుడు పద్యాన్ని పాడే పద్ధతి కవికిగాని, కవి వాడే పద్ధతి గాయకుడికి గాని సరిపోవు. కవి రాగయుక్తంగా చదవడానికి ప్రయత్నించి నప్పుడు పద్యం చెడిపోతుంది. కవి కర్తవ్యం గణాల పొందికను, శబ్దాలంకారాలను, యతిప్రాసల రమణీయతను స్పష్టం చేస్తూ ఎత్తుగడల్లో, ముగింపుల్లో, మలుపుల్లో, విరుపుల్లో చూపిన నైపుణి కనపరుస్తూ, పద్యంలోని శిల్పం ప్రత్యక్షమయ్యే మాదిరి చదవాలి. సంగీత సమ్మేళన ఈ కృషికి విఘ్నం కలిగిస్తుంది. అందుచేత కవి చదివేటప్పుడు సంగీతాన్ని విసర్జించడం అవసరం. భావంకూడా ప్రదర్శితం కావాలి. కాని, భావ ప్రదర్శన, శిల్ప ప్రదర్శన ఐకమత్యం కలిగి ఉండాలి. అంతేకాని, భావ ప్రదర్శనకోసం వచనంలాగా చదివినా, లేక "చచ్చిరి సోదరుల్, సుతులు" అనే ధోరణిలో ప్రారంభించినా ఘోరంగా ఉంటుంది. ఇట్లా కవి అవలంబించవలసిన మార్గాన్ని నటకుడు అనుసరిస్తే ప్రేక్షకుల్లోనుంచి పాషాణవర్షం, పాదుకాపట్టాభిషేకం తప్పవు. నటకుడు గాయకుడి పద్ధతి స్వీకరించినా, సందర్భోచితంకాదు కనుక, నటన అడుగంటి మర్భరంగా వుంటుంది. ఈ విషయంలో రంగస్థలం మీద శ్రీ పీసపాటి నరసింహమూర్తిగారి పద్ధతి ఉత్తమోత్తమం. నటకుడు నటన ప్రధానంగా గుర్తించవలసినట్టు,

గాయకుడు పద్యం విషయంలో సంగీతాన్ని ప్రధానంగా గుర్తించడమే న్యాయం.

కొందరు దైనిక జీవితంలో పద్యాన్ని వాడుకునే పద్ధతి చూస్తుంటే చిత్రంగా ఉంటుంది. ఆవకాయ మోస్తరుగానో. ఆవుగానో, గేదెగానో అంటే నిత్యజీవితంలో ఒక భాగమై పోయి, సర్వసామాన్య జీవితనిబద్ధ వస్తుజాలంలో ఒకటిగా పాటింపబడడం. చాలమందికి భాగవతంలో గజేంద్రమోక్షం, రుక్మిణీ కళ్యాణం, ప్రహ్లాద చరిత్ర, వామనావతారం ఇత్యాది ఘట్టాలు; శ్రీనాథుడు, మను చరిత్ర, ఆదిపర్వం, ఇంకా చాలా కావ్యాల్లో పద్యాలు కంఠపాఠంగా వచ్చు. సామాన్య సంభాషణల్లో వాటిని దొర్లిస్తూవుంటే ముచ్చటగా ఉంటుంది. ఏమీ తోచనప్పుడు అవి గట్టిగా పాడుతూ "తదీయాంతః స్ఫురత్ తాళగతి మాధురీవశంబున తర్జనీమధ్యమాంగుళుల నుపచరించుచు శిరః కంపము" చేస్తూ వుంటారు. అప్పటి వారి స్థితి చూస్తే "చేతుల దాళముదట్టుచు చేతో మోదంబుతోడ శిఖముడి వీడన్ పాతరలాడుచు మింటను గీతము నారదుడు పాడె"నని పోతన చిత్రించిన నారదమూర్తి స్ఫురించక మానదు.

కొందరికి పద్యం క్రాస్వర్డు పజిల్సులాగా పనిచేస్తుంది. ఏమీ తోచనప్పుడు ఒక పద్యకల్పన ప్రారంభిస్తే కాలక్షేపం అయిపోతుంది. నేను ప్రయాణం చేసేటప్పుడు విసుగు పుట్టకుండా ఉండడానికిగాను పద్యకల్పన ప్రారంభిస్తాను. (డిటెక్టివ్ నవల చదవను) తెలీకుండానే ప్రయాణం గడిచిపోతుంది. బస్సు దిగిన తర్వాత బస్సులో వచ్చాయన్న సంగతి కూడా

మరచిపోతాము. ఇంటికి ఒక చక్కటి పద్యరత్నాన్ని మూట గట్టుకొస్తాము. నేను చదువుకుంటున్న రోజుల్లో ఒక మిత్రుడు నాకు సహవాసి, సహాధ్యాయుడూ ఉండేవాడు. అతడూ, నేనూ కలసి ఆశువు అభ్యసించేవాళ్ళం. పడుకోబోయే టప్పుడూ పద్యమే. భోజనం దగ్గరా పద్యమే. నగరసంచారం చేసేటప్పుడూ పద్యమే మాకు. "ఏమయ్యా, పదిమైన దింక పడుకో" అని నేనంటే అతడు "ఏడ్చావులే ఊరుకో" అని ముగించే వాడు పాదాన్ని. ఉదయం హోటలుకు వెళ్ళేటప్పుడు అల్లంత దూరాన్నే, "అదిగో హోటలు, కాలభైరవ వరాహ వ్యూహ కోలాహలాస్పదమై భక్షక మక్షికా తుముల దృశ్య ద్వార దుర్దాంతమై, మదమాతంగ తురంగ సంగరధరా మధ్యం బుగా దోచునా సదనంబున్ దరియంగ జొచ్చుకొనగా శక్తుండనే మిత్రమా" అని నేనంటే, ఆ మిత్రుడు "నేనుం డంగ ప్రచండ భండనకళా నిష్ణాతుడన్, బాలకా, లోనన్ నీకు భయంబ దేల? పద, కల్లోల ప్రపంచంబునన్, లీనంబై పెసరట్లుగా రెలనునిడ్లీల్ చీల్చి చెండాడు నీ జానువ్యాప్తములైన బాహువులతో సవ్యాపసవ్యంబుగన్" అనేవాడు. ఉద యాన్నే సరదాగా సాహిత్య క్షేత్రంలో ఉత్తర గోగ్రహణం ప్రయోగించామన్న మాట. ఒకప్పు డొక తారను చూచి, "అలుకా నాపయి పంచదార చిలుకా, హల్వావు నీ వున్నచో చలికాలంబు జయింతు, సర్వసుఖముల్ సాధింతు, బాధింతు నీ కులిశ క్రూర కఠోర ఘోరతర వక్షోరాక్షస ద్వంద్వమున్ కలకాలంబు వసింతు నీ చరణ రేఖానాక లోకంబునన్" అని

ఆశువు ప్రయోగించాము. ఇట్లాగే వ్రాయగూడదా ఒక పుస్తకం అంటే "వ్రాయుటయన్న ఎంతపని, వ్రాయగలారము గాని..." అని అతడంటే "కాని రాయదాయములేక వ్రాయుట వృధాయని ధీ యనిశంబు చెప్పుటన్ వ్రాయుట మానినార" మని నేను పూరించేవాణ్ణి. ఈ వినోదాలు పద్యాలలో గాక పోతే అన్యధా సాధ్యమౌతాయా!

"నేను పద్యాలు వ్రాయడం నేర్చుకుంటాను ఛందస్సు కొంచెం చెప్పండి" అని కొందరడుగుతుంటారు. అట్లాంటివా రెప్పుడూ పద్యాలు వ్రాయనే వ్రాయలేరు. అట్లా అడుగు తూనే ఉంటారు యావజ్జీవితమూ. నేను పద్యాల ధోరణి ప్రబలమైన తర్వాత ఎప్పటికో అవసరాన్నిబట్టి ఛందో విశేషాలు తెలుసుకున్నాను. ముందు ధోరణి తోసుకు వస్తుంటే తర్వాత శాస్త్రమర్మాలు తెలుసుకుంటాము. అది ఒక అభిరుచి, ఒకధోరణి. ఒక ప్రవాహం. అంతేగాని వంట పుస్తకాలు చదివి హల్వా తయారుచేస్తే అది ఎంత చక్కగా అఘోరిస్తుందో, అట్లాగే ఉంటాయి ఛందస్సు దగ్గర పెట్టు కొని వ్రాసిన పద్యాలు కూడా. ఈ తరగతివారికి యతి ప్రాసలు లంఖిణి శంఖిణిగా కనుపిస్తాయి, దుర్యోధన పుత్రుడికి శశిరేఖ కనుపించినట్లు. పద్య రచనా పిపాసగలవారు కాగితం కలం వదలి వెయ్యాలి. ఒక స్నేహితుడితో కలిసి ఆశు ధోరణి అలవాటు చేసుకుంటే పద్యం ధారాళంగా హాయిగా దొర్లడం కుదురుతుంది. ధారాశుద్ధిలేని పద్యం తగలబెట్ట వలసిందే. ధారాశుద్ధి ఏర్పడిన తర్వాత కావలసిఉంటే కాగితం కలం పట్టుకుని సొంపయిన పదాలు సంపాదించడంలో

నిమగ్నం కావచ్చు. కాని అది రెండవదశలో చేయవలసిన పని. అయితే సాధారణంగా కాగితం కలం పట్టుకుని వ్రాసిన పద్యాలకంటే ఆశువుగా వచ్చినవే మనోహరంగా వుంటాయి. ధారాశుద్ధి లేకపోవడం, డొంక తిరుగుడుగా చెప్పడం, సరళమైనవో, పరుషమైనవో, శబ్దాలు సందర్భోచితంగా వాడక పోవడం యిత్యాది దోషాలచేత పద్యం కృత్రిమంగానూ వికృతంగాను తయారయి పద్యానికి, అపయశో మశూచి కాన్ని ఆపాదిస్తుంది. ఛందశ్శాస్త్రంలో ఇట్లాంటి దోషాలన్ని టినీ ఒక జాబితాగా తయారుచేశారు. విశేషంగా కావ్య పరిచయం సంపాదిస్తే పూర్వకవులు ఒక్కో వృత్తాన్నే ఎన్ని విధాలుగా నడిపించారు అనే కళామర్మాలు కూడా తెలు స్తాయి; పద్యరచనలో ప్రావీణ్యం సిద్ధిస్తుంది.

తెలుగుదేశంలో పద్యరచన చేసే, అసంఖ్యాక మిత్ర కోటికి అనేక సాధక బాధకాలుంటాయి. ఈ గొడవంతా వాళ్ళ నుద్దేశించి చెప్పడమేగాని సాహిత్యంలో ఉన్నత వర్గాలకు కాదు. ఈ ఉన్నతవర్గాలతో మధ్యతరగతి వారికి కుదరదు. వారిబుద్ధిప్రగల్భాలు భక్తి యుక్తంగా విని ఆనం దిస్తామేకాని, వారి దారి వారిది, మాదారి మాది. అది మేమూ గుర్తించాలి, వారూ గుర్తించాలి. వారు అక్షర ధన సంపన్నులు. శాస్త్రాంతఃపుర విహారులు. మామూలు సమాజంలో లాగే సాహిత్య సమాజంలో కూడా క్యాపిట లిజం ఉంది. శాస్త్ర నిఘంటు విజ్ఞానాన్ని ప్రోగుచేసుకుని ఆ పెట్టుబడితో సాహిత్యలోకాన్నంతా పరిపాలిస్తున్నారు. సాహిత్యాన్ని మత భూయిష్ఠం చేశారు. ఈ క్యాపిటలిస్టులు

రూపాయలతో మనిషి విలువ కొలిచినట్టు శబ్దాలతో కవి విలువ కొలుస్తారు. ఆ పెద్దలకు గాదిదంతా.

అసలు ఛందస్సునే సాహిత్యరంగంలో నుంచి గెంటి వెయ్యాలని కొందరంటున్న యీ రోజుల్లో కాలమాన రీత్యా అవసరమైన కొన్ని సవరణలు చేసే విశాలదృష్టి రాక పోతే ఛందస్సుకే అపకారం చేసినట్టవుతుంది. పూర్వంకూడా యతిప్రాసలు, గురులఘువులు, సమాస కల్పన, యిత్యాది విషయాల్లో ఎన్నో మార్పులు వచ్చాయి. ఒక్క యతి విషయం తీసుకుంటే మొదట కవి జనాశ్రయంలో 10 మాత్రమే నిర్ణయించారు. తర్వాత కావ్యాలంకార చూడా మణిలో 12 వళ్ళనీ, అనంతుని ఛందస్సులో 24 వళ్లనీ అప్ప కవీయంలో 41 అనీ నిర్ణయించారు.

అంటే శబ్దసారూప్యాన్నిబట్టి స్వతంత్రించి కవులు క్రొత్త క్రొత్తవళ్ళు ప్రయోగిస్తూ ఉంటే అవి తప్పని భీష్మిం చుకుని కూర్చోక లక్షణ కర్తలు అవి అందంగానే ఉన్నాయని తోస్తే వాటిని స్వీకరించి యతులసంఖ్య పెంచారు. అట్లా సనా తన పండితుల్లో అధునాతనదృష్టిఉంటే అదేమిఖర్మమో అధు నాతన పండితుల్లో సనాతనదృష్టి కరడుగట్టింది. సనాతన మానదండాలతో అధునాతన రచనలు కొలిచి ఈ యతితప్పు, ఆప్రాసతప్పు అనడం తప్పు. నవీనకాలపు అవసరాలను గుర్తించి అవసరమైన మార్పులుకూర్పులుచేసేఛందశ్శాస్త్రాన్ని(వ్యాకర ణాన్నికూడా) అధికారమున్నవారు పునర్నిర్మాణం చేశారంటే అద్వితీయమైన భాషాసేవ చేసినవారవుతారు. వారి కీర్తి

నన్నయ చిన్నయలవలె ఆచంద్రతారార్కంగా నిలిచిపో తుంది. సామాన్యంగా వచ్చేవి చూడండి!

1. "ఓ నవలామనోజ! సుమనోహర వాఙ్మయభోజ" అంటామనుకోండి. నవలామనోజ అని ఎందుచేత కలపకూడదు? శ్రవణపేయంగా పదాలు ఐక్యం అవుతున్నాయిగదా-"నో" అనే అక్షరం ఇక్కడ ఎట్లా వచ్చినా అందులో ఓకారం ఉందిగదా. ఎందుచేత ఆద్యమైన "ఓ"కు "నో"కు యతిమైత్రి పాటించగూడదు? "దాసోహం" అనే ఉదాహరణలో గూఢ స్వరమైత్రి ఎట్లాగూ ఒప్పుకున్నారుగదా, మరొక అడుగు మాత్రమే ముందుకు వెళ్ళమంటాను-అంతే.

2. "మరువగ నౌనొకో మరతుమన్నను" సంస్కృత సమాసంలో అయితే అఖండ యతి ఒప్పుకున్నారుగదా. ఎందుచేత తెలుగులో యిట్లాంటి సందర్భాల్లో ఒప్పుకో గూడదు! ఆద్యమైన "మ"కు సంధిగతంగాఉన్న "మ"కు సరి పోతూ ఉందిగదా. పైగా చక్కగా కూడా ఉంది. శబ్దసా రూప్యం లేని శడ లకే అప్పకవి యతిమైత్రి ఒప్పుకున్నాడు. నన్నయప్రయోగం కూడా ఉంది. అంత వైశాల్యం వారు కనబరిస్తే యీ స్వల్పమైన విషయాన్ని ఒప్పుకోలేమనడంలో అర్థంలేదు.

ప్రాసవిషయంలో "లుంటాకాలస లాలసానిల ముహు ర్లోలాళి నీలాలకున్, కంఠాలంబిత పారిభద్రకళికా" అన్న చోట "ంట"కు "ంఠ"కు శబ్ద సారూప్యం చాలాఉంది. శ్రుతి కింపుగా ఉంది. ధ్వనులుకూడా హాయిగా లీనమైపోతున్నాయి. ఎందుచేత ఒప్పుకోరు?

అట్లాగే తథలకు దధలకు, ఒత్తుల విషయంలో అన్ని అక్షరాలకు అట్లాగే ఎందుకు ప్రాసమైత్రి పాటించగూడదు? అప్పకవి లడలకు, ధదలకు, సషలకు ఒప్పుకున్నాడుగదా. దారుణమేమిటంటే అప్పకవి ఒప్పుకున్నవి కూడా మన ఆధునిక పండితులు ఒప్పుకోరు – తర్వాత గురు లఘు నిర్ణయంలో ఉదాహరణకు ప్రకృతి అనే పదంలో "ప్ర" ఎందుకు వీలైన చోట గురువుగా వాడుకోరాదు? "కృ"ను ఊది పలుకుతున్నాముగదా, (పలుకగూడదనుకోండి) "కృ"ను "క్రి" అంటున్నామా – అనవలసినప్పటికీ–? అట్లాగే "కృ"ను తేల్చి పలుకవలసినప్పటికీ ఊది పలుకుతున్నాము. వాస్తవ స్థితిని గుర్తించి "ప్ర"ను గురువుగా గాని లేక లఘువుగా గాని తీసుకోవచ్చునని ఎందుకు శాస్త్రపాశాలు సడలించగూడదు ? లేకపోతే "ఛట్ ఛట్ ఛట్ మని" త్రెంచేవారికి అప్పజెప్పవలసి వస్తుంది. అనంతుడు చూడండి "ఊదకుండును వలసిన నూదియుండు" అని "దశరథాత్మజుడు స్వామి ధాత్రి కనగ" అని లక్ష్యం చెప్పాడు. ఇంత ఘోరంగా వున్నవి మేమూ ఒప్పుకోము అనంతుడు చెప్పవచ్చుకాక.

సమాసంలో ఎందుచేత విసంధి చేయకూడదు? ఒప్పించగల హేతువేదైనా ఉందా ? ఏమీలేదు. అది సంస్కృత భాష మర్యాద. అంతే కారణం. అయితే మర్యాదకోసం భాషాభివృద్ధి బలిచేస్తామా ? విసంధి చేయడం మన మర్యాదగా ఎందుకు వ్యాప్తం కాగూడదు? బెంగాలీభాషలో విసంధి చేయడంలేదా ? మిశ్రమ సమాసాలు వాడడంలేదా ? వాళ్ళకంటే మనం ఘనులమా ? దేనిలో ? అట్లాచూస్తే ఆ పనేమీ

లేదు. "శిథిల కుడ్య గుహాంతర అంధకారమందేదియొ" అన్నప్పుడు అర్థం స్పష్టంగావుంది; సమాసమూ ధారాళంగావుంది; శబ్దసౌందర్యానికి ఏలోటూ రాలేదు. "శస్త్రాస్త్ర జాలోష్మస్ఫార" "అహీనధ్వజార్చిస్మత్యాకలితంబు" "బుద్ధ్యహంకారము" యిత్యాది డొంకతిరుగుళ్ళకంటె ఈ విసంధే సరళంగా నిరాఘాటంగా ఉంది.

వెనక చెప్పిన అనంతుడి "ఊదకుండును" ఉదాహరణం తెలుగులోకి వచ్చేసరికి బాగా లేకపోయినా పాపం ఆయన చెప్పింది మాత్రం కరెక్టు. ఎందుచేతనంటే అది సంస్కృత మర్యాద. "జాగర్తి లోకోజ్వలతి ప్రదీపః" అన్నచోట వాక్యాంతమైనా "ప్ర"కు ముందున్న అక్షరం గురువే అవుతుంది. మన అనంతుడు ఆ శాస్త్రప్రకారమే "దశరథాత్మజుడు స్వామి" అనే లక్ష్యాన్ని ప్రవచించాడు; అందుకే ఏ భాష మర్యాద ఆ భాషది అనేది గుర్తించాలి. ఒకదానిది మరొకదానిమీద రుద్దవద్దు.

మనకొక సాహిత్య అకాడమీ ఉందిగనుక వారు ఈ విషయాలన్నీ చర్చించి శాస్త్ర నిర్ణయం చేయవచ్చు. గ్రాంథిక వ్యావహారిక భాషావాదాలమీద యింతవరకూ నిర్ణయం జరగలేదు. ప్రజలేమో ముందుకు తోసుకుపోతూ ఉంటే అధికారవర్గం మాత్రం శివ శివా అని చెవులు మూసుకుని ఊరుకున్నారు. తెలుగుభాష యింతవరకూ అంటే ఎనిమిది, తొమ్మిది వందల ఏళ్ల తర్వాతకూడా ఒక స్థాయికి రాలేదు. ఇంకా రూపొందే శైశవదశలోనే ఉంది. ఇప్పుడు

చక్కగా పోషించకపోతే శైశవదశనుంచి వట్టి శవ దశకు పోతుంది. మళ్ళీ ఎప్పటికో పునర్జన్మ...గ్రాంథికం అధికార భాష అయినా వ్యవహారభాషనే రచనకు అందరూ వాడు తున్నట్టే, పద్యాల విషయంలో కూడా కవులు స్వాతంత్రించి మంచివని తోచిన మార్పులు కూర్పులుచేసి కవితా వ్యవ సాయం సాగిస్తున్నారు.

# తెలుగు పద్యం అజరామరం



పద్యం సారస్వతమద్యం ; అనుభవైక వేద్యం. ఎవరు ఎప్పుడు దాన్ని తెలుగులోకి ప్రవేశపెట్టారో దానికి సాక్ష్యమేమిటో యిత్యాది "సాహిత్య కుస్తీలన్నీ" పెద్దలకు వదలివేసి, అది ఎంత మంచిదో, దాని ప్రభావమేమిటో, దాన్ని వాడుకునే విధానమేమిటో ఆలోచిస్తే కొన్ని చిత్రమైన విషయాలు గోచరిస్తాయి. తెనుగుపద్యం అతి శక్తిమంతం. సాహిత్యలోకంలో సుమారు 800 ఏండ్లకు పైన నిరంకుశంగా పరిపాలన సాగించింది. నన్నయ్య, తిక్కన, శ్రీనాథాది అద్వితీయ ప్రతిభావంతులను గుప్పిట్లో పెట్టుకొని మరొకదారి త్రొక్కనీకుండా చేసింది; పద్యం వ్రాస్తేనే కవి లేక పోతే కాదు అనే స్థితికి తెచ్చి కవులచేత "త్వమేవ శరణంమమ" అనిపించింది.

నన్నయభట్టో, లేక, వేములవాడ భీమకవో ఎవరో పద్యాన్ని తొలుత అవలంబిస్తే అప్పటినుంచీ 18, లేక, 19వ శతాబ్దంవరకు కూడా మన వాఙ్మయానికి మరొక పద్ధతిలేదు! ఎంతో ఆశ్చర్యమైన విషయం. ("వచియింతు వేములవాడ భీమనభంగి", అనే కాశీ ఖండ పద్యంలోని ఆనుపూర్విక క్రమాన్నిబట్టి భీమకవి మొదటి వాడేమో అని అనుమానిస్తున్నాను - అది అట్లా ఉంచుదాం) ఇన్ని శతాబ్దాలు తెలుగు వారికి, అందులోనూ అఖండ ప్రజ్ఞాధురీణులు శ్రీ

నాథాదులకు పద్యం తప్ప మరోమార్గం స్ఫురించలేదంటే ఆశ్చర్యంగాక మరేమిటి? వేరొక పద్ధతి వద్దని రాజులు శాసించారా, ప్రజలు ఘోషించారా - అదేమీలేదు. మరొక పద్ధతివాళ్ళకు తెలీదనేకంటే పద్యంయొక్క ప్రభావం అంత గొప్పది అనడం సమంజసం. ఇన్ని శతాబ్దాలు ఒక్క నాటకానికైనా తెలుగువారు నోచుకోలేదంటే బాధగాకూడా ఉంటుంది. ఒకానొక శుభలగ్నంబున హఠాత్తుగా శ్రీనాథుడు రచించిన నాటకం ఒకటి ఏ తాళపత్ర గ్రంథమో, ఏ అటకమీదనో, శిథిల కుడ్యాలలోనో, సరస్వతీ మహల్లోనో దొరికిందని ఒక వార్త మెరుపై మెరిసిందనుకోండి - అదెంత సంచలనం రేపుతుంది! తెలుగుదేశం యావత్తు ఎలక్ట్రిక్ షాక్ కొట్టినట్టు పడిపోతుంది.

ఇతర వాఙ్మయాలలో క్రీస్తుకు పూర్వం చిరకాలం నుంచీకూడా నాటక ప్రక్రియ ఉంది. బహుశా యితర వాఙ్మయాలలోముఖ్యంగా సంస్కృతము, గ్రీకు, ఇంగ్లీషు భాషలలో మహాకవు లనిపించుకున్న వాళ్ళంతా నాటకాలు వ్రాసిన వాళ్ళే. వారిలోనూ కొందరు అసలు పద్యకావ్యాలే వ్రాయ లేదు. భాసుడు ఏ పద్యకావ్యం వ్రాశాడు? అట్లాగే శూద్ర కాదులు? షేక్స్పియర్ సోనెట్సు వ్రాశాడు కానీ ఆయన ప్రపంచ ఖ్యాతి కేవలం సోనెట్సు మూలంగా కాదుకదా! అట్లాగే బెర్నార్డ్షా!

అయితే సవిమర్శగా చూస్తే పద్యశిల్పం అంత కష్ట మయిందికాదు. చాలమంది కవులు ఆ శిల్పంలో ఉత్తీర్ణు లయ్యారు. కారణం రమణీయభావాలు, మనోజ్ఞమైన పదాలు

పద్య శిల్పానికి చాలు. నాటక సృష్టికి అవి చాలవు. విస్తారమైన లోకజ్ఞానమూ, తదేకతపస్సు, పరిపక్వమైన బుద్ధి ప్రగల్భత, దృష్టిలో, వాక్కులో చమత్కారమూ యివన్నీ కావాలి. ఇన్ని కావాలి గనుకనే సాహిత్య శిఖరారోహణలో అంతిమ స్థాయి నాటకం అన్నారు ఆలంకారికులు. అయితే పద్యానికి ప్రయోజనం లేదన్నా, అధమస్థాయి అన్నా సమంజసంగా ఉండదు.

ఇతర భాషలలోకూడా ఛందోమయ వృత్తాలున్నాయి గాని తెలుగు పద్యంలాంటి విలక్షణ కళాఖండం ప్రపంచం లోనే లేదనుకుంటాను. శ్రీవిగా, మనోహరంగా, రాగరస భరితంగా పాడడానికి అనువయింది ఒక్క తెలుగు పద్యమే. ఇంగ్లీషువాడు, హిందీవాడు, జపానువాడు రంగమెక్క నివ్వండి; తెలుగువాడూ ఎక్కుతాడు - ఏ ఘంటసాలో, పీస పాటో లేక పులిపాటో, వాళ్ళ వాళ్ళ పద్యాలు వాళ్ళుపాడితే, విషయం తేలిపోతుంది. అదీ తెలుగు పద్యమంటే. పద్య గాయకుడో నేపథ్య గాయకుడో పాడుతూఉంటే ఉర్రూత లూగుతూ మైమరచిపోయేది తెలుగుజాతి; ఇది పద్యాల జాతి. తెలుగు వాఙ్మయవనంలో ఉత్పలాలూ, చంపకాలూ వికసిస్తాయి. మత్తేభాలూ శార్దూలాలూ విహరిస్తాయి. గీతాలు వినిపిస్తాయి, సీసాలు కూడా ఉన్నాయి- ఎంత రమణీయ వాతావరణం కళాతపస్వికి! అనన్యం, అసామాన్యం. అందు చేతనే ఆనాటినుంచీ ఈనాటివరకూ పద్యం అసంఖ్యాక కవి కోటికి ఆశ్రయం అయింది.

అయితే ఆకర్షణీయం కావాలంటే, పద్యం ఎట్లా వ్రాయాలి? ఆకర్షణీయంగా చేయడానికి మన ముందువారు ఏ చమకులు, ఏ చమత్కారాలు, ఏ టెక్నిక్కులు అవలంబించారు? అనేది గమనించి పద్యశిల్పం తాలూకు కీ లెరిగి దాన్ని నిర్వహించారంటే పద్యం అమోఘమయింది. అయితే పద్యంయొక్క ప్రయోజనం ఎంతవరకూ అన్నదికూడా గ్రహించాలి. ఆవకాయ దగ్గర్నుంచి ఆపస్తంబ సూత్రాల వరకూ అన్నీ పద్యాలలోనే వ్రాస్తానని పట్టుపట్టడం చాదస్తము. చాకలిపద్దు నుంచి సాహిత్యం వరకూ అన్నీ గేయాలలోనే వ్రాస్తాననే మూర్ఖమూ పనికిరాదు.

పద్యం రత్నాలనూ, రాళ్ళనూ మలచి శిల్పంతో జీవంపోయడం- అవి రత్నాలుగా, ఆభరణాలుగా ఆనందాన్నిస్తాయి అలతి అలతి పలుకులుకూర్చి పూలదండలు గ్రుచ్చడం లాంటిది. ఒకొక్కప్పుడు ఆ పూలదండలు ఎదను పువ్వుల పొదనుగా, చేస్తాయి. అంతేగాని, జీవితాన్ని నిండుగా విపులంగా చూపడానికి ఆ నియమ బద్ధమైన పద్ధతి చాలదు; విశృంఖలమైన మార్గం కావాలి. అదే వచనం.

తిక్కనలో జీవంలేదా అనవచ్చు. కానీ అది పద్యం కాదు, వచనం. విస్తారంగాసాగే కథా కథనానికి పద్యాన్ని అవలంబించడం సముచితంకాదేమో. పాత్రలూ, సంభాషణలూ యిత్యాది వేడుకలు తీర్చుకోవాలనుకున్న వారికి దశవిధ రూపకాలున్నాయి; వాటిని ఆశ్రయించవచ్చు. ఈ విచక్షణ లేకపోవడం చేతనే పద్యాలలోనే తలగడల్లాంటి పుస్తకాలు తయారుకావడం పూర్వం జరిగింది. నన్నయాదులలో కూడా

ప్రతి పద్యమూ అందంగా ఉండదు. కథన భాగం వచన ప్రాయంగా ఉంటుంది. ఎంత పెద్దకవి అయినా అది సహజమే. అక్కడక్కడా రసపట్లలో మాత్రమే పద్యం శిల్పమూర్తిని ధరిస్తుంది. ఆ పట్లలోనే రకరకాల ఎత్తుగడలు, విరుపులు, మలుపులు, యిత్యాది శిల్పరీతులు ఆవిర్భవించాయి. బహుశా పద్యంయొక్క మర్మాన్ని, ప్రయోజనాన్ని సమగ్రంగా అవగాహన చేసుకున్నవాళ్ళు ప్రబంధ కవులే అనుకుంటాను. పద్య కవిత్వం చెప్పాలంటే అట్లాంటి క్లుప్త వస్తువే తీసుకోవాలి, అంతవరకే చెప్పాలి. ఆ పరిధిలోనే శిల్పవిలాసం ప్రదర్శించాలి అన్న విషయాలను గుర్తించారు. వారు కూడా నన్నయ నుంచి శ్రీనాధుడి వరకూ ఉన్న కావ్యసామాగ్రి పరిశీలించే యీ అభిప్రాయానికి వచ్చి ఉంటారు. పూర్వపు వారిలో ఉన్న అతి మనోహరమైన సారాంశమే గ్రహించి కావ్యానికి అనవసరమనిపించిన నిస్సార పదార్థాన్ని పరిత్యజించారు. అందుచేతనే భారతాలూ, మార్కండేయ పురాణాలూ, కాశీఖండాలూ రావడం ఆగిపోయి, మనుచరిత్ర, వసు చరిత్ర యిత్యాదులు క్లుప్త కథా వస్తువులతో పద్య శిల్పానికి అనువైన పద్ధతిలో చిన్న చిన్న గ్రంథాలు అవతరించాయి. అవి కేవలం కవిత్వం కోసమే; శిల్ప ప్రదర్శన కోసమే అని భావం.

అన్నీపద్యాలలోనేఉండాలిఅనేవాళ్ళుంటే, పద్యాలలోఅన్నీ ఉండాలనేవాళ్ళూ ఉన్నారు. వాళ్ళ జహల్లక్షణ, "గంగలో గొల్లపల్లె", జీవత్పాత్రవైచిత్రి వగైరా యినప ఘుటికలన్నీ ఆ పద్యంలోనే యిరికించి ఒక "సాహిత్య తాళింఖానా"

తయారు చెయ్యాలంటారు. వ్యర్థ పదాలుండకూడ దంటారు. వ్యర్థ పదాలు లేకుండడమే కవిత్వమైనట్లు. ఈ వ్యర్థ పద గర్హణోత్సాహంలో పడి వ్యర్థ పదమంటే ఏమిటనే స్పష్టమైన రసదృష్టి వదలివేయబడింది. "ఆకర్ణింపు కర్ణంబులన్" అన్నాడే; కర్ణములతో కాకపోతే మరొకదానితో వింటారా? అని ఆక్షేపణ. అది ఎంత అందమైన ముగింపు, శబ్దసారళ్యం ఎంత చక్కగా వుంది, అనే దృక్కోణాలు వారికి స్ఫురించవు. అసలు వ్యర్థ పదమంటే అర్థానికి అనవసరమైన పదమా లేక అందానికి అనవసరమైన పదమా? ఆ మీమాంస శబ్దాన్ని గురించి అయితే కవిత్వంలో రెండవదే ప్రధానం గదా.

## పద్య విరోధులు

ఇన్ని వందల ఏండ్లకుగాను 20వ శతాబ్దంలోనే పద్యం మీద కొందరు విరోధం వహించారు. (ఇక్కడ పద్యంవేరు, కవిత్వంవేరు, అన్న సూక్ష్మం గ్రహించాలి; పద్యం ఒక పద్ధతి; కవిత్వం ఏ పద్ధతిలోనైనా చెప్పవచ్చు.) ఒక ధోరణి కవిత్వంమీద ఉన్న ద్వేషంతో పద్యాన్ని వధించడానికి ఉద్యమించారు. "కించిత్తు నల్లిగరచిన మంచమునకు చేటువచ్చు" నన్నట్టు పద్య మేమిచేసింది పాపం? పద్యం చక్కటి శయ్యా సౌభాగ్యాన్ని సమకూర్చింది. అందులో విరోధులు పడుకున్నారని, ఆ శయ్యనే విచ్ఛిన్నం చేయబూనడం ఏమంత సమంజసమైన కార్యంకాదు. "గేయాలనే దుడ్డుకర్రలతో పద్యాల నడుములు విరగదంతాన్", అని ఒక వర్గం, "గేయాల వీపులు చిదక్కొడతాం" అని మరొకవర్గమూ అనేక సంవత్సరాలు

బాహాబాహి, కచాకచి మల్లయుద్ధాలు చేశారు. కవిత్వమంటే పద్యమేనని కొందరూ, కాదు గేయమేనని కొందరు; దేవుడంటే శివుడేనని కొందరూ. కాదు కేశవుడేనని కొందరూ దెబ్బలాడుకొన్నట్టు.

ఈనాడు పద్యాలూ వస్తున్నాయి, గేయాలూ వస్తున్నాయి. రెంటికీ గౌరవం ఉంది. దేనికీ విధి నిషేధాలులేవు. అయితే కవిత్వమనే ఆ ఆనందస్వరూపిణి ఏ ఒక్క రూపంలో మాత్రమే ఎందుకు ఉంటుంది? పద్యంలో ఉంటుందా, గద్యంలో ఉంటుందా, గేయంలో ఉంటుందా, అని వెదకడం వట్టి అజ్ఞానం.

మొత్తంమీద పదాడంబరమంటూ పరిహసించినవారంతా మళ్ళీ సొంపైన పదాలు సంపాదించడంలోనూ, అనుప్రాసల అన్వేషణలోనూ నిమగ్నులవడం చూస్తూనేవున్నాము. భావం ప్రధానమైనా, భాష కూడా అందమయింది కావాలి అనే సత్యాన్ని చెప్పకుండా ఒప్పుకుంటున్నారు. అయితే చిత్రమేమిటంటే ఏదో అవ్యక్తమైన మూఢవిశ్వాస ప్రాబల్యం వల్ల కావచ్చు. ఈ నాటి ప్రచురణ రంగంలో - ప్రజలలో యింత పలుకుబడి ఉండి కూడా-పద్యానికి ఆస్కారం లేకుండా పోతూఉంది. ప్రజలలో పద్యానికున్న స్థానం పద్యానికి వుండనే ఉంది. ఏనాడూ పోలేదు, బలహీనంకూడా కాలేదు. ఈ కొత్త రాతియుగంలో కూడా పెద్ద పాండిత్యం లేకపోయినా, పద్యాలు గానంచేస్తూ ఆ ధారాళశబ్దతరంగసంఘాల సంగీతంలో దొర్లిపోతూ ఆనందించేవారు వందలాది ప్రజలున్నారు.

తెలుగుదేశపు పల్లెలలోనూ, పట్నవాసాలలోనూ, పద్యం మీది మోజు తెలుగుదేశంలో ఎప్పటికీ మాసిపోదేమో.

నూతన భావాలు, ఆధునిక వైజ్ఞానికచ్ఛాయలు పద్యాలలో తీసుకురావచ్చు. ఆ నూతన సామగ్రి ఏ యితర కవితా పద్ధతులలోకంటే పద్యంలోనే ఎక్కువ బిగువూ, లఘువూ గుస్తరించుకొని అమోఘంగా రాణిస్తుంది. కాంతా సమ్మితం కాకుండా పురుషత్వ పటిమా జటిలంగా చేస్తే పద్యం కలియుగంలో ధర్మసంస్థాపనార్థం బ్రహ్మాస్త్రంగా పనిచేస్తుంది.

"కరిభీకర గ్రాహ కంఠలుంఠనవేళ
హరిధరించిన చక్రఖర మరీచి
కుంభినీధర సముజ్జృంభ మాగెడునాడు
గోత్రారిదాల్చిన కులిశధార

... ... ... ...

స్మృతిపథంబుల ఝళిపింప జేయవలయు
వసుధ కలికాల రాక్షస వర్గదుర్గ
భేదనోదగ్రఘాటి గుంభింపవలయు
గత భయంకర కవితా శతఘ్ని అగ్ని."

కళా మర్మం తెలిసి పద్య నిర్మాణంచేస్తే ఆ పద్యం అఖండ కళాఖండమై, అశేష మానవకోటికి ఆనందకరమై శాశ్వతంగా నిలిచిపోతుంది.

—౦—౦—

# పద్యమూ, ఆధునికవస్తువూ.

దేశంలో పద్యంమీద యింకా మోహమో అభిమానమో ఉందంటే అది కేవలం మూఢవిశ్వాస పురస్కృతమని నా మిత్రుల అభిప్రాయం. పద్యం మీది అభిమానం సనాతన ఆచారాల మీద అభిమానం ఉన్నవారికేగాని, కాలంతో పరుగెత్తే అభ్యుదయ వాదులకు కాదు అని ఆయన యింకా కొంచెం విస్తరించాడు.

పద్యం ప్రాచీనం, గేయం నవీనం అని సాధారణంగా అనుకుంటారేమో. కాని గేయమే ప్రాచీనమని, పద్యమే నవీనమని, తరువోజలు, మధ్యాక్కరలు, దరువులు, కందార్థాలు-ఇవన్నీ గేయజాతివేననీ, ఆ తరువాత క్రమంగా యతిగణ ప్రాసలతో నిబంధింపబడడంచేత, సంస్కృత చ్ఛందస్సునుంచి కొన్ని ప్రక్రియలు తీసుకోవడంచేత, పరిణామం కొనసాగి, చివరకు పద్యం అనే ఒక నవీనమూర్తి అవతరించిందనీ పరిశోధకులు చెబుతున్నారు. అదట్లా వుంచుదాం. కానీ పద్యాభిమానమంటే పూర్వకాలాభిమానమా! సవ్యంగాచూస్తే ఆ రెంటికీ అట్లాంటి అవినాభావ సంబంధ మేమీలేదు. చాలా అల్ట్రామాడరన్ వ్యక్తులు కూడా పద్యాన్ని అభిమానించేవాళ్ళున్నారు. సూపర్ అభ్యుదయవాది ఒక మిత్రుడు లెనిన్ జీవితాన్ని పద్య కావ్యంగా వ్రాస్తానన్నాడు. అయితే అది కొందరి దృష్టిలో వైష్ణవుడి మెళ్ళో రుద్రాక్ష కట్టినట్టుగా ఉంటుందేమో (ఉభయభ్రష్టా)—శ్రీశ్రీ చటులాలంకారాల

సంకెళ్ళలో కవితబందీగా ఉందన్నప్పుడు పద్యాల నడుములు విరగదన్నమని ఆయన అభిప్రాయం అనుకోను. అది ఆనాటి కవిత్వంమీద పుట్టిన ఏవగింపు. పద్యం అనే ఒక ఛందః ప్రక్రియమీద కాదేమో. ఆ శృంగార రసం, ఆ నాయకులు ఆ నాయికలు, ఆ అసందర్భమైన శబ్దాలంకారాలు, ఎన్ని శతాబ్దాలు గడచినా ముఖానికి చంద్రబింబం, తొడలకు అరటిచెట్లు అనేఉపమానాలు, ఆ ఉత్ప్రేక్షలు, ఆ అతిశయోక్తులు, ఒకడు చెప్పిందే మరొకడు చెప్పడం, వీలైతే వాడిది వీడూ వీడిది వాడూ కాపీ కొట్టడం, ఆ కాపీ కొట్టడం ఒక గౌరవనీయమైన సాహిత్య మర్యాద అవడం, ఇదంతా ఇన్ని శతాబ్దాలవరకూ కొనసాగుతూనే ఉండడం, పరిస్థితులుమారినా ధోరణిమారకపోవడం-దీన్నంతా అసహ్యాం అన్నాడు శ్రీశ్రీ. కాలం మారింది కనుక ఆ కవిత్వం ఇప్పుడు మంచిది కాదనిపించడం సహజం కానీ, ఆ కాలానికి అది బాగానే ఉండి ఉంటుంది కనకనే యింత కాలం అది నిలిచింది. ఇంకా నిలవాలంటే యిక అట్లా వ్రాయడం అనే పిచ్చి పోవాలి. అప్పుడే అది గౌరవంగా నిలుస్తుంది. కాదు యింకా అట్లాగే వ్రాస్తానంటే దాన్ని హాస్యభాజనం చేయడమవుతుంది. అయితే యీ విషయాన్ని దేశంలో గ్రహించారు కనుకనే భావకవిత్వమనీ, అభ్యుదయ కవిత్వమనీ నూతన పద్ధతులు బయలుదేరాయి. రాయప్రోలు, జాషువా ప్రభృతుల కవిత సముజ్జ్వలమయింది. కాదా? దేశాన్ని ఉఱ్ఱూత లూపలేదా? కనుక కాలానుగుణంగా కవిత చెప్పాలనడాన్ని గురించి భేదాభిప్రాయమేమీ లేదు. కాలానుగుణంగా కవిత్వం చెప్పడాని

పద్యం అనర్హమా, ఆటంకమా అన్నదే ప్రశ్న. క్రమంగా ఆదిమ గేయం పరిణామం పొంది ధరించిన నూతన రూపం పద్యం. ఒక కాలంలో పెట్టుకున్న నియమాలు తరువాత కాలంలో ఆచరణ సాధ్యం కాకపోవడం, అందుచేత వాటిని సవరించడం లోకంలో పరిపాటి. యతిగణ ప్రాసలూ అట్లాగే అవసరాన్నిబట్టి కాలానుగుణంగా మార్పుచెందాయి. నింబం ధనలలో సహేతుకమైన, సమంజసమైన సడలింపులు సవరణలు కొన్ని చేశారు. అఖండయతి, గూఢ స్వరయతి, ప్రాసయతి ఇట్లాంటివన్నీ ఆపరిణామ ఫలితాలే. ఇప్పుడింకా-అంతే, 1961 నాటికి. పద్య నిబంధనలలో చాలా మార్పులు చేస్తే పద్య రచన చాలా సుగమం అవుతుంది. అంతేగాని, ఎలుక లున్నాయని యిల్లు తగలబెట్టరు.

అయితే ఒకటనవచ్చు. ఇన్ని మార్పులు చేసుకుని అయినాసరే పద్యంలోనే కవిత్వం ఎందుకు చెప్పాలి?-అని. అవును ఎందుకు చెప్పాలి? చెప్పమని ఎవరూ ప్రాధేయపడ లేదు. పద్యంలో చెప్పకపోతే కవిత్వం కాదని బెదిరించడం లేదు. ఇష్టం లేకపోతే హాయిగా గేయంలో చెప్పండి. లేక పోతే ఇంకా కొత్తదేదయినా మీ దగ్గరవుంటే అందులోనే చెప్పండి కానీ అందుకు పద్య వధ అవసరమా అని. ఈ గేయ రచనా యజ్ఞానికి పద్యం బలికావాలా అనేదే ప్రశ్న. ఆధునిక గేయ కవిత్వం మంచిదికాదనే వాళ్ళు ఈ రోజులలో అరుదు. పద్యాభిమానులుకూడా గేయం క్షేమంగా బ్రతకాలనే ఆకాం క్షిస్తారు. రెండూ ఉండవలసిందే. దేనికి కాలం తీరితే అదే చస్తుంది. కాని దేని అకాల మరణానికీ ఎవరూ కంకణం

కట్టుకోవద్దని మాత్రమే దీని తాత్పర్యం. సాహిత్యాన్ని ప్రజాస్వామ్యం.గా ఉండనిద్దాం, అంతే.

శ్రీ శ్రీ మాదిరి గేయం చెబితే గేయం ఎందుకు చస్తుంది? శ్రీనాథుడి మాదిరి పద్యం చెబితే పద్యం ఎందుకు చస్తుంది? శ్రీ శ్రీ, శ్రీనాథులు యుగకర్తలు మార్గం చూపించారు. దాని వెంటవెళ్ళి దాన్ని ప్రోద్బలం చేయగల వారు రావాలి. శ్రీనాథుడి తర్వాత అల్లసాని పెద్దన వచ్చాడు. శ్రీనాథుడి పద్ధతిని ఎంతో అభివృద్ధి చేశాడు. జగన్మోహనమైన కవిత యిచ్చాడు. కాని శ్రీ శ్రీ మహో జ్వాల కాంతి శిఖరానికి దారిచూపించిన తర్వాత, నవప్రపంచ ద్వార కవాటాలు తెరచిన తర్వాత అంత, హుందాగా వెళ్ళిన వాడేడీ? గేయానికి యిప్పుడున్న దశలో ఏ విధమైన శక్తీలేదు. ఒక మహాకవి దాన్ని చేపట్టాడన్న ఘనతమాత్రమే ఉంది. పద్యానికి అట్లాకాదు; ఒక మోసరువాడు వ్రాసినా సెబాసనిపించుకోగల సామర్థ్యముంది. శతాబ్దాల పర్యంతం జరిగిన కృషిమూలంగా పద్యానికి స్వతఃసిద్ధమైన శిల్ప ప్రతిభ ఏర్పడింది. పద్యపు స్థాయికి వచ్చే శక్తి గేయంలో ఉందో లేదో చెప్పే దశలోకూడా గేయం లేదు ఈనాడు. మరి శ్రీ శ్రీ గేయాలంటేనో! వస్తువు తాలూకు సముజ్జ్వలత కవి తాలూకు సమున్నతి ఐక్యమై మహాప్రస్థానమనే సాహిత్య మేరువు ఆవిర్భవించింది. ఆ తర్వాత గేయాన్ని అట్లా నడిపిన వాడేడీ? (ఆఁ నేను కాదా అని కొందరు బాధపడవచ్చు గాక) తర్వాత-పద్యంకూడా ఒక్కరోజులో ఈ స్థితికి రాలేదు. ఎంద రెందరో ప్రజ్ఞానిధులు పద్యాన్ని ఎన్ని విధాలుగానో

నడిపించి, పలికించి, నగిషీలుచేసి యీ స్థితికి తెచ్చారు. గేయాన్ని అట్లా మలిచిన వారేరి? లయబద్ధంగా వ్రాయా లన్న నియమమే విసర్జించారా అనిపిస్తుంది ఈనాటి గేయ రచన చూస్తే. గేయమంటేఒకవిధమైన వచనమే అనిపిస్తుంది. కొందరి చేతులలో గేయాని కొక చక్కటి రూపాన్ని సంత రించాలన్న సంకల్పమే ఎవరికీరాలేదు. ఇట్లాంటి సంకల్పాలు అందరికీరావు సాధారణంగా. తెలుగు భాషను శాసించాలని తొలుత ఒక్క నన్నయకే తోచింది. వచనానికి నాంది వెయ్యాలని ఒక్క చిన్నయకే స్ఫురించింది. అట్లాగే గేయా నికి శ్రీ శ్రీ లభించాడు. తర్వాత దాన్ని తుదిముట్ట నిర్వ హించేవారు లేకపోవడం గేయం దురదృష్టం. యతిప్రాసల బాధనుంచి విముక్తి పొందామన్న ఉత్సాహం కనుపించిందే గానీ ఆ తర్వాత తెలుగు జాతికి ఏమిద్దాం, ఏ శిల్పాన్ని నిర్మిద్దాం అన్న బాధ్యతాయుత దృష్టి ప్రదర్శింపబడలేదేమో అనిపిస్తుంది. శ్రీ శ్రీ లాంటివాళ్ళు మరొక యిద్దరైనా ఆ కోవలో రాకపోవడంచేత గేయశిల్పం అభివృద్ధిపొందే ఆస్కారం లేకపోయింది. గుడిపాటి వెంకటచలంగారు గేయ రచనను పూనుకుని ఉంటే ఎట్లా ఉండేదో! ఇప్పుడయినా వారు వ్రాయాలనే ఆంధ్ర సరస్వతి ఆకాంక్ష.

ఈనాడు గేయాన్ని తీర్చిదిద్ది ఒక పద్ధతిలో పెట్టవలసిన అవసరం ఎంతయినా ఉంది. ఎందుకు అని ఎవరన్నా అంటా రేమో! అయితే ఒక ప్రశ్న వస్తుంది. అసలు లయబద్ధంగా వ్రాసే విధానమే అక్కరలేదా? ఒక్క వచనమే చాలునని ఉద్దేశమా? ఇంకోవిధంగా చెప్పే అవసరం లేదా కవిత్వంలో?

లేదంటే యిక చెప్పేదిలేదు. ఈ వివాదం ఎట్లావున్నా గేయం ఛందోరీత్యా అభివృద్ధికావాలి. పూర్వపు వాదాలు ఈనాడు చూస్తే ఎంతో మూర్ఖంగా కనుపిస్తాయి. సాహిత్య రంగంలో రావలసినవి కావు; రాజకీయరంగానికైతే సరిపో వచ్చు. విషానికీ పీయూషానికీ ఎంతదూరం ఉందో అంత దూరం ఉంది ద్వేషానికీ సాహిత్యానికీ.

పద్యం అధునాతన సామగ్రికి అనువుగా ఉండదేమో అనే సందేహాన్ని సానుభూతితో సవిమర్శగా చూస్తే అట్టి సందేహం అనవసరమనిపించింది. భావకవిత్వపురోజులలోనే ఈ విషయం తేలిపోయింది. ఎంతో అధునాతన విషయాలు హాయిగా చెప్పారు పద్యంలో. ఇంకా అధునాతనమైనవి చెప్పాలన్నా చెప్పవచ్చు. అసలు గ్రాంధికభాషేకాదు, వ్యావహారికభాషేకాదు ఏ భాష వాడినా పద్యం రమణీయతనే కలిగిస్తుందని ఋజువుచేయవచ్చు. ఈ విషయాన్ని 19వ శతాబ్దంలోనే పాల్కురికి సోమనాథుడు ఋజువు చేశాడు. వృషాధిప శతకంలో సంస్కృత, ద్రావిడ, కర్ణాట, ఆరె, మణిప్రవాళ భాషలలో పద్యాలు వ్రాశాడు! నేను కొన్ని ఎక్స్పెరిమెంట్సు చేశాను. అయితే ఒకటి గమనించాలి; మార్పు ఒక్క ఛందస్సులోనే వస్తే చాలదు. భాషలో, వ్యాకరణంలో, అలంకారంలో - అన్నిటిలో రావాలి. అది వస్తువు మారడంచేత కలిగే అవసరం. శాస్త్ర విషయంగా కవులు స్వతంత్రించి అతిక్రమణలు చేయాలి. లాక్షణికులు తర్వాత నెమ్మదిగా గుర్తించుకుంటారు. వాళ్లు వెంటనే గుర్తించనక్కరలేదు కూడా!

నా ఎక్స్పెరిమెంట్లను జనత, ఆత్మ, వ్యవహారభాష అని మూడు విభాగాలక్రింద ఉదహరిస్తాను.

"శ్రమియించే శతకోటి
మానవుల కాశాజ్యోతి లేదా విష
క్రిమి బాధామయ కాళరాత్రికి
ఉషశ్శ్రీరేఖ జన్మింపదా
సమ సౌభాగ్య దినంబువచ్చి
జగతీ సంగ్రామరంగంబులన్
రమణీయోజ్వల శాంతిసౌఖ్యమయ
సామ్రాజ్యమ్ము వర్ధిల్లదా"

* * *

"ఎందుకురాదు, విశ్వజగతీమహతీ శతకోటి తంత్రులై
ముందుకు పోవురోజు..."

* * *

"ఝురులై రక్తము పారనీ శత
సహస్ర ప్రాణముల్ కూలనీ
మురిపెంబొప్పు కుటుంబముల్ చితికి
నిర్మూలంబు లై పోవనీ
వెరపుం జెందక ముందు కేగుడు
సమావిర్భూత ప్రాతః ప్రభా
భరితంబైన నవ ప్రపంచమదె
యాహ్వానించె ప్రాంచద్గతిన్"

* * *

"కులగోత్రమ్ములు మీకు లేవు, ధనిక
క్రూర క్రియా పీడిత
జ్వలిత ప్రాణిచమూ సమూహ మొకటే
సత్యంబు ఊహా భుజా
ర్గళముల్ విప్పినవిశ్వమూర్తియయి శంఖా
రావముం జేయుడో
దళిత శ్రామిక జీవులార భువనద్వారంబు భేదిల్లగన్"

* * *

ఇది మొదటి విభాగం: రెండవ విభాగం క్రింద:

"ధనము గతింపనీ గగన తారలు ధారుణి
మీద రాలనీ
తనువు నశింపనీ ప్రళయ తాండవమై ధర క్రుంగిపోవనీ
మనసు చలింపనీకు అభిమానము
మానము కోలుపోకు, యీ
ఘనతర భాగ్యవంతు లధికారులు మార్కొని
రేని యుద్ధతిన్"

* *

"వెరవకుమోయి విశ్వపదవీ మద
విద్విష దుగ్రధాటికిం
బరవకుమోయి ధర్మమయ పావక
రోచులు భ్రూకుటీర కో
టరముల ప్రజ్వలింపగ ఛటాపట లీ
పటు జాగ్రదగ్రతా

పరశువు కేలబూని యొక భార్గవ
రాముడవై చరింపుమా"

◆ ◆ ◆

పోతే మూడవ విభాగం క్రింద ఉదాహరణలు :

"లక్షా తొంభయి కుంభకోణములు
నిర్లక్ష్యంబుగా సల్పుచున్
కుక్షిన్నింపెడు కుంభకర్ణులును
భూగోళంబు గోళంబుగా
భక్షింపంగల బ్రహ్మరాక్షసులు
శుంభద్గండభేరుండముల్
పక్షీంద్రుల్ తమ జీర్ణశక్తి కివిగో
బాబూ ; నమస్కారముల్."

మరొకటి :

"అధునాతన కీచకుడను
అధరాధర యాచకుడను హా మదిరాక్షీ
రుధిరము పొంగెను ఊహో
మధుమాసము మోసులెత్తె మన్నింపగదే"

"నానావు నీవు అయితే
నేనూ ఒక డోనోవానునే మీనాక్షీ
జానగు యీ జగమంతా
తేనెలకై పరుగులెత్తు తేటుల బాటల్."

"గంధ గజయాన నీదు బంగారు కొంగు
సోకినం జాలు నేను మజ్నూకు అన్న

చూచినంజాలు దేవదాసునకు మిన్న
నీవు లేకున్న బ్రతుకులే నిండు సున్న."
"బేబీలు ఎక్కువాయెను
హాబీలును తక్కువాయె అతిదుస్తర మీ
గోబీ ఎడారి దాటుట
బీబీవై పలుకొమ్మ భేషాబూమ్మా"—

వ్యాస విస్తర భీతిచేతనేగాని లేకపోతే ఉదాహరణలు ఎన్నయినా యివ్వవచ్చు. సారాంశమేమిటంటే, పద్యానికీ పాతకాలానికీ అవినాభావ సంబంధంలేదు: పద్యం ఆధునిక వస్తు ప్రతిపాదనకు అనర్హంకాదు; పద్యం యితర పద్ధతుల కంటె ప్రస్తుతం అమోఘమైన కవితా వాహిక—

—o—o—

# ఏది ఉత్తమ సాహిత్యం?

ప్రఖ్యాత ఆంగ్లేయతత్త్వవేత్త, తపస్వి, 89 ఏండ్ల పండుముసలి బెర్ ట్రెండ్ రస్సెల్ రెండుమాసాల జైలుశిక్షకు గురిఅయ్యాడని వార్తా పత్రికలు వెల్లడిచేశాయి. ఇది యావత్ప్రపంచ ప్రజల దృష్టినీ ఆకర్షించే మహత్తర సంఘటన. అస్త్రాద్రికి చేరువగాఉన్న ఈ ప్రతిభాభాస్కరుడు ఈ వయస్సులో ఏ తప్పుచేశాడని ఈశిక్ష? ఒక మహా ప్రళయానికి హేతువు లైనధూమకేతువులమీద ఉచ్చాటన మంత్రాలు జపించాడు; మానవజాతికి రాబోయే విపత్తును నివారించడానికి ద్యమించాడు. అయితే యింతపెద్దపనికి ఒకరచయిత పూనుకున్నాడంటే మనం ఆశ్చర్యపడడం మన జన్మహక్కు. మనరచయితలకుఅంత మహోన్నత అంతర్జాతీయ సమస్యనుఎదుర్కొనే అలవాటూలేదు,అధికారమూలేదు. కానీ రస్సెల్ భూమిమీద నిల్చుంటే ఆకాశోన్నత మేరు శిఖరుడు అనిపిస్తున్నాడు. మానవుల్లో అంతయెత్తుకు పెరగాలి రచయిత, జగత్తుకంతా జీవంపోసి నడిపించాలంటే. ఈ వయస్సులో కూడా జైలుకువెళ్ళాడు, మానవకళ్యాణంకోసం – మనలో ఎందరకున్నది ఆధైర్యం, ఆ నైతికపరాక్రమం ? యావజ్జీవతపస్వి నిరంతరమూ ఆలోచిస్తుంటాడు; వ్రాస్తుంటాడు. బహుశా ఆంగ్లవాఙ్మయంలో రస్సెల్ వహించే పాత్రకు సరిపోలింది మన వాఙ్మయాల్లోలేదేమో ? ఆయన్ను 'థింకర్' అంటారు. మన భాషలో తపస్వి; అనవచ్చు. ఆయన

వ్రాసేవి నవలలూ కావు, నాటకాలూ కావు. కథానికలూ కావు. సృష్టిని గురించీ, విజ్ఞానాన్ని గురించీ, మానవ జాతిని గురించీ, ఒకటేమిటి ? – సమస్తమూ ఎలెక్ట్రన్ దగ్గరనుంచీ ఐన్‌స్టీన్‌థీరీవరకూ ఆలోచిస్తాడు. అవన్నీ వ్రాస్తాడు. మన తెలుగుదేశంలోనే అయితే ప్రకటించుకునే గతిలేక ప్రాయోపవేశం చేయవలసివచ్చేది. ఏది అనుకుంటాడో అదే వ్రాస్తాడు వేమనలాగా, భర్తృహరిలాగా. పైగా; అదే చేస్తాడు. రచయితకు జీవితంలోనూ, రచనలోనూ యీ త్రికరణశుద్ధి సిద్ధించాలి. అందుచేతనే ఋషి లక్షణాలున్న వాళ్ళే రచనకు పూనుకోవాలన్నారు మన పూర్వులు. అంటే నిస్సంగులూ, నిష్కాములూ అయితే నిర్భయంగా సత్యం వ్రాస్తారని వారి అభిప్రాయం అనుకుంటాను.

ధైర్యమూ, నీతి రచయితకు రెండునేత్రాలు. నీతికి ధైర్యం, ధైర్యానికినీతి పరస్పరపరివర్ధకాలు ఇవిలేని రచయిత గ్రుడ్డివాడు ఏమివ్రాస్తాడు? అతడి వ్రాతలు లోకానికి ఏ ఉపకారం చేస్తాయి? లోకమే అంధతమస్సులో దారికోసం తడుముకుంటూ ఉంటే, అంధుడైన రచయితను నమ్ముకొనడం "కానని వాని నూతగొని కాననివాడు విశిష్ట వస్తువుల్ కాననిభంగి" అవుతుంది. సాహిత్యం వాయుగుంభనకాదు. అది ఒక మహోజ్జ్వలకాంతిపుంజం. అజ్ఞానాంధకారాన్ని పటాపంచలు చెయ్యాలి; భయవిహ్వాలమై అలమటించే లోకానికి ధైర్యం కల్పించాలి. రైల్లో ఎక్కాను-అమ్మాయి, అబ్బాయి [illegible], [illegible]—బెస్టు అంటూ ఏవో కబుర్లు చెపితే చాలదు; చేతులు నలిపితే చాలదు. చిత్రం అంటే అంతకంటే

చాలదు. నీవు లోకం ఎంతవరకు చూచావు ? ఎన్ని బాధలు అనుభవించావు ? ఏమైనాసరే, ఈ అన్యాయానికి ఒప్పుకోనని ఎన్ని సంఘటనలు ఎదుర్కొన్నావు ? కుచేలుడైనాసరే కుబేరుడైనాసరే ఒకటే అని నిజంగా అనుకుంటున్నావా ? జాలిపడి ఎన్నిసార్లు కన్నీరు కార్చావు ? లేకపోతే, యివేవీలేని వట్టి దొంగవా ? ఈ ప్రశ్నలు ముందు తేల్చుకో - ఆతర్వాత కలంపట్టుకో - అంతేగాని కలంఅంటే కర్రపుల్ల అనుకున్నావా! గడ్డిపరక అనుకున్నావా ? కలం డబ్బు సంపాదించే మంత్రదండం కాదు. కీర్తిశిఖరం ఎక్కించే నిచ్చెనాకాదు. అది ఒక మహోజ్వలకాంతిచ్ఛటలు విరజిమ్మే వజ్రాయుధం - ధర్మసంస్థాపనకు వినియోగించు. అది ఒక సముద్దండ గాండీవం- ధర్మకురుక్షేత్రంలో చరితార్థం చెయ్యి. నిర్భాగ్య మానవకోట్లచుట్టూ ముసరిన శోకతిమిరాన్ని పోకార్చు; విశ్వశ్రేయోదయానికి అంకితంచెయ్యి - అంతేగానీ ఏదోవేస్తున్నారుగదా అని వ్రాస్తూఉంటే ఎట్లా ? చెత్త పెరిగిపోతూ ఉందే - గ్రంథాలయింది, వింధ్యాలయింది. దీనికంతెప్పుడు!

విశిష్ట వినూత్న రచనలకు తదేకదీక్షగా ప్రోత్సాహం కల్పించాలి. రచయిత ఎప్పుడూ ఒక ప్రశ్న వేసుకోవాలి - మనం వ్రాసేది ఎంతమందిని సముచ్చకితుల్ని చేస్తుంది, ఎంతమందిని ఉత్తేజపరుస్తుంది, కదిలిస్తుంది, ఏ ఘనకార్యం సాధిస్తుంది ? ఈ అంతర్గతబాధకలగకుండా ఈ భావం స్ఫురించకుండా ఏదోవ్రాస్తూ పోవడం ఎందుకు? చెప్పవలసిన అవసరం వచ్చినప్పుడే, ఏదోస్ఫురించినప్పుడే, ఏదో మెరిసినప్పుడే, ఏదోమనస్సులో ఒక జలపాతం ఘోషించినప్పుడే చెప్పు.

అక్షరభుజంగ సంఘాలను రెచ్చగొట్టు. అవి మిగతాపని చేస్తాయి. అంతేగాని ఏదో ఎందుకో వ్రాస్తేఎట్లా? వ్రాయావచ్చు, పత్రికలువేయావచ్చు. కానీ లోకానికి ఏమీ ఉపకారం-న్యూస్‌ప్రింటుఖర్చుతప్ప !

రోజులు చాల నిరుత్సాహకరంగా ఉన్నాయి. శిష్టవర్గాలు హింసపడుతున్నారు, నిర్భాగ్యప్రజాకోట్లు ఆక్రందన చేస్తూ ఉన్నారు. స్వేచ్ఛాపత్రాలు కత్తిరింపబడుతున్నాయి. అందే ఆశయ శిఖరం అతిదూరం అవుతూఉంది. ఇట్లాంటి సందర్భాల్లో పూర్వం రచయిత లూరుకున్నారా? ఇచ్చకాలాడారా? లేదు. ప్రళయాకారం ధరించారు. కుట్టికవి కేరళదేశంలో మహిషశతకం వ్రాశాడు. మోల్లియర్ ఫిరంగుల్లాంటి ప్రహసనాలు వ్రాశాడు, ఫ్రాన్సులో. వేమన గీతపద్యాల శరపరంపర కురిపించాడు. ఈ నాడు ఆ ధైర్యంఏది? ఆ దుర్దాంతనైతిక విక్రాంతి ఏది? అందుచేత ఈనాడు రస్సెల్ చేసిన పని సమున్నతంగా కనిపించింది.

పూర్వం రాజులనుబట్టి సాహిత్యం రూపొందిందని అభియోగం. మరి యీనాడో? అంతస్వచ్ఛందంగా ఉందా? ఏదో ఫలానావిధంగా ఉంటేగానీ, ఫలానా పత్రికలోనో సంచికలోనో పడదని, వారిమెప్పుకోసం రచనలుసాగడంలేదా? భయచోదితులై సత్యదేవత కంఠాన్ని నులిమివేసి పూతమెరుగురచనలుచేయడం లేదా? పూర్వకవులు అస్వతంత్రులెట్లా అవుతారు? ఆధునికులు ఎట్లా నిరంకుశులు అవుతారు - అనే విషయం సవిమర్శగా చూస్తే వాస్తవం తారుమారవుతుంది. వశ్యవాక్కూ, ఆజ్ఞాపనాశక్తి యుక్తుడూ అయిన భీమ

కవీ, "కస్తూరికాభిక్షా దానము చేయురాసుకవిరాడ్బృంద
దారకస్వామికిన్" అన్న శ్రీనాథుడూ, దక్షిణాపథ సామ్రాట్టు
చేత పల్లకీమోయించుకున్న అల్లసాని మహాకవి యిత్యాది
ప్రాచీనులే 'నిరంకుశాః కవయః' అన్న సామెతను సార్థకం
చేశారు. సమాజంలో రచయితలస్థానం అగ్రగణ్యంచేశారు.
ఆ రాజులుకూడా అట్లాంటివారే అనుకోండి; ధర్మతత్పరులు
శిష్టజనసేవకులు, ఈనాడువారూ లేరు, అథవా ఉన్నా చాలి
నంతమందీ లేరు.

భర్తృహరిసుభాషితాలు ఒకరే వ్రాశారో పదిమంది
వ్రాశారో ఆ సంగతి ఈ సందర్భానికి అనవసరం. కానీ
యింతకాలంతర్వాత ఆ సుభాషితాలు ఒక మహోజ్వల
మూర్తిని సంతరించుకున్నాయి. ఆ మూర్తికి భర్తృహరి
గుర్తు అయ్యాడు. మహాకవులంతా కాలపరిపక్వతచేత అంతే
అవుతారు. ఆ మహాత్కావ్యంలో 'యతినృపతి సంవాదం'
మకుటాయమానమైన ఘట్టం. అష్టైశ్వర్య సంపన్నుడు
ఒక మహారాజు మంత్రులు, సామంతులు, దండనాథులు,
వందిమాగధులు పరివేష్టించి ఉన్న ఒక నిండుకొలువులో
సింహాసనాసీనుడై ఉంటాడు. ఆకొలువుకు ఒకయతి వచ్చాడు–
దండకమండలధారి, కౌపీనమాత్రవసనుడు. రాజులకున్న శంఖ
చక్రగదాఖడ్గాది అధికార లాంఛనాలేవీ ఉండవుగా యతికి?
ప్రాభవోద్ధతుడైన రాజు యతినినిర్లక్ష్యంగాచూచాడు. అంతే,

"రాజవు నీవు, మేము గురు
రాట్కలిత ప్రతిభాభిమానవి
భ్రాజి మహోన్నతాత్ములము... ... ... ... మమ్మని

ర్వ్యాజత చూడవేని అను
రాగము నూతను లేదు మీమొదన్."

అని విసిరాడు ఖచ్చితంగా. చేతులు నలుపలేదు, నీళ్ళు నమలలేదు. పైగా-

"ధనపతి వీవు మేము విపి
ధశ్రుతి పుంజపదార్థతత్త్వశా
సనులము
చండతర ప్రతివాది గర్వభం
జనులము మేము మిమ్ము ధన
శాలురు మమ్ము భజింతు రాశ్రితుల్
వినయము సేయవేని పృథి
వీవర సాగెద మీతణంబునన్"

అని హెచ్చరించాడు.

"....నిష్ఫల నవవిత్తసీధు విజృంభిత మోహాలీనచిత్తులగు నికృష్టభూపతుల దుర్నయ మించుకయున్ సహింతునే" అని ధనుష్టంకారంచేశాడు. ఈ సముజ్వలసంఘటన వూహించడానికిగానీ చిత్రించడానికిగానీ,ఒక ధర్మవీరుడికి ఒక జగత్కల్యాణైకపరాయణుడికి మాత్రమే సాధ్యమవుతుంది. అన్యులకు అవుతుందా ?

ఉత్తమసాహిత్యం ఎట్లావస్తుంది ? ఉత్తములనుంచే వస్తుంది. సాహిత్యం ఆప్రజల సాహసౌదార్య సంస్కారాలను బట్టి వస్తుంది. నిర్జీవంగాఉన్న ప్రజలు ఉత్తమసాహిత్యాన్ని సృష్టించలేరు. ఆచార వ్యవహారాల్లో మూఢత్వం చూపేవారూ మనఃప్రవృత్తులు విశాలంగానూ నవనవోన్మేషంగానూ

లేనివారూ, ఉత్తమసాహిత్యాన్ని సృష్టించలేరు. అహంకార పూరితులూ, స్వార్థపరులూ, సంస్కారశూన్యులూ, ఉత్తమ సాహిత్యాన్ని సృష్టించలేరు; కానీ అసలు సంగతి - మనిషిని మనిషిగా చూస్తే, బ్రతకనిస్తే, అప్పుడూ-సాహిత్యమూ సంగీతమూ వగైరాలు. ఎదటివాడి గౌరవం గుర్తించే సంస్కారం లేని ఈరోజుల్లో, ప్రక్కవాడిబాధలకు జాలికలగని ఈ రోజుల్లో ఈ అంధకారంలో సాహిత్య మేమిటి? ముందు ఆ నీతికోసం, ఆ సంస్కారంకోసం వీటన్నిటికీ మూలకందమైన ఆదేశసుభిక్షంకోసం కృషి జరగాలి, అంతేగానీ యిప్పుడు వీళ్లే సాహిత్యాన్ని సృష్టిస్తారు? ఏకళను, ఏ సౌందర్యాన్నిఊహిస్తారు? ఆనందిస్తారు? అందుచేత ముందు ధర్మసముద్ధరణకు బద్ధకంకణులు కావాలి. ఆ మహాకృషిలో నుంచి ఉద్భవించేదే నిజమైన సాహిత్యం.

ఇటీవల 10, 11 సంవత్సరాలనుంచీ సాహిత్యరంగంలో వినూత్నకృషి జరగడంలేదు. నిశ్శబ్దంగావుంది. ఒకనాటి త్యాగాలు ఈనాడు కథలయ్యాయి. ఉత్తమ లక్ష్యాలమీద అభిలాష అడుగంటింది. ఏదో తాత్కాలిక సంసార లాభాల కోసం దేవులాడడమే కనుపిస్తూవుంది. పూర్వపు ఉద్వేగం, సంచలనం అంతా అణగారిపోయి నిస్త్రాణపట్టుకున్నట్లుగా కనుపడుతున్నాడుమానవమూర్తి. చుట్టూ అంధకారం తాండవిస్తూఉంది. ఈనాడు మళ్ళీ రచయితే దారి చూపాలి. ఏ కాలంలోనైనా, ఏ దేశంలోనైనా, విజ్ఞానులే దారిచూపారు. ఆ మహోన్నత కర్తవ్యాన్ని రచయిత గుర్తించాలి. దేశా

న్నంతా ఉగ్రరూపాలు తాల్చే, ఉత్తమ లక్ష్యాలవైపు నడిపించే, మహామహిమాన్వితమైన రచనలు రావాలి. మృదుమధుర కవితారవళి పూరించే మురళీధరుడు కాదు కావలసిందీనాడు, సముద్దండ కవితాగాండీవి కావాలి. వస్తాడని ఆశిద్దాం.

# ప్రాకృతిక భూపతులు



పాశ్చాత్యరాజులతో భారతీయరాజులను పోల్చిచూస్తే ఒక ఆశ్చర్యకరమైన విభిన్నత కనుపిస్తుంది. ఈ విభిన్నత ఆ రెండు భౌగోళిక భాగాలలో రూపొందిన విభిన్న జీవన దృక్పథాల మూలంగా కావచ్చు.

హరిశ్చంద్రుడి నుంచి హర్షవర్ధనుడి వరకు అక్కడి నుంచి కృష్ణదేవరాయలు వరకు, ఇంగ్లీషువారు వచ్చేవరకు భారతీయరాజు లందరిలోను ఒక ధార్మిక దృక్పథం కనిపిస్తుంది. ప్రజానురంజకంగా పాలించడమే వారిలో సర్వసామాన్య లక్షణం. ప్రజాకంటకులు ఎక్కడో సకృత్తు. ప్రజలను కన్నబిడ్డలవలె పాలించుట, శిష్టరక్షణ, దుష్టశిక్షణ, విద్యాపోషణ, దాన ధర్మాలు యిత్యాది లక్షణాలు కలిగి ఉండడంలో భారతీయ రాజులు ఒకరితో ఒకరు పోటీపడ్డారు. రాజకీయ యుద్ధాలు, రాజుల్లో పరస్పర వైషమ్యాలు, రక్తపాతం ఉండేవికాని, అవి రాజులకు ప్రజలకు మధ్యఉన్న ధార్మిక సంబంధానికి అంతరాయం కలిగించేవి కావు. తగవులు తంటాలు, రాజులకు రాజులకు మధ్యనేకాని ప్రజలకూ రాజులకు మధ్యకాదు. ధర్మవిరుద్ధంగా ప్రవర్తించి ప్రజాకంటకులైన రాజులను, ప్రజలు నిర్దాక్షిణ్యంగా నిర్మూలించిన సంఘటనలు కూడా మన చరిత్రలో లేకపోలేదు. అయితే అట్లాంటి సందర్భాలు చాల అరుదు.

కానీ పాశ్చాత్యరాజుల సంగతి చూస్తే ఎంతో భిన్నంగా కనిపిస్తుంది. గ్రీకుల దగ్గర్నుంచి తీసుకున్నా వారి పంథా అంతా ఒకటే. అక్కడ రాజులు రాజ్యతంత్రం మాత్రమే నడిపారుగానీ, ప్రజా జీవితంతోటి, సమాజ వికాసం తోటి, వారికి నిమిత్తం ఉన్నట్లుకనుపించదు. పైగా సోక్రటీసు నుంచి కోపర్నికస్ వరకు విజ్ఞానులకు రాజులకు మధ్య ఘర్షణ ఉండేది. పశుబలంతో రాజులు విజ్ఞానుల్ని సహరించేవారు. సోక్రటీసును విషం త్రాగించి చంపారు. అట్లాగే కోపర్నికసును విశాల నగరవీధుల్లో రాళ్ళతో కొట్టి చంపి వేశారు. ఇక జీసస్‌గాథ చెప్పనక్కరలేదు. అట్లాంటి పరిస్థితులు భారతదేశంలో వూహించలేము కూడాను. రాజు బౌద్ధుడైనా హిందూమతాన్ని పోషించడం, హిందూ రాజులు బౌద్ధులకు రక్షణ ఇవ్వడం, కృష్ణదేవరాయాదులు మహమ్మదీయ క్రైస్తవ మతాలకుకూడా ఆశ్రయం యివ్వడం మొదలైన ఉదార కార్యాలు భారతదేశ చరిత్ర ప్రతి పేజీలోనూ, అక్షరంలోనూ తొణికిసలాడుతుంటాయి. కానీ పాశ్చాత్య వాతావరణంవేరు. వెనక చెప్పినట్లు రాజులకూ విజ్ఞానులకూ మధ్యఘర్షణ. విజ్ఞానులు ప్రజలు ఒకటి, రాజు భూస్వాములు అధికారులు ఒకటి. ఇదీ అక్కడి పరిస్థితి. పాశ్చాత్యదేశాల్లో వచ్చిన ప్రజాభ్యుదయం అంతా కేవలం ప్రజలు సాధించిందే, అందులోనూ అధికారవర్గ వ్యతిరేకతను ఎదుర్కొంటూ. పాశ్చాత్య ప్రజా పురోగమనానికి రాజులు ఏమీ యివ్వలేదు. ఏమీ చెయ్యలేదు. భారతదేశంలో అట్లాకాదు. ఒక కపిలుడో, కణాదుడో, శంకరుడో

వస్తే రాజు "దిగ్గున తనగద్దియడిగ్గి" ఎదురేతెంచి అర్ఘ్యపాద్యా లిచ్చి ఉచితాసనాసీనులను గావించి సత్కరించేవారు. వారికి విరుద్ధుడైన బుద్ధుడిని కూడా అట్లాగే గౌరవించినారు. విజ్ఞానులను నెత్తిన పెట్టుకుని పూజించారు. ఉదాహరణాలు కోటానుకోట్లు, అందరికి తెలిసినవే.

సృష్టికి మూలమేమిటి అనే విచారణ శతాబ్దాల పర్యంతం జరిగి చివరకు ఆరు అభిన్న అభిప్రాయాలుగా షడ్దర్శనాలు వెలిశాయి. జడపదార్థంనుంచి సృష్టి పుట్టింది అనే వాదంనుంచీ జడపదార్థం కూడా బ్రహ్మమే అనే వాదం వరకూ యివి ఆరువాదాలు. ఈ వాదాలు యూరపులో గనుక అయితే పరస్పర శారీరక ఘర్షణకు దారితీసి ఏదో ఒకటే మిగలడానికి ప్రయత్నించేది, కానీ భారతదేశంలో ఆరూ నిలిచాయి - సమాన గౌరవంతో! షడ్దర్శనాలు చదివితేనే గాని సమగ్రశాస్త్ర పాండితిగా గుర్తించరు. ఈ విజ్ఞాన తృష్ణ, యీ విజ్ఞాన గౌరవము అఖండము, అనన్య సామాన్యము. విజ్ఞానము, కళ, సాహిత్యం అన్నిటినీ యిక్కడ రాజులు పోషించేవారు. భూషించేవారు. ప్రజాభ్యుదయానికి కేంద్రంగా ఉండేవారు.

ఇక అటుచూస్తే అది ఒక విభిన్నగాథ. పాశ్చాత్య చరిత్రకంతా యింగ్లీషు దేశచరిత్ర తాళపుచెవిగా కనిపిస్తుంది. అది చదివితే అన్ని పాశ్చాత్యదేశాల చరిత్ర చదివినట్లే. జాన్ అనే రాజును (1199—1216) ఇంగ్లీషు ప్రజలు తంతామని బెదిరించి మేగ్నకార్టాను పొందారు. 8వ హెన్రీ నిర్దాక్షిణ్యంగా కామంకోసం అనేక భార్యల్లను మార్చి క్రైస్తవ

మతానికి విద్రోహంచేసి ఇంగ్లాండు చర్చి తాలూకు సంపద నంతా కొల్లగొట్టడానికి ఉద్యమించాడు. అతనిది విచిత్ర చరిత్ర. 1628లో పిటీషన్ ఆఫ్ రైట్‌ను పొందడానికిగాను 1 వ చార్లెస్‌ను చివరకు ఉరితీయడమే జరిగింది. హెచ్. జి. వెల్స్ ఆ రాజును గురించి వ్రాస్తూ "ఇంగ్లీషు దేశ సింహాసన మెక్కిన రాజుల్లో యితడు అతి నీచుడు, మిక్కిలి ద్రోహ చింతనుడు" అన్నాడు. దేశభక్తిలో ఎవరికీ తీసిపోని హెచ్. జి. వెల్స్ తన దేశపురాజును గురించి యిట్లా వర్ణించాడంటే మిగతా భాగం సులువుగా వూహించవచ్చు. మరోచోట "ఏమాత్రమూ నమ్మడానికి వీలుగాని మోసగాడు"అన్నాడు. హెచ్. జి వెల్స్ అనడమేకాదు ఆనాటి ఇంగ్లీషు ప్రజలు రంపు పార్లమెంటు ప్రొక్లమేషన్‌లో ఏమన్నారో చూడండి— —"క్రూరుడు, ద్రోహి, హంతకుడు, స్వదేశ శత్రువు". ఈ విధంగా దుర్మార్గులైన రాజులు రావడం, వాళ్ళను ప్రజలు సంహరించడమో లేక ఏదో చేయడమో పాశ్చాత్య చరిత్రకు పరిపాటి. ఆ ప్రజలు కూడా చిత్రమైనవాళ్ళుగా కనుపిస్తారు. తండ్రిని చంపారు, కొడుకును ఆహ్వానించారు. కానీ కొడుకు 2వ చార్లెస్ చేసిన పనులు కూడా దేశభక్తియుతంగాలేవు. సంవత్సరానికి లక్ష పౌండ్ల చొప్పున లంచం తీసుకుని ఇంగ్లీషు వైదేశిక నీతిని ఫ్రెంచివారికి అమ్మివేశాడు. అంటే విదేశ వ్యవహారాల్లో ఫ్రెంచివారు చెప్పినట్లు చేసేవాడన్నమాట. క్రాంవెల్ జయించిన డంకర్క్‌ను తిరిగి ఫ్రెంచివాళ్ళకు అమ్మివేశాడు. ఇట్లా ఒక్క ఇంగ్లీషురాజులే కాదు ప్రతి ఐరోపా రాజు ఇంతే.

చార్లెస్ 1, స్పెయిన్ దేశపు చార్లెస్ 5, ఫ్రెంచి దేశపు లూయి 14, లూయి 16, రష్యా దేశపు జారు చక్ర వర్తులు-ఇంగ్లాండు నుంచి మాస్కోవరకు వీరందరి పద్ధతి ఒకటే. ఇంగ్లాండులో చార్లెస్ 1ను ఉరితీస్తే ఫ్రాన్సులో లూయి 16ను ఉరితీశారు. జారును మాస్కోలో ఉరితీశారు. లూయి 16 క్రింద ఫ్రెంచి ప్రజలస్థితి అతి దుర్భరమైందని ఆనాటి రచనల్లో సర్వత్రా కనుపిస్తుంది. లూయి 14 నుంచి కూడా రివల్యూషన్ వరకు ఫ్రెంచిరాజులు విజ్ఞానులను దేశం నుంచి బహిష్కరించారు. డేకార్టే, రుసో ప్రభృతులు విదేశాల నుంచి మహత్తర భావ ప్రసారంచేసి ఐరోపా వాతావరణాన్ని విద్యుత్పూరితం చేశారు. మిగతావాళ్ళు దేశంలో ఉండి రాజులకు భయపడుతూ నైతిక పటుత్వ శూన్యమైన రచనలు చేశారు-ప్రస్తుతం మన తెలుగు దేశంలో మాదిరి. వాళ్ళను గురించి హెచ్. జి. వెల్స్ "పదాడంబరానికి భావాన్ని బలిచేశారు" అని, పాండిత్య మదాంధకార పూరితము" అని, "భావోద్వేగంతో పొంగిపోయే ఒకడు తన నిసర్గ ధోరణిలో తన భావాలు వెల్లడించినట్లు కాకుండా తప్పులు తాలేమో అని భయపడుతూ వ్రాసే పండితుల పద్ధతి అని విమర్శించాడు. అందుచేతనే వారు, వారి రచనలు పరుగెత్తే ప్రజలకు పనికొచ్చాయికాదు. రచనలు గోడమీద పల్లివాటంగా ఉండేవి. యూరపులో ప్రజలేమో అఖండ శర వేగంతో పరుగెత్తారు. లూయి 16 ను ఉరితీశారన్న క్రోధంతో యూరపులోని రాజులందరు ఫ్రెంచి ప్రజలను శిక్షిస్తా'మని సంఘటిత దండయాత్ర చేయడానికి పూనుకున్న

ప్పుడు, ఫ్రెంచి ప్రజలు యిట్లా అన్నారు : "యూరపురాజులు మాతో సవాలుచేస్తే, యిదిగో, ఒకరాజు శిరస్సు మీకు సవాలుగా పారేస్తున్నాము అందుకోండి" అన్నారు. ఇట్లాగే రష్యన్ విప్లవ సందర్భంలో కూడా జరిగింది. రాజులంతా ఒకపక్షంగాను ప్రజలంతా ఒక పక్షంగాను రెండు స్కంధావారాలుగా సమీకరణ అయ్యారు. ఇది భారతదేశ చరిత్రలో అసంభావ్యము.

అటు యూరపులోను ఇటు ఇండియాలోను రెండు చరిత్రాత్మకంగా ప్రసిద్ధమైన రాజనీతి గ్రంధాలు వెలిశాయి. ఒకటి మ్యాకియవెల్లి వ్రాసిన ప్రిన్స్ (1469-1527). రెండవది కౌటిల్యుని అర్థశాస్త్రము. ప్రిన్స్ అనే గ్రంధానికి ఆధారం. వాస్తవంగా రచయితకాలంలో జీవించిన వేలెంటినో ప్రభువు సీజర్ బోర్గియా. అతని జీవిత విజయాలు కలిగించిన ఉత్సాహప్రేరణతో మ్యాకియవెల్లి తన గ్రంధాన్ని వ్రాశాడు. అయితే ఆ కథానాయకు డెట్లాంటి వాడంటే– తన సోదరుణ్ణి హత్యచేశాడు. చెల్లెలి భర్తను హత్యచేశాడు. ఇంకా చాలా హత్యలకు ద్రోహాలకు మూలహేతువుగా అయినాడు. తండ్రి కుతంత్రము యొక్క సహాయంతో ఇటలీలోని ఒకపెద్ద ప్రాంతానికి రాజయ్యాడు. రాజ్యాంగంలో బల పరాక్రమాలకంటె మంత్ర తంత్రాలు ఎక్కువగా ప్రదర్శించాడు. ఈ మహాపురుషుణ్ణి దృష్టిలో పెట్టుకుని వ్రాసిన రచయిత కూడా నీతి నియమాలకంటే అధికార సుఖాలు పరమార్థంగా భావించేవాడు. ఇక ఆ గ్రంథంలో వస్తువు కూడ అదే. రాజు అధికారాన్ని ఆర్జించడానికి, దాన్ని నిల

బెట్టుకోడానికి ఏయే పనులు చేయాలి ? హత్యలు, మోసాలు కుట్రలు చెయ్యాలి అనేది గ్రంథంలో ప్రతిపాదించిన విధానం. హెచ్. జి. వెల్స్ రచయితను "నైతికంగా అంధులైన ఒక స్వల్ప మానవుల సంకుచిత వలయంలో సంచరించే మరి యొక నైతిక అంధుడు" అన్నాడు. ఐరోపా రాజుల చరిత్ర లంతా యీాయన రాజనీతి సూత్రాల ననుసరించే నడిచాయి.

ఇక అర్థశాస్త్రాన్ని తీసుకుంటే గ్రంథకర్త ఒక అపూర్వ ప్రతిభాశాలి, ఉజ్జ్వలవంశ సంజాతుడు, సదాచార సంపన్నుడు, అచంచల దీక్షాపూరితుడు-నంద రాజ్య నిర్మూలన అనే ఒక మహత్తర చారిత్రక సంఘటనకు మూలకర్త. గ్రంథానికి ఆధారం మగధ సామ్రాజ్య చక్రవర్తి, మహా శూరుడు, గ్రీకు విజేత, మౌర్య సామ్రాజ్య సంస్థాపకుడు. గ్రంథం 'ప్రిన్స్' లాగే రాజ్యతంత్రాన్ని వివరించినా గూఢ చారులను, కుతంత్రాన్ని బలపరిచినా దాని పరమార్థం రాజ్యాధికారాన్ని నిలబెట్టుకోవడం మాత్రమే కాదు. రాజు ప్రజాను రంజకంగా పాలించాలి, అనే ప్రాథమిక సూత్రాన్ని ప్రతిపాదిస్తుంది. బ్రాహ్మణభక్తి, శాస్త్ర విధేయత, అమాత్య శ్రేణి అవసరము, నొక్కి చెబుతుంది. ఉదయం నిద్రలేచిన దగ్గర్నుంచి రాత్రి పడుకునేవరకు రాజు ఏమిచెయ్యాలి అనే ఒక విధానాన్ని ఏర్పరచింది. రాజు కష్టపడి పనిచేయాలి. సైనిక, ఆర్థిక తదితర రాజ్యాంగ వ్యవహారాలను స్వయంగా రాజు పరిశీలించాలి. విలాసంగా విహరిస్తే లాభంలేదు. ఇంకా ముఖ్యమైన విషయం-మైనర్లు, ముసలివాళ్ళు, ఆర్తులు

నిస్సహాయ స్త్రీలు, మొదలైనవారి నివేదన ఎక్కడున్నా ఎప్పుడైనాసరే రాజు స్వంతంగా వినాలి. ఇట్లాంటి ఉన్నత నిబంధనలను నిర్మించింది. అన్నిటికంటే గమనించ వలసింది, అర్థశాస్త్రం తన సూత్రాన్ని మాత్రమే రాజులు అనుసరించాలని చెప్పదు. షట్చక్రవర్తులనుంచి చంద్రగుప్తుడి వరకు వచ్చిన అవిచ్ఛిన్నమైన ప్రాచీన భారతీయ రాజధర్మానికి అనుబంధంగా మాత్రమే అర్థశాస్త్రం వచ్చింది. పూర్వ ధర్మానికి విరుద్ధంగా రాలేదు (మ్యాకియవెల్లి ప్రిన్స అట్లా కాదు).

భారతీయ రాజులు స్వతంత్రులుగాని నిరంకుశులుగాని కారు. అనాదిగా వచ్చిన శాస్త్ర సంప్రదాయ, ఆచారాలనే సంకెళ్ళలోనే వారి ధర్మాన్ని నిర్వహించారు. అధర్మం పొరపాటున కూడా చేయకూడదు, "రాజ్యాంతే నరకం ధ్రువమ్" అని విజ్ఞానులు రాజులకు బెదురు పెట్టారు. వారే ప్రజలకు "నా విష్ణుః పృథివీ పతిః" అని రాజభక్తిని సృష్టించారు. రాజునూ ప్రజల్ను సమైక్యం చేశారు. ధర్మాన్ని సాధించారు. ఒక్కముక్కలో చెప్పాలంటే భారత దేశంలో వైజ్ఞానిక నాయకత్వమేగాని రాజకీయ నాయకత్వానికి తావు లేదు.

భారతీయరాజులు తమకొక న్యాయం ప్రజలకొక న్యాయం నెలకొల్ప లేదు. ఉభయులకు ఒకే న్యాయం అమలు జరిపారు. ఆంధ్ర చరిత్రలో విజయవాటిక నేలిన మాధవవర్మ గాథ చిరస్మరణీయం. తనకొడుకు రథంక్రింద పడి ఒక పేద రాలి కొడుకు మరణించగా తనకొడుకుకు మరణశిక్ష విధిం

చాడు ఆ మహారాజు. అశోకుడిగాధ జగత్ప్రసిద్ధము. ఇక మరీ ప్రాచీన భారతీయ రాజుల గాధలు చెబితే ఒళ్ళు గగుర్పొడుస్తుంది. హరిశ్చంద్రుడుమాటకోసం సామ్రాజ్యాన్నే కాదుగదా చివరకు దారా పుత్రులను కూడా త్యాగం చేశాడు. శిబి జఠరాగ్ని పీడితమైన ప్రాణికి తన తొడకోసి యిచ్చి మరొక దీన జీవిని రక్షించాడు. బలి "తిరుగన్ నేరదు నాదు జిహ్వ" అని ఆత్మార్పణ చేశాడు. కర్ణుడు ఆత్మ విధ్వంసాన్ని లక్ష్యంచేయకుండ కవచకుండలాలు యిచ్చాడు. ధర్మరాజు, పరీక్షిత్తు, జనమేజయుడు, ఇట్లా ఎందరో మహానుభావులు. అందరూ ధర్మతత్పరులే.

ఇక తారీకులున్న చరిత్రకు వస్తే మౌర్యులు. శుంగులు, కాణ్వులు, శాతవాహనులు, గుప్తులు, కనిష్కులు, హర్షుడు, పోతే దక్షిణాపథాన చాళుక్యులు, పల్లవులు, చోళులు, కాకతీయులు, విజయనగర రాజులు, రెడ్డిరాజులు, వీరందరూ ప్రజాను రంజకంగా పాలించినవారే. ఇందులో ఎవరు దుర్మార్గులో లోక కంటకులో చెప్పగలమా? ఎవరిని చార్లెస్ 1 తోను, లూయీ 16 తోను, హెన్రీ 8 తోను, లేక రష్యన్ జారులతోను పోల్చగలము? వారిలోవారు వివాద పడ్డారేమో కాని ప్రజలతో వారికున్న సంబంధం ధార్మికమే తప్ప అన్యధా కాదు. చివరకు యిక్కడికి వచ్చిన మహమ్మదీయులు కూడ యీ భారతీయసంప్రదాయానుసారము ప్రజారంజన లక్ష్యంగా పెట్టుకున్నారు. మొగలాయి చక్రవర్తులు అక్బర్, జహాంగీరు, షాజహాన్ ప్రభృతులు దక్షిణాన గోల్కొండ నవాబులు మైసూరు సుల్తానులు వీరంతాహిందూమతాన్ని సంస్కృతిని

ఆదరించి కొంతవరకు అవలంబించినవారే. కొందరు సంస్కృత విద్వాంసులు కూడా. రసగంగాధర కర్తఅయిన జగన్నాథ పండిత రాయలు, "ఢిల్లీశ్వరోవా, జగదీశ్వరోవా, మనోరథాన్ పూరయింతుసమర్థః, అన్యైర్నృపాలైః పరిదీయమానం, శాకాయ వాస్యాల్లవణాయ వాస్యాత్" అని విశాఖ పట్టణంనుంచి ఢిల్లీ వెళ్ళి మొగలాయి ప్రభువు, రసజ్ఞుడు, అయిన దారాకోల్వులో ఆస్థానకవిగా యశస్సు గడించిన సంగతి ప్రసిద్ధమే. ఇక అక్బరు విషయం చెప్పనక్కరలేదు.

ఇంగ్లీషువారి కాలంలోనే కథ అడ్డం తిరిగింది. ప్రజలకు రాజులకు ఉన్నపూర్వ సంబంధాలు నశించాయి. ఒక ఆత్మశూన్యమైన రాక్షసపరిపాలనా యంత్రాంగం వచ్చింది. రాజులు ప్రజలు మీదకాక ఆంగ్లేయుల సైన్యంమీద ఆధారపడ్డారు. పూర్వరాజులకు యీకాలపు వారికి మధ్య యీ అంధయుగం అడ్డు తెరగావచ్చి నిలిచింది. పూర్వరాజుల నిర్మల ధర్మతత్పరత మనం మరచిపోయాము. ఆంగ్లేయులతోపాటు ఐరోపా సంస్కృతి, విజ్ఞానం, సంప్రదాయం, రాజ్యాంగం, అన్నీవచ్చి భారతదేశాన్ని ఒక్క ఎత్తున ముంచివేశాయి. రెండుశతాబ్దాలు గడచిపోయాయి. ప్రపంచమంతా నూతన వైజ్ఞానికసముల్బణంలో వేరేదశకువెళ్ళిపోయింది. ఇప్పుడు మళ్లీ ఆరాజులు రావాలన్నా రాలేరు. మనం వాళ్ళదగ్గరకు వెళ్ళుదామన్నా వెళ్ళలేము.

# హరిహరనాథుడు తిక్కన ఊహకాదు.

శ్రీ చిలుకూరు వీరభద్రరావుగారు "తిక్కన సోమయాజి" అనే గ్రంథంలో, "తిక్కన సోమయాజి కాలమున నెల్లూరున హరిహరాలయము గలదనియు, నాతని పేరిటనే తిక్కన సోమయాజి తన భారతమునంకితము గావించెననియు, చెప్పుదురు గాని, యది యథార్థముకాదు... తిక్కనసోమయాజిచే భారతమున స్మరింపబడిన హరిహరనాథుడు హరిహరులకు భేదం పాటింపని యద్వైతుల కుపాస్యుడును, హరిహరుల కధినాథుడును నగు సర్వేశ్వరుడని విరాట పర్వములోని యవతారికను గాని, యాశ్వాసాద్యంత పద్యములనుగాని విమర్శించి చూచిన పక్షమున బోధపడగలదు." అని వ్రాశారు. స్పష్టంగా ఈ వ్రాత అర్థం, హరిహరనాథుడు, వేంకటేశ్వర స్వామి, నృసింహస్వామి ఇత్యాది దేవుళ్ళ మాదిరి గుళ్ళుకట్టి ప్రజలు కొలుస్తూ వుండిన దేవుడుకాడనీ, హరిహరులనే ఇద్దరు దేవతల మీద అధిపతిగా ఉండే మరొక సర్వేశ్వరుడైన దేవుడనీ, అవుతుంది. కవి జీవితములు, అనేక గ్రంథాలలో కూడా "భారతములో స్మరించబడిన హరిహరనాథుడు అర్చావతార రూపుడై నెల్లూరున వేంచేసియున్న హరిహరనాథుడు కాక కేవలమును నద్వైతుల కుపాస్యుండగు, హరిహరుల కధినాథుడగు, సద్వయనిర్గుణ బ్రహ్మమని భారతములోని యాశ్వాసాంత పద్యములను అద్వైతశాస్త్ర సంప్రదాయములను చూచిన స్పష్టము కాగలదు" అని వ్రాయబడి

ఉంది. శ్రీ కోరాడరామకృష్ణయ్యగారు కూడా తమ ఆంధ్ర భారత కవితా విమర్శనమనే గ్రంథములో ఈ ధోరణినే అవలంబించారు. ఇదీ, ప్రస్తుతం దేశంలో పండితుల అభిప్రాయం.

మొదటి రెండు ఉదాహరణల్లో హరిహరనాథుడంటే హరిహరుల కధినాథుడైన మరొకడు, సర్వేశ్వరుడని అర్థం చెప్పడం గమనించదగింది. ఇది ఘోరమైన ప్రమాదం. ఈ అర్థం హరిహరులు యిద్దరిని చెప్పడంచేత తిక్కనయొక్క, ఆ తర్వాత ఆయన్ను అనుసరించిన సోమనాథాదుల యొక్క భావనకూ, వారుచేసిన హరిహరనాథ స్వరూప వర్ణనకూ విరుద్ధంగా ఉంది. "కిమస్థిమాలాం" అనే శ్లోకం గానీ, "కరుణారసము పొంగి" అనే సీసపద్యంగానీ, లేక నాచన సోమనాథుని ఉత్తర హరివంశంలోని అనేక ఘట్టాలుగానీ, స్పష్టంగా హరిహరనాథుడు రెండు విభిన్న మూర్తులసమైక్య స్వరూపంగానే చిత్రిస్తాయి. అయితే ఈ విషయం ప్రస్తుతం మనకు ప్రధానము కాదు. హరిహరనాథుడు తిక్కన సోమయాజి ఊహ మాత్రమే. దేవాలయాల్లో పూజించే ఒక దేవుడు కాదు అనడమే, ఈ సందర్భంలో మనకు కావలసిన విషయం.

పండితవాక్యం అట్లా ఉంటే – ఆ ప్రవాక్యం. నెల్లూరు మునిసిపాలిటీవారు 30, 40 ఏండ్ల క్రిందనుంచి నీటిసరఫరా కోసం పెన్నానదిలో నూతులు త్రవ్వుతూ ఉండగా ఆ స్థలంలో హరిహరనాథుడి లోహ విగ్రహం దొరికిందనీ, దాని ఎత్తు షుమారు $2\frac{1}{2}$ అడుగు లుంటుందని, దాన్ని ప్రభుత్వంవారు స్వాధీనం చేసుకుని నెల్లూరు తాలూకా కచ్చే

రీకి తెచ్చారనీ, చాలా కాలం ఆ విగ్రహం సదరు కచ్చేరీలో శిరస్థదారు దగ్గిర పడి ఉండేదనీ తర్వాత మద్రాసు మ్యూజియంకు దాన్ని తరలించుకు పోయారనీ చెపుతుంది. మా తండ్రి చెప్పాడు గనుక యిది నమ్మానంటే నాకైతే సరిపోతుంది కానీ, లోకానికి ప్రామాణికం కాదు, కనుక ఈ పరిశోధన బయలు దేరింది.

నెల్లూరులోనే యిటీవల ఒకరు అత్యంత చారిత్రక ప్రస ఉన్న ఉదయగిరికి వెళ్ళిన సందర్భంలో అక్కడ కోనలో హరిహరనాథుని విగ్రహం చూచి ఫొటోగ్రాఫులు తీసుకుని వచ్చారట. ఉదయగిరి నెల్లూరుకు 60 మైళ్ళ దూరాన ఉంది. పూర్వం విజయనగర రాజ్యపు ఉపరాజధాని, ఉదయగిరిలో హరిహరనాథు డున్నప్పుడు నెల్లూరులో కూడా వుండడం అసంభవం కాదు. అయితే నెల్లూరులో వుండను కునే ఆ ఆలయం ఏమయిపోయింది ? కాలగర్భంలో కలిసి పోయి వుంటుందనుకోవడం అసమంజసం కాదు. నెల్లూరులో 360 దేవాలయాలుండేవట పూర్వం. "ఏపట్టణంబున నెన్నంగ మున్నూరు యరువది దేవాలయములుండు", అని ప్రాచీన చాటు పద్యం నెల్లూరు నగర ప్రశంస చేస్తుంది. అవన్నీ యిప్పు డేమయినాయి? అట్లాగే హరిహరనాథుని దేవాలయం కూడాను. మున్నూట అరవై దేవాలయాలుండేవా ? అని అనుమానింప నక్కరలేదు. ఉదయగిరిలోనే 360 దేవాలయాలుండేవని బాస్వెల్సు మాన్యుయల్‌లో వుంది. అట్లాగే హంపీ విజయనగరంలో 360 దేవాలయాలుండేవట. నెల్లూరు దగ్గరే ప్రభగిరి పట్నం అనే ఒక పురాతన ల) పట్టణంలో

101 దేవాలయాలుండేవని గెజిటియర్లో వుంది. పైగా చారిత్రక వృత్తాంతాల్లో రెండవ విజయాదిత్యుడు అనేకయుద్ధాలు చేసి తత్పాప పరిహారార్థం 360 దేవాలయాలు కట్టించాడని కూడా వుంది. ఇదంతాచూస్తే పూర్వం రాజులు ఏశాస్త్రానుసారంగానే 360 లేక 101 దేవాలయాలు కట్టించటం సాంప్రదాయం అయివుంటుంది. అవన్నీ బ్రహ్మాండమైన ఆలయ ప్రాకారాలతో వుండి వుండకపోవచ్చు. పూర్వం నెల్లూరు ఉదయగిరుల మధ్యనే యిన్ని వందల దేవాలయాలు వుండి శిథిలమైపోగా అందులో ఏదో ఒకటయినా హరిహరనాథాలయం కాలేకపోతుందా? పైగా మరొక విశేషం. ఉదయగిరిలో శిథిలమైన రంగనాయకస్వామి దేవాలయం ఒకటి వుంది. విజయనగర రాజ్యం పతనమయిన తర్వాత అక్కడి రంగనాయక విగ్రహాన్ని తెచ్చి నెల్లూరులో ప్రస్తుతంవున్న ఆలయంలో ప్రతిష్ఠించారనీ, నెల్లూరులో వున్న ప్రస్తుత ఆలయం, ఉదయగిరినుంచి విగ్రహాన్ని తెచ్చేసరికి, ఒక పాడు పడిపోయిన శివాలయంఅనీ చెపుతారు. ఈ వృత్తాంతం గెజిటియర్లో కూడా వుంది. చిత్రమేమిటంటే నెల్లూరులో వున్న ఈ రంగనాయకస్వామిని నెల్లూరు రంగనాయకులని పిలవడం న్యాయమై వుండగా కొండ రంగనాయకులనీ, తల్పగిరి రంగనాయకులనీ పిలుస్తారు. ఒక ప్రాచీన చాటువులోకూడా "విహరించితిమి గాని వివిధ భూములు పల్లి కొండనాథుని వంటి కూర్చు వేల్పు" అని వుంది. అందుచేత ఈ విగ్రహం స్థలాంతరం నుంచి వచ్చిందని విశదమవుతూ వుంది. ఈ పల్లికొండగానీ, తల్ప గిరిగానీ, ఉదయగిరిలోని ఒక భాగమో లేక ఒక

ప్రాంతమో అయి వుంటుందని నా వూహ. ఒక విశేషమేమి టంటే ఈ నాటి ఉదయగిరిని పూర్వం కొండాయపాలెం అనే వారట. ఇది అతి ప్రాచీన కాలంలో కావచ్చు. 1300 ప్రాంత ములో కర్ణాట రాజులు స్వాధీనం చేసుకున్నతర్వాతనే కొండాయపాలానికి ఉదయగిరి అని నామకరణం చేసి వుంటారు. ఈ మార్పుల్లో, ఈ పరిణామాల్లో హరి హరనా థుడు అంతర్ధానమై ఉంటాడు. రంగనాయకాగమన పూర్వం ఉన్న శిథిలాలయం నిష్కర్షగా శైవాలయం అనడం సాధ్యం కాదు. అదే హరిహరనాథాలయం కావచ్చు. హరిహర నాథుడి విగ్రహం దొరికినచోటు ఈ దేవాలయానికి సమీ పంగా ఉండడమూ, ఈ దేవాలయం మొదటినుంచీ రంగ నాయకులదే కాక శైవాలయం అని ప్రసిద్ధిగా ఉండడమూ, రంగనాయకులే స్థలాంతరం నుంచి రావడమూ, రంగనాయక విగ్రహం ఉదయగిరి నుంచి రాకపూర్వం యిది చిరకాలంగా శిథిలమై ఉండడం, యిత్యాది పరిస్థితులన్నీ కలసి యిదే హరి హరనాథాలయము కావచ్చు అనే అనుమానానికి అవకాశం యిస్తూ ఉంది.

మన సంస్కృతికి మూలబీజాలన్నీ కన్నడదేశంలో ఉన్నాయని నాకు చిరకాలంగా ఉన్న విశ్వాసము. ఈ విశ్వా సము చొప్పున కొన్ని వూహలు స్ఫురించాయి. హరిహర నాథుడు కన్నడ దేశంనుంచి వచ్చాడేమో అని విచారణ జరుపగా ఆ అనుమానం సత్యంగా పరిణమించింది. హరి హరుడు ఒకటి రెండుస్థలాల్లో ఒకటి రెండు కావ్యాల్లో కను

పించడం ఒక్క తెలుగుదేశంలోనే. కన్నడదేశంలో అట్లా కాదు, బహుళ వ్యాప్తిలో ఉన్నట్లు విశదంఅవుతూ ఉంది. కన్నడ దేశంలో కొండలకు, పట్టణాలకు, పల్లెలకు, మనుష్యులకు ఈ దేవుడిపేరే ఉంది. కోలారు జిల్లాలో నందిదుర్గానికి ఉత్తరానహరిహరేశ్వరబెట్టఅని ఒక పర్వతశ్రేణి ఉంది. ఉత్తర పినాకిని తాలూకు పాయ ఒకటి చిత్రావతి అనేది ఈ పర్వతాల్లోనే పుడుతుంది. తుంగభద్రానది, ఎడమవైపు తీరాన చిక్మగలూరుకు 40 మైళ్ళ దూరంలో హరిహరపూర్ అని ఒక గ్రామం ఉంది.

చితాల్ దుర్గ్ జిల్లాలోతుంగభద్రానదీ తీరాన హరిహర్ అనే ఒక పట్టణం ఉంది. గవర్నమెంటువారి రికార్డులో యిది చాల పురాతన పట్టణం అని వర్ణింపబడి ఉంది. ప్రస్తుతం ఈపట్టణం జనాభా 20, 30 వేలు ఉంటుంది. బెంగుళూరు పూనాలైనులో ఉన్న ఒక రైల్వేస్టేషన్. తుంగ, భద్ర అనే నదీ ద్వయం కలిసే సంగమ స్థలంలో ఈ పట్టణం నిర్మింపబడింది. ఈ పట్టణంలో నదీ తీరంలోనే బ్రహ్మాండమైన హరిహరనాథ దేవాలయం ఉంది. (ఈ ఒక్క విషయంచాలు శ్రీ చిలుకూరి, వగైరా ఆంధ్రపండితుల అభిప్రాయాలు నిరాధారమైన ఊహాలనడానికి) ఈ హరిహరనాథుడు తిక్కనాదులు వర్ణించినట్లే శివకేశవ మూర్తుల సమైక్యస్వరూపం. $4\frac{1}{2}$ లేక $5\frac{1}{2}$ అడుగులఎత్తు నల్లరాతి శిల్పం. ఆలయంలో యిద్దరు పూజరులుంటారు. ఒకడు శైవ బ్రాహ్మణుడు, మరొకడు వైష్ణవ బ్రాహ్మణుడు. శైవ వైష్ణవ భేదంలేకుండా సర్వప్రజలు ఈ దేవుడ్ని కొలుస్తారు. మహోత్సవాల్లో వాహ

నాలు కూడా నంది ఒకరోజు అయితే, గరుడుడు మరొకరోజు, యిట్లా ఉభయ విధి విధానాలూ మేళవించి అర్చన జరుగుతుంది. ఇక అలయస్థల పురాణము - హరిహర్ పట్టణం పూర్వం గుహాసురుడి రాజధాని. తూర్పున హచంగి దుర్గం. దక్షిణాన గోవినహాళు, పడమట ముదునూరు, ఉత్తరాన ఒరణి ఈ రాజధానికి సరిహద్దులు. గుహాసురుడు బ్రహ్మను గూర్చి తపస్సుచేసి ఆయన్ను ప్రత్యక్షం చేసుకుని హరి చేత గాని హరుడి చేతగానీ మృత్యువు లేనట్లుగా వరం పొందాడు. ఆ ప్రభావం మూలాన విజృభించి లోక కంటకుడైనాడు. అప్పుడు హరిహరులుఆలోచించి లోక కల్యాణార్థం యిద్దరూ కలసి హరిహరనాథమూర్తితో నదీ సంగమ స్థలంలో అవతరించిగుహాసురుడ్ని సంహరించారు గుహాసురుడు మరణిస్తూ ఈ స్థలంలో తన పేరు నిలిచేటట్లు వరమివ్వమని వేడగా, హరిహరనాథుడు సరేనన్నాడు. అందుచేత ఈ స్థలానికి గుహారణ్య క్షేత్రం అనే నామధేయం ఆచంద్రార్కంగా నిలిచి పోయింది. ఆ సంగమస్థలంలో హరిహరనాథావతార పాదచిహ్నాలు యిప్పటికీ ఉన్నట్లు అక్కడి ప్రజలు చూపిస్తుంటారు - 11వ శతాబ్దంతో ప్రారంభించిన అతి ప్రాచీన శాసనాలు ఈ దేవాలయంలో ఉన్నాయి. చాళుక్యుల కాలంలో ఇది 10 4మంది బ్రాహ్మణులు అనుభవిస్తూ ఉండిన ఒక అగ్రహారం. ఈ దేవాలయాన్ని 1223 లో పోల్వాల అనే హొయసలబళ్ళాళ రాజు వీర నృసింహుని మంత్రి కట్టించాడు. 1268 లో మైసూరుజిల్లా సోమనాథపుర నిర్మాత అయిన సోముడనే దండనాథుడు ఆలయాన్ని అభివృద్ధి చేశాడు. విజయనగర

రాజులు 16వ శతాబ్దం వరకూ ఈ గుడికి చేసిన దానాలు చాలా ఉన్నాయి. విజయనగర సామ్రాజ్యస్థాపకులుగా కీర్తి కెక్కిన సోదర ద్వయంలో ఒకడు తన పేరునే ఈ దేవుడి పరంగా పెట్టుకున్నాడు - హరిహర సోమేశ్వర రాయడని బనాసర్ నగరాన్ని పాలించిన ఒక భూపాలుడి పేరు. ఇతడు హర్నహళ్ళి నగరనిర్మాత - హరీశ్వరుడని ఒక ప్రాచీన కన్నడకవి పేరు. తరువాత, బుక్కరాయల కొడుకులలో ఒకని పేరు హరిహరుడు. ఇతడే హరిహర II (1377). ఇతడి సోదరుడే ఉదయగిరికి గవర్నరుగా వుండిన సంగమ II (1356). ఈసంగ ముణ్ని గురించినదే "కడక నీవేలి తందరికంటె మించి, శరధి గంభీర ! సంగమక్ష్మాతలేంద్ర !", అని నెల్లూరు ప్రాంతంలో ఉపలభ్యమానమయ్యే చాటువులోని ప్రశంస.

ఈ విధంగా ఈ దేవుడిపేరు కొండలకూ, పల్లెలకూ, పట్నాలకూ, మనుషులకూ ఉండడంచేత ఈ దేవుడు మన తిరుపతి వేంకటేశ్వరుడిలాగే అతి ప్రసిద్ధంగా ఉండేవాడనుకో వడం అసంగతంకాదు. ఈ దేవుడిపేరు మనుష్యులు పెట్టు కోవడం కన్నడదేశంలోనేకాదు: అరవదేశంలో మళయాళ దేశంలో కూడా మామూలే. శంకర నారాయణ డిక్షనరీ అని అందరూ వినేఉంటారు. దాని గ్రంథకర్త పేరు శ్రీ పి. శంకరనారాయణశెట్టి. ఈ పేరు ఎట్లా వచ్చింది? హరిహర శాస్త్రి, హరిహరన్ అని తమిళదేశంలో పేర్లు ఉ॰
వీటి ప్రేరేపణతో విచారణ జరుపగా కొన్ని సంగతులు బయటపడ్డాయి తిరువాంకూరులో హరిహరనాథాలయం ఉందట. అందులో విగ్రహం కొయ్యతో చేసింది. మళయాళ

దేశంలో సబరిమలై అరణ్యంలో ఒక సుప్రసిద్ధ క్షేత్రం ఉంది. ఆ దేవుడిపేరు అయ్యప్పన్, హరిహరపుత్రన్ అని కూడా అంటారు. హరిహర పుత్రనే అయ్యప్పన్ అయి ఉంటుంది. ఇదియిట్లా ఉండగా కాశ్మీరులో కూడా హరిహర నాథాలయం ఉందని తెలిసింది.

హరిహర్ పట్టణంలో ఉన్న హరిహర నాథాలయం వెళ్ళి ఎవరైనా ఎట్లా హరిహరనాథుడ్ని దర్శించి సందేహం తీర్చుకోవచ్చునో, అట్లాగే ప్రత్యక్ష ప్రమాణం మరొకటి వుంది. హరిహర్‌కు సుమారు 100 మైళ్ళు నైఋతి దిక్కుగా బొంబాయి రాష్ట్రంలోని బిజాపూరు జిల్లాలో (కన్నడభాషా ప్రాంతమే) బాదామి అనేపట్నం వుంది. చరిత్ర తెలిసిన వారందరికీ దీని చారిత్రక ప్రాశస్త్యం తెలిసే వుంటుంది. బాదామి పశ్చిమ చాళుక్యుల రాజధాని. దీన్నే పూర్వం వాతాపి అనేవారు. ఇక్కడ గుహాలయాల్లో హరిహరనాథ విగ్రహ శిల్పాలున్నాయి. పూర్వం తిరువాంకూరు ప్రభుత్వపు ఆర్కియలాజికల్ శాఖలో అధికారిగా పనిచేసిన శ్రీ టి. ఎ. గోపీనాథరావుగారు ఎలిమెంట్స్ ఆఫ్ హిందూ ఇకొనోగ్రఫీ అనే గ్రంథం వ్రాస్తూ అందులో వెనక చెప్పిన గుహాలయాల్లోని హరిహరనాథుడి రెండు విగ్రహాల ఫోటోగ్రాఫులు సమకూర్చారు. ఒకఫోటోలోని హరిహరనాథుడిపేరు హర్యర్థ మూర్తి లేక శంకరనారాయణమూర్తి. దీని వివరాలు :- కుడిభాగం (శైవం) జటామకుటం సర్పకుండలం. వెనక చేతిలో సర్పవలయిత పరశువు, ముందుచేయి అభయహస్తం నంది, పార్వతి, సంగీత వాద్యాలతో ప్రమథగణాలు: ఎడమ

భాగం (వైష్ణవం) కిరీటమకుటం, నక్రకుండలం, వెనక చేతిలో శంఖం; ముందుచేయి కటక భంగిమలో తొడమీద వుంది. లక్ష్మీగరుత్మంతుడు, మొత్తంవిగ్రహానికి శిరశ్చక్రంవుంది. హరిహరమూర్తి రెండవఫోటో:- (ఇది చాళుక్యుల కాలంనాటిది. అతి రమణీయమైన శిల్పం). కుడిభాగం (శైవం) చేతిలో త్రిశూలం, అక్షమాల, పార్వతి, నంది, వెనక ప్రభావళి - ఎడమభాగం (వైష్ణవం) గదాశంఖాలు, లక్ష్మి, గరుడుడు, వెనక ప్రభావళి. ఐదుశిరస్సుల నాగు, కూర్చున్న బ్రహ్మ వున్నాడు.

హరిహరనాథుడు తిక్కన వూహఅనీ, హరిహరులకు అధినాథుడైన సర్వేశ్వరుడనీ పండితులు చేసిన సిద్ధాంతాలు కేవలం వాయుగుంభన అనడానికి యీ ప్రత్యక్ష ప్రమాణాలు చాలు.

అయితే, యిందులో యింకా విశేషాలున్నాయి. ఈ హరిహరతత్త్వం అతి ప్రాచీనమయింది. అష్టాదశ పురాణాల్లో వున్నదే. స్కాందంలో శివుడు, విష్ణువు వేరేకాదు, "నేనే విష్ణువు" అని చెపుతాడు. అట్లాగే వామనపురాణంలో కూడా విష్ణువు ఒక ఋషికి ప్రత్యక్షమై, "నేనూ శివుడూ ఒకటే" అని చెప్పి, ఆ అద్వైతరూపంలో ఋషికి దర్శన మిచ్చాడు. కుడిభాగం శివుడు, ఎడమభాగం విష్ణువు అయిన యీ దైవము పురుష ప్రకృతుల సమ్మేళనం అని సర్వజ్ఞులైన పండితుల మతం. హరుని అర్ధాంగి అయిన పార్వతి హర్యంశ పార్వతికి వైష్ణవి అని పేరు. దుర్గాదేవిని శిల్పంలో శంఖచక్ర ధారిణిగా మలచటం శాస్త్రసంప్రదాయం. శంఖచక్రాలు

వైష్ణవాయుధాలు. విష్ణుమూర్తిని స్త్రీలక్షణ లక్షితంగా భావించటం, ప్రకృతి తత్వంగా చూడటం శాస్త్రీయమే.

ఇంతెందుకు, సర్వబ్రాహ్మానుష్ఠేయమై, సంధ్యావందనములో "శివాయ విష్ణు రూపాయ శివరూపాయ విష్ణవే" యిత్యాది శ్లోకంకూడా హరిహరతత్వం యొక్క ప్రాచీనతను సూచిస్తూంది ఇంకా విశేషం ఏమిటంటే, విగ్రహ నిర్మాణాన్ని నిబంధించే ఆగమశాస్త్రం కూడా హరిహరనాథ మూర్తిని శిల్పులు ఎట్లా చెయ్యాలి అనే పద్ధతినివివరించింది. దానిప్రకారమే బాదామి గుహాలయాలలోని ఈహరిహరనాథ శిల్పాలు చెక్కబడ్డాయనేది స్పష్టంగా ఆ మూర్తిలోనేవుంది. అయితే, ఈ ఆగమశాస్త్ర నిబంధనల్లోవున్న ఒకటి, రెండు చెప్పదగినవేమిటంటే వైష్ణవభాగానికి అనర్ఘమణిభూషణాలతో అలంకరణ ఉండాలి. శైవభాగానికి అట్లాంటివిలేవు. శైవత్రినేత్రం అర్ధభాగమే చూపించాలి. శైవభాగం రోషభీషణంగా వుండాలి. వైష్ణవభాగం ప్రశాంత సుభగంగా వుండాలి. వైష్ణవ భాగం ఆకుపచ్చగా గానీ, నీలంగాగానీ వుండాలి. శైవభాగం శ్వేతంగా వుండాలి. విష్ణుధర్మోత్తరం ఈ వివరాలతోపాటు కుడిప్రక్క నంది, ఎడమప్రక్క గరుడుడు వుండాలనే నిబంధన కలుపుతుంది.

ఈ విధంగా హరిహరమూర్తి పురాణశాస్త్ర ప్రతిపాదితమేననీ, ఏదో ఒక కవి వూహామాత్రమేకాదనీ స్పష్టమయింది.

వెనుక చెప్పిన శ్రీ గోపీనాథరావుగారు ఈ హరిహరమూర్తిని విగ్రహంచేసి దేవాలయాలలో పూజించటం శైవ

వైష్ణవ మత యుద్ధాలు అంతరించి, రాజీ కుదిరిన సంధి దశను సూచిస్తుందని వ్రాశారు. ఇదంత సహేతుకమయిన వూహగా కనుపించటంలేదు. కానీ, శంకరుని జ్ఞానమార్గానికి వ్యతిరేకంగా వచ్చిన శైవ, వైష్ణవ సంయుక్తోద్యమం అంటూ శ్రీ రైసు దొరగారు,

"It is worthy to note that the revolt against the teaching of Sankara was shared by Saivites also and the feeling that they had a common cause lead during the thirteenth and fourteenth centuries various attempts being made to reconcile the rival Vishnava and :Saiva creeds by building temples to a combind diety called Harihara or Sankarnarayana. But the most important fast is that whether the diety worshipped was called Vishnu or Siva or Harihara, he was conceived of as personal and not as abstract, so that Bhakti took the place of tapas or of Yogabhyasa".

అని వ్రాశారు, ఇది చరిత్రకు తలక్రిందులుగ అర్థం చెప్పడం అవుతుంది: భారతీయ తాత్విక సాంప్రదాయాన్ని సమగ్రంగా అర్థం చేసుకోక పోవడంచేతనే శ్రీ దొరగారు ఆ విధంగా వ్రాసివుంటారు.

ఈ హరిహరారాధన ఏ పరిస్థితులలో ఎట్లా ప్రారంభించి, వుంటుంది అని ఆలోచిస్తూ, యిది కేవలం శంకరాచార్య సృష్టియేమో అని అనుమానించేవాణ్ణి. ఎందుచేతనంటే, హరిహరుడు భారతదేశ దక్షిణాగ్రమయిన తిరువాంకూరులోనూ, ఉత్తరాగ్రమయిన కాశ్మీరులోనూ, ఉండడం చూచి, ఇది ఎవడో ఆచార్యునిపనే అయివుంటుందని దృఢం చేసుకుని, ఆ ఆచార్యుడు శివానందలహరి, సౌందర్యలహరి,

లక్ష్మీనృసింహ స్తోత్రం రచించిన శంకరాచార్యుడుకాక మరెవరవుతా రనుకున్నాను. కానీ, తదనంతర విచారణా ఫలితంగా పురాణశాస్త్రాలే ఈ మూర్తికి జన్మస్థానంగా విశదమయింది. ఆ సంప్రదాయాన్నే శంకరుడు ఉపనిషచ్ఛిఖరం నుంచి అద్వైతాన్ని తెచ్చినట్లు ఈ హరిహరాద్వైతాన్ని కూడా పురాణశాస్త్ర వీధులనుండి తెచ్చి; లోకంలో తన స్తోత్ర వాఙ్మయం ద్వారా బహుళ ప్రచారంచేసి, తన ఆచార్య మఠాలను దేశంలో నలుమూలలా నెలకొల్పినట్లే ఈ హరిహరనాథ దేవాలయాలను కూడా నెలకొల్పి వుంటారని నా నిశ్చితాభిప్రాయం. శంకరాద్వైతాన్ని వైజ్ఞానికవర్గం జీర్ణించుకుని, ప్రజా సామాన్యానికిఅందజేయడం, దానికి దేశవ్యాప్తి సిద్ధించటం సమకూరాలంటే అప్పటికే దేశంలో తనచేత ధ్వంసం చేయబడ్డ బౌద్ధ, జైన, చార్వాక, శాక్తేయ గాణాపత్యాది మతాలన్నీ పోగా, వాటిని మించిన శక్తితో తలయెత్తి ప్రమాదకరమయిన గృహచ్ఛిద్రంగా తయారయిన శైవ వైష్ణవ మతాల సమన్వయం అవసరం అని ఆయన భావించి ఈ పని చేసివుంటాడు. ఆయన శైవ, వైష్ణవ మత విధ్వంసానికి పూనుకోలేదు. ఎందుచేతనంటే ఆ రెండూ వైదిక మతాలే. వేదాన్ని ప్రమాణంగా శిరసావహించి, వైదిక శాస్త్రాలను విశ్వసిస్తాయి. అందులోనూ ఈ రెండు మతాలు, భక్తిమార్గ సంబంధమయినవై పామర జనానికి ఉపయోగించేవి కనుక, వైదిక పద్ధతి ప్రకారం భక్తిమార్గం కూడా సమ్మత మయినదే కనుక, జ్ఞానమార్గోప లభ్యమయిన

పరతత్త్వాన్ని బోధించే అద్వైతానికి దెబ్బ తగులకుండా ఉండాలంటే, పామర జనంలో చెలరేగిన ఈ అజ్ఞాన ప్రేరిత మయిన శైవ వైష్ణవ భేదం సమసిపోవడం, హరిహరాద్వైతం రావడం అత్యవసరం. ఈ విషయాన్ని గుర్తించవలసిన అవసరం అద్వైత ప్రతిపాదన తొట్టదొలుత మత రూపంలో ప్రతిపాదన చేసిన, తద్వ్యాప్తికిగాను ఉద్యమం చేసిన ఒక్క శంకరుడికే కలుగుతుంది; అంతకుముందుగానీ, ఆ తర్వాత గానీ, మరెవ్వరికీ కలుగజాలదు. అందుచేత శంకరుడే యీ హరిహరనాథుణ్ణి దేవాలయాలను నెలకొల్పి ప్రచారంలోకి తెచ్చివుంటాడని నా దృఢవిశ్వాసం. ఆయన శివుణ్ణి స్తోత్రం చేశాడు. విష్ణువును అంత మక్కువతోనే స్తోత్రం చేశాడు. ఆయన శ్లోకాలకు దేశంలో అనన్య ప్రచారంవుంది. కాళిదాసు మేఘసందేశం పేరు విననివాళ్ళయినా వుంటారు గానీ "లక్ష్మీనృసింహ మమదేహికరావలంబం" అని స్తోత్రం చేసి వుండనివారు ఉండరు. ఇదంతా సూక్ష్మంగా చూస్తే శంకరుడే హరిహరనాథ వ్యాప్తికి కర్త అనుకోవడం సాహసంకాదని నా అభిప్రాయం.

శంకరుని పేరు మన తిరుపతి వేంకటేశ్వరుని విషయములో ప్రస్తావించవలసిన ముఖ్య సందర్భాలున్నాయి. మొదట వెంకటేశ్వరస్వామి శైవ విగ్రహం. ఇతరస్థలాలలో చేసినట్లే యీ ఆలయంలో కూడా శంకరాచార్యులు శ్రీ చక్రాన్ని స్థాపించారు. అది యిప్పటికీ వుందని విజ్ఞుల మతం. పైగా, వేంకటేశ్వరుడికి నాగాభరణా లున్నాయి. అవి శైవ లక్షణాలు. వక్షస్సునవున్న భూదేవి, శ్రీదేవి అని చెప్పేవి

అవి కావనీ, లక్ష్మీ పార్వతులనీ, అంటారు. అసలు వేంక టేశ్వరుడు అనే పేరు చిత్రమయింది. అందులో వైష్ణవ నామమే లేదు. విష్ణ్వాలయాలలో దేవుడిపేరు సాధారణంగా గోపాలస్వామి అనీ, చెన్నకేశవులనీ, రాముడనీ, నృసింహు డనీ, కూర్మనాథుడనీ-యిట్లా వుంటాయి. కానీ, ఆ పేర్లలో ఈశ్వరశబ్దమే లేదు. ఇందులో వుంది. పోనీ ఈశ్వరశబ్దం కాని భాగంలోనైనా విష్ణుశబ్దస్ఫూర్తి వస్తూవుందా అని చూస్తే అదీ లేదు. వేంకట అంటే పాపములను హరించు వాడు అని అర్థం. మొత్తం పేరుకు అర్థం పాపములను హరించు ఈశ్వరుడు అని మాత్రమే. ఇట్లాంటిపేరు విష్ణ్వాల యాల్లో ఎక్కడా లేదు. ఒక పెద్ద విశేషం గమనించవలసిం దేమిటంటే, యీ మూర్తిలో శివ విష్ణుమూర్తుల సమ్మేళన. యీశ్వర విగ్రహాన్ని ప్రస్తుత వైష్ణవులు శైవ సంప్రదాయా లను విడువకుండా పూజించటమూ, యీ దేవాలయంలో బలిహరణాది శాక్తేయ విధానాలు ఉండటం కూడా గమ నించ వలసిందే. ఉత్తరాదివారు బాలాజీ అంటారు. అంటే బాలా త్రిపురసుందరి అని. దానికి అనుగుణంగా విగ్రహ ముఖం కూడా స్త్రీ సహజమైన వర్తులత్వ సౌందర్యాది లక్ష ణాలతో ఉండడం గమనించాలి. అందుచేత తొలుత వేంక టేశ్వరుడు శంకరుడిచేత హరిహరాద్వైత వ్యాప్తికోసం స్థాపింపబడిన దైవం అయివుండి పూర్వ సాంప్రదాయాలున్నా క్రమేణా వైష్ణవాలయంగా మారి ఉంటుంది. ఇప్పుడు శైవ భేదం లేకుండా యావత్ప్రజలూ, శైవ, వైష్ణవాలయాలు సందర్శించి అర్చించటం కేవలం శంకరుని అద్వైత మతో

ద్యమ ఫలితమే అని కూడా నా అభిప్రాయం. "జీవో బ్రహ్మై వనాపరః" అనే తన వైజ్ఞానికాద్వైతానికి హరిహరాద్వైతం అత్యవసరం అయింది. హరిహరులు ప్రకృతి పురుషులుగా భావించినప్పుడు జీవబ్రహ్మలు ఒకటే అనడమూ, హరిహరులు ఒక్కటే అనడమూ రెండూ ఒకటే అవుతాయి.

శంకరుడు ఈ విధంగా అద్వైత సంప్రదాయాన్ని నెలకొల్పిన తరువాతనే వైదికమతం దేశంలో మళ్ళీ ప్రకాశించి వుంటుంది. చరిత్రను జాగ్రత్తగా పరిశీలిస్తే, యావద్భారతంలోనూ, ప్రత్యేకించి దక్షిణాపథంలోనూ, విస్పష్ట చరిత్ర అందని ప్రాచీన కాలంనుంచీ కూడా శివుడే ప్రధాన దైవంగా ఉండేవాడు. అందుచేతనే పూర్వమూ, యిప్పుడూ వైదికులూ విజ్ఞానులు కూడా శివభక్తిపరులుగా వుండటం పరిపాటి. 11 వ శతాబ్దపు రాజరాజనరేంద్రుడు, "ఇవి యేనున్ సతతంబు నాయెడ కరంబిష్టంబులై యుండు, బాయవు" అని చెపుతూ, ఆ అయిదింటిలో "పార్వతీపతి పదాబ్జధ్యాన పూజా మహోత్సవము"ను ఒకటిగా చెప్పాడు. అంతవరకూ, ఆ తర్వాతా వున్న కవులందరూ శైవులే. ఉదా :- పాల్కురికి సోమన, యథావాక్కుల అన్నమయ్య, శివతత్వసారం వ్రాసినపండితారాధ్యుడు యిత్యాదులు. నిర్వచనోత్తర రామాయణం వ్రాసిన నాటికి తిక్కన సోమయాజి కూడా శివభక్తుడే. "అమలోదాత్త మనీషి" అనే పద్యములో "మహేశ్వరాంఘ్రి కమల ధ్యానైక శీలుండ" అన్నాడు. 'ధ్యానైక' అన్న ముక్క గుర్తించాలి. కేతన కూడా తన దశకుమార చరితలో తిక్కన వివిధ గుణవర్ణన చేస్తూ, "౼ తనిత్యస్థిత

శివుడెవ్వడనిన వీడను శబ్దమున కర్తమైనవాడు,'' అని చెప్పాడు. తిక్కన శివభక్తికి ఈ తార్కాణాలు చాలు. తిక్కనాదుల తరువాత కొంతకాలం మణగియున్న శివభక్తి బంధురత సాహిత్యంలో శ్రీనాథు డవతరించడంతో తిరిగి విజృంభించింది. ఆయన పేరేమో విష్ణుపరంగా వుంది. బుద్ధి శివనిబద్ధం. శ్రీనాథుడు శివకవులలో కలపవలసిన వాడు. కలపకపోతే శివకవులంటూ, చెప్పదగినవారు ఒకరిద్దరే ఉంటారు. పాల్కురికి సోమనాథు డున్నాడు కానీ, నా కా మహనీయుని బసవపురాణంలో గానీ, పండితారాధ్య చరిత్రలో గానీ, కవిత్వం కావ్యానికి కావలసినంతగా కనపడటం లేదు. దేశ భాషకు వీరశైవానికీ, చారిత్రక ప్రాధాన్యానికీ మాత్రమే సోమనాథుడి వాఙ్మయం చెప్పుకోవాలి గానీ, అన్యథా ఊసర క్షేత్రమే. అయితే, సోమనాథుణ్ణి మరణానంతరం సాహిత్యంలో పునః ప్రతిష్ఠితుణ్ణి చేసిన పండితులకీ అభిప్రాయం ధిక్కారంగా కనుపించవచ్చు. అయినా ఫరవాలేదు.

ఈ విధంగా దేశంలో సర్వత్రా శైవమే సంప్రదాయంగా వస్తూవుండగా, శంకర భగవత్పాదులు అవతరించిన తరువాతనే అంతవరకూవున్న కర్మభక్తి మార్గాలనే జ్ఞానేతర పామర యోగ్య మార్గాలకు గౌరవం తగ్గి, జ్ఞానమార్గానికీ అద్వైతానికీ గౌరవం సుప్రతిష్ఠిత మయింది. అప్పటినుండి శివభక్తి ఉన్నా, విష్ణువిరోధం నశించి, వైదిక ధ్యాయితా'' వైదిక మార్గ నిష్ఠమగు వర్తనమూ, ప్రబల మయినాయి. దేశంలో ప్రబలించే వాఙ్మయంలో ప్రతిఫలించింది.

శైవులు వైష్ణవ పురాణేతిహాసాలను చెప్పడం, అద్వైత పరంగా వ్యాఖ్యానాలు వ్రాయడం, యిత్యాది పోకడలు బయలు దేరాయి. రఘువంశంలోని "వాగర్థావివ సంపృక్తౌ" అనే శ్లోకంలో కవి హృదయం, పార్వతీ పరమేశ్వర స్తవమే అయినా, ఆ శ్లోకంలోని 'పార్వతీ పరమేశ్వర' అనే సమాసాన్ని అనుకూలంగా పార్వతీ ప-రమేశ్వర అని విరిచి హరిహరనాథ పరంగా అర్థం చెప్పడం ఆ రోజులలోనే అంకురించిం దనుకొంటాను.

శివభక్తి పరుడైన రాజరాజ నరేంద్రుడు వైష్ణవ భావోత్కర్ష కలిగిన శ్రీకృష్ణ మహాత్మ్యానికి ఆటపట్టయిన భారతాన్ని వెలయింపజేశాడు. శివభక్తులైన తిక్కన నాచనలు విష్ణు ప్రశంస ఉన్న భారత హరివంశాలు తెనిగించారు.

హరిహరనాథుణ్ని కావ్యాలలో పూజించినవారు మన వాఙ్మయములో ముగ్గురే కనిపిస్తున్నారు. మొదటివాడు తిక్కన సోమయాజి. ప్రస్తుతం పినాకినీ నదీ తీరంలో ఉన్న (స్థలజ్ఞులు) హరిహరనాథాలయ మంటపమని చెప్పే మండపంలో కూర్చుని భారతం వ్రాసి ఆ దేవుని సాన్నిధ్యంలో తిక్కన కాలం గడిపివుంటాడనే నా అభిప్రాయం. "కిమస్థి మాలాం, కిము కౌస్తుభంవా" అని ఆయన వ్రాసిన శ్లోకం ఆ దేవుని విగ్రహాన్ని చూస్తూ చేసిన వర్ణనమే. ఆయన తర్వాత హరిహరనాథుణ్ని యింకా అధికోత్సాహంతో స్తుతించిన నాచన సోమనాథుని కాలంలో కూడా ఆ దేవాలయం ఉండే ఉంటుంది. కవితా శైలిలోనూ, దేశ్య భాషాభినివేశంలోనూ, తదితర అభిరుచుల్లోనూ, తిక్కన

మార్గాన్ని అక్షరాలా అనుసరించిన సోమన హరిహరాద్వైత ప్రతిపాదనలో చాలా దూరం వెళ్ళాడు. హరిహర భక్త్యత్సాహాతిశయంతో సంస్కృత మూలంలో లేని సందర్భాలు కూడా కల్పించాడు. శైవగణాలలోని వాళ్ళయిన పిశాచ ద్వయం విష్ణ నామ సంకీర్తన చేస్తారు. పుత్రార్థియై కృష్ణుడు శివునిగూర్చి తపస్సుచేసి ఆ దేవుడు ప్రత్యక్షం కాగా, "కలుగునో నాకు కన్నులార శివునిజూచు పుణ్యంబను చింతనెరయ, మొదలి వేలుపు బొడగంటి మ్రొక్క" అనీ "ఆత్మలో గంటి గన్నార, నంటి కొంటి," అని స్తోత్రం చేస్తాడు

దానికి శివుడు "కేల కేల గదియ నన్నించె గృష్ణం గృపన్." శివకేశవులు ఆ విధంగా సంయోగమైన ఆ సన్నివేశం "సిద్ధాంతపరాయత్తులగు మునుల యెరుకకు, విత్తయి చెలువారెజమిలి వేల్పని తెలుపన్" అని కవి వర్ణించాడు. అక్కడే, ఋషులు, దేవతలు, అన్నారని చెప్పిన సీసపద్య ద్వయం అపూర్వం, అసదృశం. "అభ్రంకషంబైన ఆలపోతు నితండు, త్రుంచినాడీతండు పెంచినాడు" యిత్యాది పద్యాలు హరిహరతత్త్వ జిజ్ఞాసువు లందరికీ అవశ్య పఠనీయాలు.

తెలుగు సాహిత్యంలో హరిహరనాథ స్తవంచేసిన కవి మరొకడున్నాడు. ఆయనే పంచతంత్రం తెలుగులో పద్య కావ్యంగా వ్రాసిన వెంకటనాథకవి. ఇంటిపేరు బైచరాజు వారు. బ్రవునుదొరగారు తన నిఘంటువులో ఈ కవి 1500 సం॥ ప్రాంతంవాడని చెప్పాడు. ఈ కవి తన కావ్యంలో సుకవిస్తుతి చేసే సందర్భంలో "ప్రాజ్ఞుల, తిక్కయజ్వ నమరేశున్ సోము శ్రీనాథునిన్" అని కేవలం నెల్లూరు మండల కవులను

మాత్రమే స్తుతించాడు. ఇది ఒక చిత్రమయిన విషయం. ఆ కావ్యంలో కూడా భారతంలోలాగే స్వప్నవృత్తాంతం వస్తుంది. అంతా ఆద్యంతం భారతంలోలాగే నడుస్తుంది. "కిమస్థిమాలాం" అన్నశ్లే గద్య ఒక శ్లోకంతోనే అందులోనూ ప్రారంభిస్తుంది. అందులోనూ హరిహరనాథుడే కృతి యిమ్మని కవిని అభ్యర్థిస్తాడు. దానికి కవి "ప్రచనువు కలదు, హరిహర, సాచివ్యము నొందనన్య జనులకు మదిఁజాలోచింప దిక్కయజ్వకు, నాచనసోమునకు, మరియు నాకుం దక్కన్" అని యావదాంధ్ర సాహిత్యలోకంలో ఈ ముగ్గురే కావ్యాలలో హరిహరస్తోత్రం చేసినవారని తేల్చివేశాడు. కవిద్రాఘిష్ఠ సమాస కల్పనా చాపల్యం చూపించినా, జాను తెలుగు నుడికారాన్నికూడా బహుళంగా ప్రయోగించి, తిక్కన సేవపై తనకు గల వ్యామోహాన్ని, భక్తిప్రపత్తులనూ, నిదర్శించాడు. "ఘనతర ఘూర్జరీ కుచయుగ క్రియ" అనే ప్రసిద్ధ పద్యం చెప్పిన కవి యితడే.

ఈ విధంగా కన్నడకవులు ఎవరైనా హరిహరస్తుతి తమ తమ కావ్యాలలో చేశారా అనే విషయం దర్యాప్తు చెయ్యాలి. హరిహరస్తుతి చేసేవుంటారని నా దృఢ విశ్వాసం. మనకేది వచ్చినా రావడానికి కన్నడదేశమే పూర్వం రహదారి.

హరిహరనాథుడి ప్రాచీనతను విశదంచేస్తూ యీనాటికీ బాదామిగుహల్లో హరిహరనాథశిల్పము కర్ణాటాది దేశాల్లో దేవాలయాలు, ఆగమశాస్త్రంలో తద్విగ్రహ శిల్పకల్పనాలు, విధానము, ఉండడమేగాక, ఇంకా ముఖ్యమైన విషయమేమి

టంటే :— వివిధ పురాణాంతర్గతాలు, ఆచార్య పురుష ప్రోక్తాలు అయిన ప్రాచీన దేవతాస్తోత్రాలు సంపుటీకరించిన ప్రాచీన గ్రంథం 'బృహత్ స్తోత్రరత్నాకరం' అందులో గణ పత్యాది దేవతలతోపాటు హరిహరనాథుని స్తోత్రంకూడా ఉంది. ఆ స్తోత్రంపేరు 'హరిహరాత్మకస్తోత్రం.' స్తోత్రాం తంలో "ఇతి శ్రీ స్కాందపురాణే, కాశీఖండే, ధర్మరాజ విర చితం, హరిహరాష్టోత్తర శతనామస్తోత్రం" అని చెప్పబడి ఉంది. హరిహరనాథుని ప్రాచీనతకు ఇంతకంటె వేరే నిద ర్శన మక్కరలేదు.

ప్రాచీనత మాట అటుంచి, తదితర దైవతములతో పాటు హరిహరనాథునికూడా అర్చించడం పూర్వం సంప్ర దాయంగా ఉండివుంటుందని కూడా ఇది విశదం చేస్తుంది. ఇక స్తోత్రంలో కొన్నిభాగాలు ఉదాహరణగా యిస్తున్నాను.

"గోవింద మాధవ ముకుందహరే మురారే
శంభో శివేశ శశిశేఖర శూలపాణే
దామోద రాచ్యుత జనార్దన వాసుదేవ
త్యాజ్యాభటాయ ఇతి సంతత మామనంతి.
గంగాధరాంధకరిపో హర నీలకంఠ
వైకుంఠ కైటభరిపో కమఠాబ్జపాణే
శ్రీరామ రాఘవ రమేశ్వర రావణారే
భూతేశ మన్మథరిపో ప్రమథాధినాథ

గణ ఉవాచ :—

ఇత్థం ద్విజేంద్ర నిజభృత్య గణాస్సదైవ

సంశిక్షయే దవనిగాన్సహి ధర్మరాజః
అన్యేపి యే హరిహరాత్మకథా ధరాయాం
తే దూరతః పునరహో పరివర్జనీయాః

అగస్త్య ఉవాచ :—

యో ధర్మరాజరచితం లలితప్రబంధం
నామావళీల సకలం కల్మషబీజహంత్రీం
భీమాత్రకౌస్తుభభృత శ్శశిభూషణస్య
నిత్యం జపేత్ స్తనరసం నపిబేత్స మాతుః.

మరొకవిషయం ఏమిటంటే :—పంచతంత్రం వ్రాసిన వేంకటనాథకవి తన గ్రంథంలో "ఏ చనువు గలదు హరిహర సాచివ్యము నొంద నన్యజనులకు మది నాలోచింప దిక్క యజ్వకు నాచన సోమునకు మరియు నాకుం దక్కన్"—అని వ్రాసిన పద్యం. దీన్నిబట్టి ఎవరయినా, ఆంధ్ర సాహిత్యంలో పూర్వం ముగ్గురు కవులే హరిహరనాథుణ్ని స్తుతించారను కుంటారు. కానీ సింహాసన ద్వాత్రింశిక రచించిన కొఱవి గోప రాజు కూడా పై ముగ్గురు కవుల్లాగే హరిహరనాథుడికే తన కావ్యాన్ని అంకితమిచ్చాడు. తత్ప్రకారం ఆశ్వాసాద్యంతాల్లో హరిహరస్తుత్యాత్మక పద్యాలు వ్రాశాడు. అట్లాంటప్పుడు వేంకటనాథకవి ముగ్గురమే అని చెప్పడం కొంతవిచారణకు తావిస్తుంది.

దీనిమూలంగా వేంకటనాథకవి కొఱవి గోపరాజుకంటె పూర్వుడా అని ప్రశ్నవస్తూ ఉంది. కాని వేంకటనాథుడు 1500 ప్రాంతంవాడని, గోపరాజు 1480 ప్రాంతంవాడని పండి తుల అభిప్రాయం. అంటే గోపరాజు శ్రీనాథుడికి, అనంతా

మాత్యుడికి సమకాలికుడన్నమాట. వీరికి తర్వాతివాడు వేంకటనాథుడని దీని అర్థం. అయితే వేంకటనాథుడు 1500 ప్రాంతం వాడనడానికి ఉన్న ఏకైక ఆధారం "బ్రౌను దొర వారు తమ నిఘంటువునందు ఆవిధంగా వ్రాసియున్నారు" అన్నది ఒక్కటే. కానీ పండితాభిప్రాయాన్నిబట్టి కూడా వారిద్దరి జీవితకాలవ్యత్యాసం 20 సంవత్సరాలే! పై కాల నిర్ణయాలకు ఆధారస్థావం లేకపోవడంచేత ఈ విషయం నిష్కర్షచేయబడినట్లుగా తీసుకోనక్కరలేదు. "ఏ చనువు గలదు" అనే వేంకటనాథుడి పద్యాన్నిబట్టి వేంకటనాథుడే గోపరాజుకంటె పూర్వుడనిగానీ, లేకపోతే సమకాలికుడనిగానీ అనుకోవచ్చును.

పైగా "కవుల చరిత్ర"లో గోపరాజు 17 వ శతాబ్దపు వాడని ఉంది. అయితే 17 వ శతాబ్దపు వాడనడం మరీ అతి వాదం అవుతుందేమో! ఎందుచేతనంటే గోపరాజు కవిత్వంలో 14, 15 శతాబ్దులనాటి ముద్రఉంది. ముఖ్యంగా తెనుగుభాష వాడడంలో అది స్పష్టం అవుతుంది. కొన్ని చోట్ల కేవలం అచ్చతెనుగుపద్యాలు వ్రాయడం, తెనుగు దనం హెచ్చుగా చూపిస్తూ అక్కడక్కడా సంస్కృతధోరణి జళిపించడం ఆనాటి అలవాటుగా కనుపిస్తుంది. దానికి ఉదాహారణలు—ప్రథమాశ్వాసంలో 231, 238, తృతీయాశ్వాసంలో 42, 43, 165 ఇత్యాదులు. మచ్చుకు:—

> "కలిదోచి నూనె వ్రేలిడి
> తలపుర్రియయందు నేతి తైలంబును జొ
> బ్బిలరాచి మెతగా బొదు

గలరించి కుమారునునిచి రా దాదులటన్."

ఇంకొకటి :—

"మొల బులితోలును మేనం
బలుచని వెలిపూత యరుత బాముల పేరం
దల మిన్నేరును జడలును
జలివెలుగుం గలుగు మేటిజంగముగొలుతున్."

రచనా వైచిత్రిలో గోపరాజు నాచనసోముణ్ని హెచ్చుగా అనుసరించినట్లు కనుపిస్తుంది. నాచనసోముడిలో ఉన్నట్లుగానే ఈయనలోకూడా ఒక అర్థంగాని పద్యం ఉంది. "అక్కణహృదయదండొక్క—కేళః కేళిపః వఃకణీవళఃపక్క—డక్క అంకక్కరిక్క మహాలద సాందన లవఃప్పహిత తులః కధీర" (ఆ2,ప46) ఇత్యాది—నాచనసోముని, "పన్నగంబులరాజు పగవాడుగూడి నీ శయనంబు పయనంబు సంతరింప" పద్యం లాగే ఈయనకూడా "మున్నీటిపాపయు మున్నీటి తేపయు నిల్లాలునిల్లునై మెసగువాని—బాముల పగవాడు బాముల వగవాడు దేరును పాన్పునై తేరువాని"— అంటూ వ్రాశాడు.

"పురికొల్పవనా"వంటి విచిత్రాలున్నాయి, "నల్లిల్లు", "భజనకెమ్క"లాంటి జాతీయాలున్నాయి. "భూపతీ వాత్స ల్యంబు", "సురభితము"లాంటి విశేషాలూ ఉన్నాయి. శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు జక్కన గ్రంథాన్ని గోపరాజు చూచి ఉండడని వ్రాశారు. కాని చూచేఉంటా డనడానికి చాలా నిదర్శనాలున్నాయి. మచ్చుకు—(షష్ఠా శ్వాసంలో 71 పద్యం) జక్కన "పసగల వెన్నెల మిసిమి

పుక్కిటబట్టి పొసగబిల్లలనోళ్ళబోసిపోసి" అని చకోరపు పులుగుల వెన్నెలవిందుగురించివ్రాస్తే అట్లాగే గోపరాజు (చతుర్థాశ్వాసంలో 114 ప.) "తొలి తొలి తేత వెన్నెల సార క్రమింగుచు దనియ బిల్లల నోళ్ళజొనిపి జొనిపి" అని అంతా అట్లాగే వ్రాశాడు. "లంకేశారిపదాంకితంబులు" లాంటి భాషాశుద్ధి విస్తారంగా కనుపిస్తూ ఉన్నప్పటికీ, తెనుగు వాడుతున్నప్పుడు చూపించగలిగినంత చిక్కదనమూ అర్థపుష్టి, సంస్కృతంవాడే సందర్భాల్లో కనుపించదు. నిరర్థకంగా, అతి దీర్ఘంగా సమాసాలుసాగిపోతాయి. ఏమిటిఅర్థం అని విరిచి చూస్తే ఏమీఉండదు. ఆశ్వాసాంతపద్యాలన్నీ అట్లాగే ఉన్నాయి. ఉదా: "శౌర్యసర్వంకష వైభవాంకిత వశంకరు", "నిష్కళంకిత విలాస కలాపధురీణు", "ప్రహ్లాద స్థిరభక్తి భాగ్యవిభవ ప్రత్యక్షరూపున్", "ఇంద్రాదిస్తుత సౌభాగ్య వైభవుని, బర్హీభూత భూతావళీ సాంద్రానందకర ప్రసంగ నిజలాస్య ప్రస్ఫుటీకారు", "ఆరూఢ స్థిరకీర్తి వల్లివిభవ వ్యాప్తాఖిలాశాంతు"—ఇట్లా ఉంటాయి. చదువుతూఉంటే ఏమిటిదంతా అనిపిస్తుంది. ఈ అర్థరహితము అప్రౌఢము అయిన సంస్కృతంచూస్తే కవిసంస్కృత భాషాభ్యాసంలో ఆనాటికవులకంటె ఈనాటి కవులతోనే కలుస్తాడేమో అని పిస్తూ ఉంది. ఆ సమాసాలు దొర్లించడంలో ముందువెనుకలు చూడకుండా, "[illegible]విభవ", "శంకావహా జంకారాళి". "భూపతీ వాత్సల్యంబు" లాంటి ప్రయోగాలు దొర్లిస్తాడు. ఇదొక విశేషం ఆయనలో. సందర్భం వచ్చింది గనక ఇవన్నీ ప్రస్తావించాను.

ఇంతకూ అసలు సంగతి—ఇవన్నీ చూస్తే గోపరాజు 17 వ శతాబ్దపువాడుగా తోచడు. కానీ వేంకటనాథుడే గోపరాజుకంటె ముందువాడనుకోవచ్చు—లేదా సమకాలికుడు.

అయితే గోపరాజొకడు హరిహరనాథు భక్తుడున్నా డని వేంకటనాథుడికి తెలీక అట్లా ముగ్గురు భక్తులమే నన్నా డేమో అనుకోవడానికి, గోపరాజు అంత అప్రశస్తు డనుకోవ డానికి వీల్లేదు. గోపరాజు రాజమర్యాదలతో తులతూగే "వెలనాటి పృథ్వీశ్వర సామ్రాజ్యభార ధుర్యు"డని పొగ డొందిన వెన్నామాత్యుని వంశంలో పుట్టినవాడు. అందుచేత గోపరాజుకవితలో గుణం లేకపోయినా ప్రశస్తిమాత్రం రావాలి. అయితే వేంకటనాథుడికి గోపరాజు కావ్యంతో పరిచయం ఉన్నప్పటికీ హరిహరనాథుడి భక్తులం ముగ్గురమే అని గోపరాజు నెందుచేత పేర్కొని ఉండడు? కారణం గోపరాజు కావ్యంలో అప్పటికి హరిహరస్తుతి లేదేమో అని సందేహం వస్తూఉంది! బహుశా సింహాసనద్వాత్రింశికలోని హరిహరస్తుతి తొలుత లేక తర్వాత గోపరాజుచేతనో లేక తద్వంశీయుల చేతనో ప్రక్షిప్తం చేయబడి ఉండవచ్చును. లేక పోతే ఈ వైరుధ్యాన్ని సమన్వయించడం దుస్సాధ్యంగా ఉంది.

వేంకటనాథుడి కవిత్వాన్నిబట్టికూడా ఆయన కాలం నిర్ణయించడానికి సాధ్యంకాదు. ఎందుచేతనంటే ఆయన కవిత చాలావరకూ ఎవరిదానితోనూపోలదు, ఏకాలపు అలవాట్లూ చిహ్నాలూ కనుపించవు. పైగా అతికృతకంగానూ మహా దారుణంగానూ ఉంటుంది. వచనంలో చిన్నయసూరిలాగే ఈయనపద్యంలో ప్రాణాలుతీస్తాడు. శబ్దాలంకారాలు విస్తా

రంగా కనుపించడం, "ఘనతర ఘూర్జరీ కుచయుగ క్రియ", ఈ రెండుకాలాన్ని గురించి వూహించడానికి కొంత అవకాశ మిచ్చినా, ఒక యిదమిత్థమైన అభిప్రాయానికి రావడానికి ఏమాత్రం చాలవు.

అయితే సింహాసనద్వాత్రింశికలోని హరిహరస్తుతి ప్రక్షిప్తం అయి ఉంటుందని అనుమానించడానికి కారణాలు— ఒకటి, సమకాలికు డనుకున్నట్లయితే, వేంకటనాథుడు మేము ముగ్గురమే హరిహరనాథ భక్తులమని చెప్పేటప్పుడు గోప రాజును మినహాయించడం.

రెండవది తిక్కన, నాచన సోమనలు హరిహర నాథుని వర్ణించేటప్పుడు రెండుమూర్తులు సమ్మేళమైన ఒక ఐక్యమూర్తిని స్తుతింపగా ఈకవి శివకేశవులను ప్రత్యేకంగా వర్ణించి హరిహరనాథా అని చివర సంబోధిస్తాడు. తుదకు వేంకటనాథుడు కూడా తిక్కనాదులవలెనే శివకేశవ సమైక్య మైన ఏకమూర్తినే వర్ణించాడు. ఉదా :- "చక్రత్రిశూల తిరోభూత", "గరుడ వృషపతాకా", యిత్యాది విధంగా వర్ణించాడు. కానీ గోపరాజు కవివంశావతార వర్ణనకు ముందు "పాపపెండెముగాక పసిడి అందియయును, నడుగు దామరలపై నమరువాడు" అనే ఒక్క సీసపద్యంలో తప్పితే మరెక్కడా ఇట్లా ఐక్యమూర్తిని వర్ణించలేదు. అందుచేతనే ఈ హరిహరస్తుతి ప్రక్షిప్తమేమో అని అనుమానం. లేక గోపరాజు శివభక్తుడుగా ప్రసిద్ధుడై ఉండి కావ్యంలో హర స్తుతి జేసి తర్వాత అవసానదశలో హరిహరభక్తుడై హరిహరస్తుతి చేర్చి ఉండవచ్చును. కవిలోమార్పు

కావ్యంలో చేర్పు లోక దృష్టిలో పడ ఉండక పోవచ్చును—ఎందుచేతనంటే చిరకాలంగా కవి శివభక్తుడు గానే లోకానికి పరిచితుడు గనక. అందుచేతనే ఈ మార్పు వేంకటనాథుడి దృష్టికి వచ్చి ఉండదు. గోపరాజు తొలుత శివభక్తుడుగా ఉండి తర్వాత హరిహరనాథ భక్తుడవడం అసంభవం కాదు. ఆనాడు ఇట్లాంటి సంఘటనలు చాలా ఉన్నట్లు గ్రంథాలు సాక్ష్యం యిస్తున్నాయి. తిక్కన సోమ యాజే నిర్వచనోత్తర రామాయణంలో "మహేశ్వరాం ఘ్రికమలధ్యానైక శీలుండ" అని భారతంలో కేవలం హరి హరనాథు భక్తుడుగా మారిపోలేదా?

ఇంకొక విశేష మేమిటంటే-తిక్కన సోమయాజి కాలంలో హరిహరనాథుడు ఒక సముజ్జ్వల తాత్త్విక సిద్ధాం తానికి స్వరూపంగా భావింపబడితే, వేంకటనాథ గోపరాజుల కాలానికి కేవలం దేవాలయంలో ఉండే ఒక మామూలు అర్చామూర్తిగా మాత్రమే పరిణింపబడసాగాడు. అందుచేతనే తిక్కన భారతంలో మహోజ్జ్వల తేజోపుంజంగా దర్శన మిచ్చిన హరిహరనాథుడు గోపరాజాదుల్లో వివిధ దైవతాల మధ్య మరొక సామాన్య దైవతంగా కనుపిస్తాడు. ఆ ఔజ్జ్వ ల్యం పోయింది. తిక్కన భారతమంతా హరిహరనాథుణ్ని ఒక్కణ్నే స్తోత్రంచేసి, కేవలం శుద్ధతత్త్వామృతంలో ఓల లాడితే, వేంకటనాథాదులు కావ్యాల్లో అందరు దైవతాలను స్తుతించి హరిహరనాథుణ్ని స్తుతించారు. అందులో గమ నించవలసింది—గోపరాజు కావ్యారంభంలో "జటాపల్లవ స్తోమంబా హరపారిజాతమునుతింతున్", అంటే, "త్రైలోక్య

రఘువర్ధిష్ణుడు కృష్ణుడూర్జితమనీష న్నాకుదిక్కయ్యెడిన్",
అన్నాడు వేంకటనాథుడు. కాని వేంకటనాథుడు స్పష్టంగా
హరిహరనాథుడికే కావ్యాన్ని అంకితమిచ్చాడనీ, సర్వదా
హరిహరనాథ భక్తియుక్తుడని, గోపరాజుమాత్రం అట్లాకాక
తొలుత శివభక్తుడై ఉండి చివర హరిహరభక్తి అలవరచు
కొని ఉంటాడని వూహించడం సమంజసం.

ఈ ప్రక్షిప్తమైన హరిహరస్తుతి లెక్కకు తీసుకుంటే
ఆంధ్రసాహిత్యంలో హరిహరనాథ స్తుతిచేసిన కవులు నలు
గురు అనీ లేకపోతే ముగ్గురు అనీ అనుకోవాలి.

# శ్రీనాథుని జన్మస్థానం నెల్లూరే.



ఇటీవల కాకినాడలో జరిగిన ఒక సాహిత్యసభకు అధ్యక్షుడుగా ఉపన్యాసం చేస్తూ శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు శ్రీనాథుని జన్మస్థలమేదో యింతవరకు నిర్ణయం కాలేదన్నారు. ఈ విషయాన్ని గురించి కొంత పరిశీలన చేసి ఒక గ్రంథానికి సరిపడే సామగ్రి సేకరించిన నేను అక్కడ ఉన్నప్పటికీ అది వారిముందు ఉంచే అవకాశం లేకపోయింది. అందుచేత యీ వ్యాసం — ఇది సత్యాన్వేష జిజ్ఞాసమాత్రమే. మరొకటికాదు. ఏ కలపటమో లేక కాళీపట్టణమో అన్న ఒక్క అంశాన్ని మాత్రమే ఆధారం చేసుకుని కాకుండా ఆనాటి యావత్తు భౌగోళిక, చారిత్రిక స్థితిగతులను చర్వణం చేసి విషయ నిర్ణయం చేయడానికి ప్రయత్నించాను. గాలం వేసి పట్టుకోకుండా వలవేసి పట్టుకునే పద్ధతి అవలంబింపబడింది. నా అభిప్రాయాలు, సిద్ధాంతాలు కావని కూడా మనవి.

శ్రీనాథుడు "నిజము నాది కర్ణాట భాష" అని రాజమహేంద్రవర పండితులను ఎదుర్కొన్నప్పుడూ, "తల్లీకన్నడ రాజ్యలక్ష్మి" అని విలపించినప్పుడూ ఆయన తన ప్రాంతాన్ని గురించి వూహించడానికి అవకాశం యిచ్చాడు. ఈ రెండు వాక్యాలు, కొందర్ని శ్రీనాథుడు కర్ణాటుడు (అంటే తెలుగువాడు కాడు) అని భ్రమించేటట్లు చేశాయి. అయితే యీ సంగతి సవ్యంగా అర్థం చేసుకోడానికి ఆనాటి చారిత్రక

స్థితులు బాగా అవగతం చేసుకోవాలి. 1336 సం.లో కర్ణాట రాజులు తెలుగు దేశాన్ని తూర్పున ప్రాక్సముద్రం వరకు ఉత్తరాన కొండవీటి ప్రాంతం వరకు జయించారు. 1475 సం లో వారు దాన్ని కోల్పోయినా, కృష్ణదేవరాయలు 1509 సం.లో మళ్ళీ స్వాధీనం చేసుకున్నాడు. అప్పటినుంచీ 1614 సం॥లో వెంకటపతిరాజు మరణించే వరకూ అది కర్ణాట రాజ్య భాగంగానే వుంటూ వచ్చింది. కర్ణాట రాజ్యంలోని తెలుగు భాగంలోవున్న నెల్లూరుసీమ, కనిగిరిసీమ, కందుకూరు సీమ యిత్యాదిసీమల్లోని ఉదయగిరిసీమ మొత్తం రాజ్యంలో రాజ ధానికి తరువాత రాజకీయంగా ప్రధాన పాత్ర వహిస్తూ యువరాజ పీఠంగా ఉండేది. ఈ విధంగా దాదాపు 400 ఏండ్లు రాజకీయ సంబంధం ఉన్నప్పుడు తెనుగుదేశం కర్ణాటదేశం అనిపించుకోవడంలో ఆశ్చర్యమేమిటి? పైగా ఆరోజుల్లో దేశాల పేర్లు రాజుల్నుబట్టి ఏర్పడేవి, యిప్పటిలాగా భాషను బట్టికాదు చాళుక్యరాజ్యము, చోళరాజ్యం, కళింగరాజ్యం, కర్ణాట రాజ్యం యిట్లా—భాష సాహిత్య దృష్ట్యా ఆ రోజుల్లో పెంపొందినా రాజకీయ దృష్ట్యా అప్రధానంగా ఉంటూ ప్రజల అన్యోన్యతకు అడ్డువచ్చేదికాదు. అదే మంచిదేమో— అందుచేత శ్రీనాథుడు కర్ణాట దేశస్థుడంటే కర్ణాట జాతీయు డని కానీ భాషీయుడని కానీ కాదు. కర్ణాట దేశంలోని తెలుగువాడు. ఇంతకంటే ముఖ్యమయింది మరొకటి ఉంది.

14 వ శతాబ్దంలో రాజకీయ సంబంధం ప్రారంభిస్తే అంతకు పూర్వమే మరింత ముఖ్యమయిన సంబంధాలు తెలుగు వారికీ, కన్నడులకూ మధ్య ఏర్పడ్డాయి. తెలుగు వారికి

సాహిత్యం కన్నడ దేశంనుంచి వచ్చింది. లిపి అక్కడనుంచి వచ్చింది. ఛందస్సు అక్కడనుంచి వచ్చింది. చివరకు తెలుగు వారికి మొదటిసారిగా కుదిరిన సొంత మతం వీరశైవం కూడా అక్కడనుంచే వచ్చింది. వీరశైవానికి పూర్వం ఉన్న ఆర్య మతం వింధ్యోత్తరాగతులైన శాతవాహనాది ఆర్యరాజులు తెచ్చినది; బౌద్ధం కూడా అంతే. ఈ రెండు మతాలు యిక్కడ ఎంత ఉచ్ఛస్థాయిని అందుకున్నా ఆ మతాధికారు లకూ-ప్రజలకూ మధ్య పెద్ద అంతరము ఉంటూ చివరకు ప్రజలమతం అయిన వీరశైవం విప్లవోద్యమంగా వచ్చింది. హిందూ బౌద్ధ మతాలు మంచివి కావని కానీ వీరశైవం గొప్పదని కానీ నా అభిప్రాయం కాదు. వైజ్ఞానికంగా పురో గమించిన ఆర్యమతాలే గొప్పవి కావచ్చు. కానీ ఇది ఆనాటి చరిత్ర—ఈ విధంగా లిపి, సాహిత్యం, మతం, అంటే ఒక్క ముక్కలో శైశవజాతికి కావలసిన జీవక్షీరమే తెలుగుజాతి కన్నడ జాతినుంచి పుచ్చుకున్నదన్నమాట ఇక శ్రీనాథుడు "తల్లీ కన్నడ రాజ్యలక్ష్మీ" అని సంబోధించడంలో ఆశ్చర్య మేముంది? 10, 11 శతాబ్దాలనుంచీ 17 వ శతాబ్దం వరకూ అంటే దాదాపు 600, 700 ఏండ్లు ఉన్న యీ సాంస్కృతిక రాజకీయ బంధాలు తెలుగు కన్నడ జాతులను మిళితంచేసి అవినాభావం కల్పించక పోతాయా? వందా, వందా పాతిక ఏండ్ల ఇంగ్లీషువారి సంబంధానికే మనవారు అబాల గోపా లమూ జుట్టు విడిచి క్రాఫింగు పెట్టుకున్నారే, ఇక 600, 700 ఏండ్లు కర్ణాటుల తోటి మాతా శిశుసంబంధం ఉన్నప్పుడు వారే వీరు, వీరే వారు అవడంలో ఆశ్చర్యమేమిటి? తెలుగు

వారికీ, అరవ వారికీ ఏవో పెద్ద సంబంధాలు ఉన్నట్లు అనుకోవడం పరిపాటి. కాని అం కంటె ఎక్కువ మనం గుర్తించవలసింది తెలుగు వారికి ఏ యితరులతో కంటే కన్నడులతోటే అతి ప్రధాన సంబంధాలున్నాయన్న సత్యము.

మరొకటి—కృష్ణోత్తరాన శ్రీనాథుని కాలంలో గాని అంతకుపూర్వంగానీ తెలుగుకవులు ఉన్నారా? 15వ శతాబ్దానికి పూర్వం పరిస్థితులు చూస్తే కృష్ణోత్తర దేశం అంతా సాంద్రారణ్య మయంగానూ, కృష్ణదక్షిణ ప్రాంతమే జనవాసితంగానూ, రాజకీయ పీఠాలకూ తద్వారా సాహిత్య పీఠాలకూ ఆలవాలంగానూ కనుపిస్తుంది. కొండవీడు, గుంటూరు ప్రాంతాలకు దక్షిణంగా ఉన్న నెల్లూరూ ప్రస్తుత రాయలసీమజిల్లాలూ, ప్రాచీనాంధ్ర దేశంగా కనుపిస్తుంది. ఉత్తరాన కూడా జననివాసాలు మామూలుగా ఉండి ఉంటే కన్నడులనుంచి వారి సంస్కృతి మనకు వచ్చినట్లు కళింగ సంస్కృతి కూడా మనకువచ్చి ఉండేది. అట్లా రాకపోడానికి బహుశా విస్తార నైసర్గిక అవరోధంగా ఆ ప్రజలకూ ఈ ప్రజలకూ మధ్య అరణ్యాలుండటమే కారణం కావచ్చు. పైగా అనుల్లంఘనీయమైన గోదావరి కూడా కారణం కావచ్చు. జనపదాలున్న కళింగసమీప ప్రాంతాలన్నీ కళింగ దేశంగానే వ్యవహరింపబడ్డాయి. పాండురంగ మాహాత్మ్యంలో "కళింగ దేశాభరణంబయిన పీఠికాపురంబు" అన్నాడుకవి. "స్కాందాబ్ధి మధ్యంబునన్" అంటున్నాడు గనుక పాండురంగ మహాత్మ్యము స్కాందపురాణాంతర్గతమే అయితే స్కాందపురాణ కాలమెప్పుడో ఆనాటికి కూడా (అంటే తెనాలి రామకృ

ష్ణుని కాలానికే గాక) పిఠాపుర ప్రాంతం కళింగదేశమన్న మాట. పిఠాపుర దక్షిణ ప్రాంతాలు అంటే గోదావరీ దక్షిణ ప్రాంతాలు ఎప్పుడూ కళింగదేశంగా వ్యవహరింపబడ లేదు. గజపతులు దక్షిణాన ఉదయగిరి వరకూ స్వాధీనపరచు కున్నా అది తాత్కాలికంగానే. బహుశా ప్రజలకూ గజపతు లకూ (కళింగరాజులకూ) మధ్య ఉన్న విశేష సాంస్కృతిక భేదమే కారణమై గజపతుల మీద ప్రజాసానుభూతి లేకపో వచ్చు. కానీ కన్నడులయిన విజయనగరరాజుల మీద సాంస్కృతిక సాన్నిహిత్యం మూలాన సానుభూతి ఉండి వారి పాలన ప్రజాభిమానాన్ని చూరగొని ఉండవచ్చును. కళింగ రాజులే ఒడ్డెరాజులు. వారికి యీ సాహిత్యం ఈ ప్రాంతీయ సంస్కృతి దూరమవడంచేతనే శ్రీనాథుని మహిమ ఎరుగక పన్ను చెల్లించలేదని ఆ మహాకవిని శిక్షించి అవమాన పర చారు. తెలుగు రాజులో లేక కర్ణాట రాజులో అయితే ఆ పని చేసేవారా? ఆస్థానకవిని చేసుకొని కనకాభిషేకాలు కురిపించారు కదా-అందుచేత కృష్ణానదీ దక్షిణాననే ఆనాటి తెలుగుదేశం ఉండేది.

ఉత్తరాన చాళుక్యులు రాజధాని ఏర్పరచుకున్నారు. వారనాంధ్రులుగదా. అందుచేతనే అసలు దేశం వదలి ఉత్త రాన రాజధాని పెట్టుకొన్న రెడ్డిరాజులు (2) బెండపూడి అన్నయామాత్యాదులను పాకనాటి సీమనుంచి పిలిపించు కున్నట్లు చాళుక్యులున్నూ, నన్నయాదులను పిలిపించుకుని ఉంటారు. అది దక్షిణం నుంచి ఖాళీగా ఉన్న కృష్ణోత్తర ప్రాంతాలకు ఆంధ్రులు విస్తరించుకుంటున్న కాలం. అనేక

కుటుంబాలు కవులుగా, పండితులుగా, ప్రధానులుగా, దండ నాథులుగా నెల్లూరు ప్రాంతాలనుంచి రెడ్డిరాజుల కాలములో ఉత్తరం వెళ్ళారు. అందుచేతనే కందుకూరి వారు మొదల యిన ఇంటిపేర్లు గోదావరీ ఉత్తర ప్రాంతాన ఉన్నాయి: పాకనాటివారు, వెలనాటివారు అనవలసిన ప్రసక్తి వచ్చింది. (చోళుల కాలంలో ద్రావిడ కుటుంబాలు ఉత్తరం వెళ్ళటం చేతనే ఈనాడు ఉత్తరానకోనసీమ వగైరా ద్రావిడులు ఉన్నారు.) ఇట్లా దక్షిణం నుంచి ఉత్తరానికి ఎగుమతి అవడం ఆ కాలంలో చాలావరకు జరిగింది. బెండపూడి అన్నయ్య సంగతి చెప్పాను. నెల్లూరు వాడయన ఎఱ్ఱన తాత వేంగిలో (ఏలూరు ప్రాంతం) కరావర్తి పదవి నిర్వహించినట్లు నృసింహ పురాణంలో ఉంది. బహుశా మల్లికార్జున పండితారాధ్యుడు కూడా ఆవిధంగానే గోదావరీ మండలం వెళ్ళినవాడు కావ చ్చును. అసలు నన్నయ సంగతికూడ ఆలోచిస్తే ఆయన ప్రస్తుత మైసూరు సమీప తెలుగు ప్రాంతీయుడుగా కనిపి స్తాడు. ఆయనకు కన్నడ విద్వాంసుడయిన నారాయణభట్టు "సహాధ్యాయు"డట. అంటే అది బాల్యస్నేహితమే కదా, ఆంధ్ర కర్ణాట బాలకులు సహజంగా రాజమహేంద్రవరంలో ఎట్లా కలుస్తారు—అట్లాకాదు సాహిత్యంలేని తెలుగువారు, సాహిత్య ప్రౌఢిమకు అందుకున్న కన్నడుల ప్రాంతాలకు సమీపంగా నివసిస్తున్నవారు, కన్నడవిద్య నేర్చుకోవడం, అందులో కవిత్వం చెప్పడం, పాండిత్యం గడించడం సంప్ర దాయంగా ఏర్పడి చివరకు వారి భాషలోనే ఆ ప్రయత్నాలు చేయడం మొదలుబెట్టి ఉంటారు. ఆ ప్రయత్నాలే కవిజనాశ్ర

యంగా ఆంధ్ర శబ్దచింతామణిగా రూపులెత్తి చివరకు 11 వ శతాబ్దంలో నన్నయభట్టు మూలాన భారతమునే బృహ ద్రూపాన్ని ధరించి ఉండవచ్చు. లిపి, ఛందస్సు ఇత్యాది సాహిత్య మర్యాదలన్నీ కన్నడ భాషవే. నారాయణభట్టు సహాధ్యాయుడుగా ఉండడం తదితర పరిస్థితులూ వితర్కిస్తే ఆంధ్రసాహిత్య జన్మస్థానం కన్నడ తెలుగుదేశ సరిహద్దు ప్రాంతాలను తీసుకోవచ్చు. నన్నయకూడా అట్లాగే బళ్ళారి అనంతపురం ప్రాంతాలవాడు కావచ్చు. రాజరాజనరేంద్రుని ఆహ్వానం పుచ్చుకొని సహాధ్యాయుడితో సహా భారత రచనా నిర్వహణకు బయలుదేరిపోయి ఉండవచ్చును-పైగా ప్రాచీ నాంధ్రకవులంతా కన్నడ సాహిత్య వేత్తలు కావడం గుర్తిం చాలి: పాల్కురికి సోమనాథుడు, యథావాక్కుల అన్న మయ్య ఇత్యాదులు. అందుచేత నన్నయనుంచి అన్నయ (బెండపూడి) వరకు దక్షిణంనుంచి ఉత్తరానికి వెళ్ళడమే తెలుగుదేశంలో జరుగుతూ వచ్చిన చారిత్రిక పరిణామము. ఈ యావత్తు సామగ్రిని మన విశాలదృక్పథ వలయంలోకి తెచ్చుకుంటే శ్రీనాథుడు కృష్ణా మండలంలో బందరు ప్రాంతీ యుడు కాని కొండవీడువాడు కానీ కాజాలడనీ, కేవలం కర్ణాట దేశస్థుడు అనీ, మాత్రమే విదితం అవుతుంది.

కర్ణాట దేశస్థుడయిన శ్రీనాథుడు నెల్లూరు మండ లము వాడనడానికి చాలా సామగ్రి ఉంది. ముఖ్యమయి నవి శ్రీనాథుని బాల్యసఖులు అవచితిప్పడు నెల్లూరివాడు అనడానికి "సింహ విక్రమ పట్టణ శ్రేష్ఠుడయిన, శెట్టిజగజెట్టి పావాణిశెట్టి" (హరవిలాసం) మనుమడు కావడం ప్రబల

కారణం. హరివిలాస ప్రతిపాదితవిషయాలు తిప్పడు నెల్లూరి వాడని సూచిస్తాయి గానీ కాంచీపురీయుడని గానీ, కొండవీటి వాడని గానీ కాదు. కంచిలో సత్రాలు, తటాకాలు కట్టించి నంత మాత్రాన ఆ పూరివాడనడం సమంజసంకాదు. సింహాచలంలో కృష్ణదేవరాయలు నెలకొల్పిన జయస్తంభం ఉందని ఆయన శ్రీకాకుళం వాడంటామా ? వేమభూపాలుడు శ్రీశైలానికి మెట్లు కట్టించాడని ఆయన జన్మస్థలం అదే నంటామా ? అట్లాగే ఇదీ కూడా. ఆనాడు తూర్పు ప్రాంతంలో ఉదయగిరి కంటే కంచి, కొండవీడులే సుప్రశస్త నగరాలు. కంచి ద్రావిడ రాజ్యపీఠమై శైవ, వైష్ణవ మత కూటమై అశేష జగజ్జన ప్రవాహ సంగమంగా విలసిల్లితే కొండవీడు దేవేంద్ర భోగాలతో అఖండ సాహిత్య కల్ప వల్లిగా విరాజిల్లేది. అందుచేత ద్వీపాంతరాలతో విస్తారంగా సుగంధ ద్రవ్య వ్యాపారం చేస్తూ ఉండిన సింహవిక్రమ పట్టణ శెట్టి కుల రత్నము తిప్పయకూ, ఆయన పూర్వులకూ యీ రెండూ, వ్యాపారశాఖా నిలయాలుగా ఉండవచ్చు. కొండవీటికి శ్రీనాథ అవచి తిప్పయలు నెల్లూరునుంచే వృత్తిరీత్యా వచ్చారనటమే సమంజసం. అసలు కొండవీటి రెడ్డిరాజులే నెల్లూరివారు అనుట నిర్వివాదము గదా ("దువ్వూరు గండవ రాళి" భీమఖండం) ఆ రాజులే నెల్లూరునుంచి కొండవీటికి వచ్చినవారు కాగా శ్రీనాథుని సంగతి చెప్పనక్కరలేదు.

తరువాత శ్రీనాథ పోతనల బాంధవ్యం కథా ప్రాయముగా కొందరు తీసివేశారు. ప్రస్తుత పరిశోధనా ధోరణిలో

ఇది పరిపాటి అయింది. కానీ తరువాత ఆ కథలే నిజమని మళ్లీ ఒప్పుకుంటున్నారు. మొదట తెనాలి రామకృష్ణుడు రాయల కాలంవాడు కాడని తరువాత ఆ కాలం వాడేనని ఒప్పుకున్నారు. నెల్లూరు, కడప మండలాలకు వివాహ సంబంధాలు ఈనాటికీ ఉన్నాయి. ఇది అట్లా వుంచి భాగవత కృత్యాది పద్యాలు సనిమర్శంగా పరిశీలించడం అవసరం. అందులో ఏదో తీవ్రమైన కడుపుమంట వెళ్ళగ్రక్కినట్లుగా పోతన ప్రభునింద చేశాడు. "హాలికులయిననేమి" అన్న పద్యంలో తనకూ, తన ప్రభులకూ ఉన్న ఘర్షణ సూచితమయింది గదా. పైగా అట్టి కిరాటులకూ, కావ్య కన్యలను బలత్కారించే కీచకులకూ అమ్మనన్నాడు భారతిని. "కర్ణాట కిరాట కీచకుల కమ్మ త్రిశుద్ధిగా నమ్మ భారతీ" అన్న వాక్యం ఎంతో ముఖ్యమయిందిగా భావిస్తాను. పోతన కర్ణాట దేశస్థుడైయుండి ఆ దేశపు కవులంతా ఆ ప్రభువులకే తమ కావ్యాలు అంకితంచేసి మన్ననలందుకొంటూ ఉండగా పోతన ఏదో కారణాలవల్ల ఆ పరిస్థితులను గర్హిస్తూ ఎదుర్కొంటు న్నట్లుగా చెప్పిన మాటలేగదా యివి – అంటే పోతన కూడా శ్రీనాథుడి లాగా కర్ణాట దేశస్థుడని విదితమవుతూ వుంది. ఓరగల్లు సమీపాన బమ్మెర అనే గ్రామం ఉన్నంత మాత్రాన, పోతన తెలంగాణావాడు కాలేడు. అసలు గ్రామం వదిలిన తరువాతనే ఆ గ్రామం ఇంటిపేరు అవడం లోక పరిపాటిగా చూస్తున్నాము. పైగా ఓరగల్లు అన్న పేర్లు తెలుగు దేశంలో అనేక ప్రాంతాల్లో ఉన్నాయి. కడప మండలం లోనే కాదు, నెల్లూరు జిల్లా గూడూరు సమీపాన కూడా

వరగలి అని ఒక గ్రామం ఉంది. దాని కేమంటారు? ఇదంతా చూస్తే శ్రీనాథ పోతనలు నెల్లూరు, కడపల వారని వారికి బాంధవ్యం ఉందని అనడమే సమంజసంగా కనిపిస్తుంది.

తన నాచికేతూపాఖ్యానాన్ని కనిగిరిసీమ నేలిన కర్ణాట రాజ ప్రతినిధికి మంత్రియైన గంగనామాత్యుడికి అంకితంచేసిన నెల్లూరు ప్రాంతీయుడు దుగ్గన శ్రీనాథుని బావమరది. పోతే శ్రీనాథుని సమకాలికుడని, శిష్యుడని తనశృంగార శాకుంతలాన్ని శ్రీనాథుడికి చదివి వినిపించాడు. పండితులు చెప్పే పిల్లలమర్రి పినవీరభద్రుడు నెల్లూరుజిల్లా, బిట్రగుంట నివాసి (స్టేషన్ కాదు). అక్కడికి మూడూ, నాలుగుమైళ్ళ దూరంలో ఉన్న సోమరాజుపల్లి ప్రభువుకు తన కావ్యం అంకితం చేశాడు. ఆ కావ్య పీఠికలోనే యీ రెండు గ్రామాలను విస్తారంగా ప్రస్తావించాడు. పూర్తిగా శ్రీనాథుడి పద్యాలను వాడుకున్నాడు. "ఘుసిమీరన్" అన్న హరవిలాస పద్యంలోని "ప్రక్రియావ సరోదంచిత సార సౌరభ రసవ్యాలోల రోలంబముల్" అన్న సమాసాన్ని ముచ్చిలించాడు. "నెట్టుకొని కొల్తు" అన్న భీమఖండంలోని కందపద్యాన్ని "ఇట్టలమగు" అనే పద్యంగా కొద్ది సవరణలతో అదే సందర్భంలో అదే పనికోసం వాడుకున్నాడు. ఇట్లా వందలాది ఉదాహరణలను చూపించవచ్చు. శృంగార నైషధాన్నిచూసి, శృంగార శాకుంతలం అన్నాడు. శ్రీనాథునిశిష్యుడే అనిపించాడు. ఈ సంబంధాలన్నీ శ్రీనాథుడు నెల్లూరి వాడనడానికి బలవర్థకంగా ఉన్నాయి.

తరువాత క్రీడాభిరామం లో వల్లభామాత్యుని వాగ్వైఖరులను వర్ణిస్తూ "నెల్లూరు తూము కాలువ, హల్లకముల

కమ్మతావినపలాపించుచున్" అన్నాడు. వల్లభామాత్యుడు నెల్లూరువాడు కాదు. "మోపూరు పాలించే ముల్కినాట" "ముదమున ముల్కినాటి పురమోహన రత్న..." ఆయన కడపవాడు. మరి శ్రీనాథుడు నెల్లూరువాడు కాక వల్లభామాత్యుడూ నెల్లూరువాడు కాకపోతే యీ నెల్లూరి తూము కాలువ ప్రసక్తి ఎందుకువచ్చింది? ఏలూరు తూము కాలువ నాళీకము కమ్మతావి అనగూడదూ? శ్రీనాథుడు నెల్లూరివాడు కావడం చేతనే ఆ ప్రస్తావన వచ్చింది అనడమే సమంజసంగా ఉంటుంది.

మరొకటి - హరవిలాసంలో "పెన్నకు విన్నదనంబు దోప" అన్నాడు. పెన్న ప్రశంస పూర్వగ్రంథాల్లో ఎక్కడా వచ్చినట్లు గోచరించలేదు. అతి స్వల్పమైన నది అవడంచేత కృష్ణా, గోదావరీ, తుంగభద్రలకే పురాణ ప్రశస్తి లభించింది. ఒక్క అరణ్య పర్వంలో మాత్రం పెన్న ప్రశంస వచ్చింది. ఇంత అప్రశస్తమయిన పెన్నను గ్రంథస్థం చేయడం ఆ ప్రాంతం వాడవడంచేత అభిమానంచేతనే అనుకోవచ్చు. నెల్లూరుమండల గుడ్లూరు గ్రామవాసి యయిన వెన్నెలగంటి సూరన తన విష్ణుపురాణంలో యింకా అప్రశస్తమయిన మన్నేరును కీర్తించాడు.

తరువాత శ్రీనాథుని కావ్యాల్లో భాషను చూస్తే ఆ ప్రాంతపు మాండలికాలు చాలా కనిపిస్తాయి. మచ్చుకు ఒకటి - శనగబేడలు అని వాడాడు. బేడలు ఆ ప్రాంతంలో పప్పు అన్న పదానికి బదులుగా వాడుతారు (బేడలు కన్నడ పదం).

ఇవన్నీ విశాల దృష్టితో చూస్తే శ్రీనాథుని జన్మ స్థలం నెల్లూరు అనడమే సమంజసంగా తోస్తుంది. అయితే మహాకవులు ఏవూరి వారయితేనేమి వారువిశ్వజనీనులు. వారి ప్రతిభకు దేశం, భాష, కులం ఇత్యాది అవధులు లేవు. పైగా శ్రీనాథుడు అందరు కవులవంటివాడు కాదు. పుట్టిందెక్కడయినా యావదాంధ్ర దేశాన్ని సంచరించి, జయించి, జీర్ణించుకున్న విశాలాంధ్రమూర్తి. జీవితమే సాహిత్యం అన్న మాట సత్యమయితే అది యీ మహాకవి విషయంలో నూటికి నూరుపంతులు సత్యమవుతుంది. అట్లాంటి మహాకవులను ప్రాంతీయాది సంకుచిత దృషితో పరిమితం చేయడం అపచారం.

—o-

# కర్ణాటాంధ్ర సాహిత్యసేతువు



కన్నడ తమిళ వాఙ్మయ విశేషాలు చదివినా తెలుసు కున్నా, ఆధునిక రాజకీయవాదులచేత స్వప్రయోజనాలకోసం కృత్రిమంగా కల్పించబడిన భాషావైషమ్యాలు అంతరించి ప్రజలకు ప్రజలకు మధ్య సామరస్య సుహృద్భావాలు వ్యాపిస్తాయి. ఆ లాభమే కాకుండా అంతకంటే ఉత్కృష్టమైన మరొక లాభంకూడా కలుగుతుంది. అదేమిటంటే ఇటీవల ప్రబలిన "ఆంధ్రులే గొప్పవా"రనే జాత్యహంకారము నశించడం – ఈ అహంకారం మన కేలాటి లాభాన్ని కలిగించక పోగా, సత్యానికి విరుద్ధంగా ఉండడమేగాక, యితరులకు హాస్యాస్పదంగా ఉండడమూగాక, మనం గొప్పవారము కాము అనుకున్నందువల్లవచ్చే లాభాలకు దూరం చేస్తూ ఉంది. దురహంకారము వ్యక్తికి ఎట్లావాంఛనీయం కాదో, జాతికికూడా అట్లాగేకాదు. ఉభయత్రా అది అశుభాన్నే కలిగిస్తుంది. గొప్పవాడుగా ఉన్న ప్రతివాడూ మనవాడే అని చెప్పుకోవడం, యితర ప్రజలు మనకంటే తక్కువవారను కోవడం నాగరకతకూ సంస్కారానికీ విరుద్ధమైన లక్షణాలు. కుమారిలభట్టు మావాడు. ఎందుచేత? గంజాం జిల్లాలో పుట్టాడుకనుక, కానీ ఆకారణంచేతనే ఆయన తెలుగువాడనుకో వడానికి ఎంత అవకాశం ఉందో, ఒరియావాడను కోవడానికి అంత అవకాశమూ ఉంది. తెలుగువాడు కాకపోతే ఆయన గొప్పతనం అంగీకరించకూడదా? జీససు తెలుగువాడుకాదు,

బుద్ధుడు, ఆదిశంకరుడు, ఐన్‌స్టీను, కృష్ణుడు, రాముడు వీరెవ్వరూ తెలుగువారు కారుగదా! వాళ్ళు గొప్పవారు కాదనుకోవలసిందేనా? ఈ దృక్పథం అక్కడికి వెళ్ళుతుంది మరి!

శ్రీ ఓేకుమళ్ళ రాజగోపాలరావుగారనే ఒక మహనీయుడు హార్వే, రస్సెల్, ఎంథోవెన్, మొదలైన పాశ్చాత్య పండితులు సేకరించిన విలువైన చారిత్రకసామగ్రిని తీసుకుని ఒక విచిత్రవాదం లేవదీశారు. వారి సామగ్రిని అంగీకరించగలిగానుగానీ వారు ఆ సామగ్రిని వాడుకున్న పద్ధతిని అంగీకరించడం అసాధ్యంగాఉంది. శ్రీరాముడుఆంధ్రుల దౌహిత్రుడనీ, తెలుగు, దేవతలు మాట్లాడే భాష అనీ, యావత్ప్రపంచ భాషలకూ మూలమనీ వారి వాదం. అంతదూరం వెళ్ళితేగానీ వారిఆత్మ శాంతించలేదు. కోసల దేశాలు రెండు అట. ఒకటి ఉత్తర కోసలము, రెండు దక్షిణ కోసలము. ఉత్తరకోసలరాజపుత్రికయే కౌసల్య అయినట్లయితే కోసలరాజైన దశరథుడు చెల్లెలిని వివాహమాడి నట్లవుతుంది గనుక, దక్షిణకోసలరాజపుత్రి కౌసల్య అనీ, ఈ దక్షిణ కోసలము దండకారణ్య మధ్యంలో ఉందనీ, అది ఆంధ్ర దేశమనీ, అందుచేత కౌసల్య పుట్టిల్లు తెనుగుదేశం కాగా శ్రీరాముడు ఆంధ్రుల దౌహిత్రుడయ్యాడు! సుమేరు ప్రాంతంనుంచి ఆర్యులకు పూర్వం ఐరోపాకు ఇండియాకు వలస వెళ్ళిన తెగ పశ్చిమాన ట్యూటనులనీ, ఇండియాలో తెలుంగులనీ పిలువబడ్డారనీ, ఉభయ ప్రజల భాషాచారాది వ్యవహారాలకూ చాలా పోలికలున్నాయనీ ఆ పురాతన సమష్టి జాతికి తెలుంగమూర్తి అనేవాడు దైవతము అనీ వారు సిద్ధాంతం చేశారు. ఇంకా

విశేషమేమిటంటే—"అరవము పుట్టకమునుపు తెలుంగులు గోండులు ఏ భాషమాటలాడిరో, తెలుంగమూర్తికి సంబంధించిన యీ భాషయే మన ప్రాచీన భాష. అదియే వేదము నాటి సాంస్కృతికులకును, జెండులకును' గ్రీకులాటిన్లకును మొదటి మాతృభాష. అదియే ట్యూటనులకును ఆదిమ భాష. ఈ విధముగా ప్రపంచమంతటా వ్యాప్తిగాంచిన దేవతాభాష మేరువు పర్వతమున పరమేశ్వరునిచేతను, దేవతలచేతను, ఋషుల చేతను మాటలాడబడిన పవిత్రభాష, మన తెలుగు భాషయొక్క ప్రథమ స్వరూపమే"—ఇదీ వారు తెలుగుభాషకు కల్పించిన చరిత్ర. పైగా ఈ చరిత్ర, వారి ప్రకారం, పరశురామ, వశిష్ఠ విశ్వామిత్రులు పుట్టక పూర్వం, పదునైదువేల యేళ్ళకు తక్కువగాని కాలమునాటిది. ఇంత ప్రాచీనతను కల్పించడం ఆంధ్రుల అహంకారాగ్నికి ఆజ్యాహుతి అవుతుంది. ఈ జాత్యహంకారానికి హిట్లరుగారి జాత్యహంకారానికి తేడా ఏమీఉన్నట్లు కనుపించదు. జననిని జన్మభూమిని ప్రేమించడంలో తప్పేమీ లేదుగానీ, మన జననీ మన జన్మభూమి యీ రెండే ప్రపంచంలోని అందరు జననులు అన్ని జన్మభూములకంటె గొప్పవి అనుకోవడం మాత్రం శ్రేయస్కరం కాదు. మన తెలుగుతల్లి అనీ, అమరావతీ పట్టణమున ఏదో చేయునాడూ, ఏదో జెండాలు ఎత్తునాడూ, ఉడుకు రక్తము పారించునాడూ ఇత్యాది పదజాలంతో మనమే జగదేక వీరులమనీ మన దగ్గరనుంచే అందరూ పాఠాలు నేర్చుకున్నారనీ ప్రగల్భపూరితంగా విశాలవిశ్వజనీనదృష్టికి విరుద్ధంగా కవులుకూడా ప్రారంభించారు. ఇప్పుడు ఎలిమెంటరీ

స్కూలు పుస్తకాల దగ్గరనుంచీ పండితగోష్ఠి ప్రసంగాలవరకూ యిదే వరస. ఈ అధమ అనాగరక పామర ధోరణి ఎంత త్వరగా అంతరిస్తే తెలుగువారికి అంత మంచిది. ఇందుకు మొదటి చర్యగా విజ్ఞానులైన రచయితలు ఈ ధోరణి వదలి పెట్టాలి. చారిత్రక సత్యాలను ప్రచారం చెయ్యాలి.

తమిళ కన్నడ తెలుగు ప్రజలు యించుమించు ఒకే కుటుంబమువా రంటేనే సత్యం అవుతుంది. దక్షిణ దేశంలో నివసించే జాతులు ఈ మూడేకాదు. కానీ చరిత్ర ఉన్నవి మూడు మాత్రమే. కొంకిణి తుళు వగైరా భాషలు మాట్లాడే వారు సవరలు, గదబలు, ఎరుకలు, యూనాది, కత్తెర, కోయ వగైరా జాతి ప్రజలుకూడా ఈ కుటుంబం వారేకానీ వాంకి చరిత్రలేదు. అంతే తేడా. చరిత్రఉంటేనే లెక్కలోకివస్తారు. ఆ కారణంచేతనే ఎంత ప్రాచీనచరిత్ర ఉంటే అంతగా లెక్కలోకి వస్తారు. ఈ పద్ధతినిబట్టి చూస్తే మన తెలుగువారు కొంకిణి, తుళు వగైరా ప్రజలకంటె పెద్దవారే అయినా తమిళ కన్నడ ప్రజలకంటె పిన్నవారే అవుతారు. తమిళులకు తక్కినవారందరికంటే ప్రాచీనమైన చరిత్రఉంది. కన్నడుల చరిత్ర తర్వాత ప్రారంభించింది. ఆ తర్వాత తెలుగువారు. మనకు వాఙ్మయం సుమారు క్రీ. శ. 11 వ శతాబ్దంనుంచి ప్రారంభంకాగా, కన్నడులకు క్రీ. శ. 4, 5 శతాబ్దములనుంచే ప్రారంభించింది. మనకుకూడా నన్నయ పూర్వం ఒకటి రెండు శతాబ్దములనుంచీ వాఙ్మయముండే దనడానికి ఆధారాలున్నప్పటికీ, 11 వ శతాబ్దంనుంచే గ్రంథాలు లభ్యమవుతున్నట్లు,

కన్నడలకు కూడా 4, 5 శతాబ్దాలనుంచీ వాఙ్మయం ఉన్నట్లు ఆధారాలున్నప్పటికీ 8 వ శతాబ్దినుంచే గ్రంథాలు దొరుకు తున్నాయి. మనకు నన్నయ భారతంలాగే వారికి దొరికిన ప్రాచీన గ్రంథం 8 వ శతాబ్దికి చెందిన నృపతుంగ విరచిత మైన కవిరాజమార్గం అనే లక్షణ గ్రంథం. మరొక శాసనం ఆధారంగా 5 వ శతాబ్దంలో సమంతభద్రుడనే కవి శబ్దావ తారం, జినేంద్ర వ్యాకరణం, పాణినీయటీక యిత్యాది గ్రంథాలు వ్రాశాడని తెలుస్తూ ఉందిగానీ, అవేవీ దొరక లేదు. ఈవిధంగా కన్నడ వాఙ్మయం మనకంటె నాలుగయిదు వందల యేళ్ళకు పూర్వమే ప్రారంభమయింది. తమిళ వాఙ్మయం యింకా ప్రాచీనం. క్రీస్తుకు పూర్వమే ఉందట. సంస్కృతానికంటె ప్రాచీనమనికూడా కొందరు పండితుల అభి ప్రాయం. దక్షిణాన మన రాజ్యాలేవీ లేనప్పుడు కూడా చేర చోళ పాండ్య రాజ్యాలున్నాయి. అందుచేత తమిళులు కన్న డులు మనకంటె చారిత్రక వయస్సులో ఎంతో పెద్దవాళ్ళని విశదం అవుతూ ఉంది. అట్లాంటప్పుడు మనం అందరికంటె పెద్దవాళ్ళం అనుకోవడం, అంతటితో పూరుకోక కవిత్వాలు వ్రాయడం, ఉపన్యాసాలు చేయడం, పసిపిల్లలకు కూడా ఈ విషయమే నూరిపోయడం ఎంత అవివేకమో, ఎంత అప కారమో ఆలోచించాలి.

ఇంకా విచిత్రమేమిటంటే మనకంటె కన్నడులు పెద్ద వాళ్ళవడమేగాక, వాళ్ళదగ్గరనుంచే మనం యించుమించు అంతా నేర్చుకున్నాము. దురభిమానంచేత మనపండితులు కన్నడాన్ని సోదరభాష అంటారే కాని,-కన్నడంనుంచి సర్వ

స్వమూ గ్రహించిన తర్వాత ఆ భాషను మాతృభాష అన్నా తప్పులేదని నా అభిప్రాయం (మనకు కాదు, మన భాషకు) చాళుక్యులు ఎక్కడనుంచి వచ్చినా ఎవరైనా కన్నడదేశాన్ని చిరకాలంగా పరిపాలించి, కన్నడ వాఙ్మయాన్ని ప్రేమించి పోషించి వర్ధిల్లజేసినవారు. మనదేశానికి పరిపాలకులుగా వచ్చే నాటికి కన్నడులు అంటే తప్పేమీలేదు. ఆ భాషను మాట్లాడి ఆ భాషను వెంపొందింపజేసి ఆ ఆచార వ్యవహారాలను అవలంబించిన వారిని కన్నడులనవచ్చు. అందుచేత మనదేశంలో కుబ్జవిష్ణువర్ధనుడితో ప్రారంభమైన చాళుక్య పరిపాలన కర్ణాటక పాలన అనవచ్చు. తర్వాత కొద్దిపాటికాలం కాకతీయుల మూలంగా తప్ప తదితరకాలమంతా మహమ్మదీయులు వచ్చే వరకూ తెనుగుదేశం కన్నడ పారిపాలనక్రిందనే ఉండేది. రెడ్డి రాజులకాలంలో ఉత్తర గుంటూరు మండలంనుంచి సింహాచలంవరకూ కన్నడ పాలన లేకపోయినా అది స్వల్పకాలమే. తర్వాత మళ్ళీ శ్రీకృష్ణదేవరాయలు స్వాధీనం చేసుకోవడంతో ఆ ప్రాంతం మళ్ళీ కన్నడుల క్రిందకు వచ్చింది. ఈ సుదీర్ఘ కాలంలో జరిగిన తెలుగుచరిత్ర అంతా ఏమిటంటే కన్నడులు నేర్పడం మనం నేర్చుకోవడం ఇంతే. మనకేలాటి వాఙ్మయమూ లేనప్పుడు మన నాగరిక తరగతి ప్రజలంతా కన్నడమే నేర్చుకునేవారు. అందులో విద్వాంసులై కవిత్వాలు చెప్పేవారు. గ్రంథాలు వ్రాసేవారు. కన్నడంలో భారతం వ్రాసి ఆదికవి అని ప్రసిద్ధిపొందిన కన్నడవాఙ్మయానికి మూలస్తంభమైన పంపకవి తెలుగువాడు. వేంగి మండల వాస్తవ్యుడు. అట్లాగే శాంతిపురాణ మనే గొప్ప జైనకావ్యం

వ్రాసిన పొన్నమహాకవి కూడా వేంగీమండలంనుంచి కన్నడ దేశం వెళ్ళినవాడే. వీరిద్దరూ కన్నడ వాఙ్మయానికి ఎంత ముఖ్యమంటే మన కవిత్రయంలాగే కన్నడంలో ఉన్న రత్న త్రయంలో యిద్దరు ఈ పంప పొన్నలు (మూడవవాడు రన్న) ఒకవిధంగా యిది మనవారు కన్నడానికి చేసిన మహోత్కృష్ట మైన సేవ అనవచ్చుకూడాను. వేంగీ మండలంనుంచి కన్నడ దేశం వెళ్ళి ఛందోంబుధి అనే లక్షణగ్రంథాన్నివ్రాసి, కన్నడ భారతి సేవచేసిన మరొక తెలుగువాడు నాగవర్మ. మరొక నాగవర్మ (1120) కూడా వేంగీనుంచి వెళ్ళి కావ్యాలోకన, కర్ణాట భాషాభూషణ అనే లక్షణ గ్రంథాలు వ్రాసి కన్నడ వాఙ్మయ చరిత్రలో సుస్థిర స్థానం గడించాడు. ఇట్లా వీరంతా కన్నడం నేర్చుకుని, కన్నడంలో విద్వాంసులై గ్రంథాలు వ్రాసి ఆ దేశం వెళ్ళడం ఆనాటికి మనకు వాఙ్మయంలేదనీ, అప్పటికి రాజకీయ వైజ్ఞానిక వ్యవహారాలకు మన నాగరక వర్గాలు కన్నడాన్నే వాడేవారనీ విశదంచేస్తుంది. అప్పటి మన తెలుగువారి స్థితి యిప్పటికీ కొందరికి ఉంది. కొంకణి, తుళు భాషలు మాట్లాడే ప్రజలకు కన్నడమే శరణ్యం. ఇంట్లో మాత్రం వారి భాష మాట్లాడుకుంటూ నాగరిక ప్రపంచంలో ప్రవేశించేసరికి తెలుగు మాట్లాడుతారు. ఎందుచేతనంటే వారికి లిపి వాఙ్మయం లేకపోవడంచేత. అవి ఎందుచేత లేవు అనే విచారణ ఈ సందర్భానికి అనవసరం. ఆనాటికి తెలుగు వారు కన్నడులతో కలసి సమష్టి కుటుంబంగానే వ్యవహరిస్తూ వారి వాఙ్మయం, సంప్రదాయం, వైభవం తమవిగా భావిస్తూ వాటి అభివృద్ధికి దోహదం చేస్తూ ఉండి ఉంటారు. తర్వాత

క్రమంగా తెలుగువారుకూడా "యుక్తవయస్కులై" సొంత వాఙ్మయం సృష్టించుకో నారంభించారు. స్వయంకృషి ప్రారంభమయిననాటి నుంచి కన్నడులనుంచి నేర్చుకున్న భాషా సంప్రదాయాలు వాడుకుంటూ వారి లిపినే తీసుకుని కావ్యాలు, శాస్త్రాలు నిర్మించడం మొదలు పెట్టారు. ఆచార వ్యవహారాలమాట అటుంచి వీటన్నిటినీ ప్రతిఫలింపజేసే వాఙ్మయం తీసుకుంటే కన్నడులనుంచి మనవారు ఎంత సామగ్రి తీసుకున్నారో తెలుస్తుంది.

ఛందస్సు యావత్తు వారిదే మనం తీసుకున్నామంటే సాహసంకాదు. అక్కర, ద్విపద, షట్పద, గీతిమంజరి యిత్యాది జాతులు తెలుగు వాఙ్మయం ఉదయించక పూర్వం నుంచీ కన్నడ వాఙ్మయంలో ఉన్నాయి. సీసము, తరువోజమాత్రం తెలుగువారి వనుకోవచ్చు. ఉత్పల, చంపక, మత్తేభ, శార్దూలాది సంస్కృత వృత్తాలన్నీ ఆంధ్ర వాఙ్మయావిర్భావపూర్వం నుంచీ కన్నడ వాఙ్మయంలో ఉన్నాయి. కన్నడ వృత్తాల్లో ప్రాసనియమ మొకటే పాటింప బడి ఉండగా, మనకు శబ్దశాసనుడు యతినియమం ఒకటి అధికంగా ప్రవేశపెట్టాడు. ఇట్లాంటివే ఒకటి రెండు స్వల్పమైన మార్పులతో ఆ ఛందస్సే మనంతీసుకున్నాము—ఉదా: కన్నడ క్రౌంచ పద వృత్తానికి 25 అక్షరాలైతే, దానికి తెలుగులో 24. ఇట్లాంటి స్వల్పమార్పులు) 902 ప్రాంతంవాడైన పంప మహాకవి వ్రాసిన భారతంలో మంచి ఉదాహరణకు ఉత్పల మాలా వృత్తం—

"వ్యాస మునీంద్ర రుంద్ర వచనామృత వార్ధియ
నీసువెంకవి బ్యాసనె నెంబగెర్భ మెనగిల్ల గుణార్ణవ నోళ్ను
మన్మనోవాసమదాగ" యిత్యాది.

అట్లాగే ఏ తద్భారతంలోని చంపకమాలా వృత్తం ఒకటి—

"కతెసిరిదాదొడం కథమె మెయ్ గిడలీయ దెనుం
సమస్త భారతమున పూర్వమాగెసలెపేర్ద కవీశ్వరెల్ల వర్ణ
కం కతెమె..." యిత్యాది.

అందులోనిదే మత్తేభ విక్రీడితం.

"సురలోకం దొరె కొళ్ళొనొంచు పరమ శ్రీలక్ష్మి
యుం బర్పదాదరిదిం దేవ నికాయుం దొళు నెరవు దొందు
త్సాహమేతన్నమెయ్"...

ఇట్లాగే—

వెనకచెప్పిన కందాది జాతుల కుదాహరణం, క్రీ. శ. 9 శతాబ్దపు నృపతుంగుని కవిరాజమార్గం నుంచి ఒకకందం.

"మిగె కన్నడ కబ్బంగళో
ళ గణితగుణ గద్యపద్యసమ్మిశ్రితముం
ళ గది సువర్ణకథా
ప్రగీతియుం తచ్చిరంతనాచార్యర్కళు"—

8, 9 శతాబ్దాలనాటికే కన్నడంలో గ్రంథ రచనా వ్యవసాయం ధారాళంగా సాగుతూ ఉండడమూ, అందులో కందాది జాతులూ, ఉత్పలమాలాది వృత్తాలు బహుళంగా వాడబడుతూ ఉండడమూ, ఆ తర్వాత సుమారు 150 సం.లు గానీ తెలుగులో వాఙ్మయం బయలుదేరకపోవడం యిత్యాది

పరిస్థితులు చూ స్తే నన్నయ భట్టారకునికి నారాయణ భట్టు
 సిన సహాయం కన్నడంలోని ఛందోలం కారాది సాహిత్య
క్రియలను తెలుగులోకి తెచ్చుకొని వాడుకోవడంలోనే అయి
ఉంటుందనుకోవలసిందే తప్ప, అన్యథా భావించడానికి వీలు
లేకుండా ఉంది ఇట్లా అన్య భాషలనుంచి సామగ్రి తెచ్చు
కోవడం న్యూనత అని నా అభిప్రాయం ఎంతమాత్రం కాదు.
కానీ ఏరుదాటి తెప్పతగలబెట్టే బుద్ధి పనికిరాదని మాత్రమే
ప్రకృతార్థం.

ఇక గ్రంథరచన భాషావిశేషాలు తీసుకుంటే, దాదాపు
శ్రీనాథుడి కాలంవరకూ మనవారు కన్నడ కవులచే అనుస
రించారు. ఉభయ వాఙ్మయాలనూ పరిశీలించిన మన పండి
తులు, నన్నయభట్టు తన భారత రచనకుగాను అంతకుముందు
150 సం॥కే కన్నడంలో వ్రాయబడిన పంపరన్నల భారతా
లను సవిమర్శగా చూచి ఉంటారనీ, అందులోని ధోరణులు
కొన్నిటిని అవలంబించాడనీ అభిప్రాయ పడుతున్నారు. అందు
చేత మన కావ్యాలను వాటి సంస్కృత మాతృకలతో పోల్చి
పరిశీలించడం యింతవరకూ పరిపాటి అయితే యికమీద
కన్నడ మాతృకలతో పోల్చి పరిశీలించడం ఆధునికాంధ్ర
వాఙ్మయ విమర్శనా పద్ధతిగా నెలకొనాలి.

కృత్యాదిని దేవతాస్తుతి చేయడం కావ్య సంప్రదా
యాల్లో ఒకటిగా ఉంది. నన్నయ భట్టారకుడు రచనారం
భంలో "హరిహరాజ గజాననార్క షడాస్య మాతృ సర
స్వతీగిరి సుతాదిక'' అని దేవతాస్తుతి చేశాడు. ఈ సంప్రదా
యాన్నే హరిహర పద్మగర్భులను'' అని తిక్కన సోమయాజి

తన నిర్వచనోత్తర రామాయణంలో అనుసరించాడు. అట్లాగే కేతనకూడా హరిశంకరా జాదిత్యదంతి ముఖాములను స్తుతించాడు. ఇట్లా కొనసాగిన సంప్రదాయం మనకు కన్నడంనుంచే వచ్చింది. నన్నయకు రెండు శతాబ్దాలు పూర్వుడైన పంప మహాకవి తన భారతంలో నారాయణ మహేశ్వర మార్తాండ మనోజ సరస్వతీ మాతృవినాయకులను స్తుతించాడు. బ్రహ్మను విడిచిపెట్టాడు. అయితే దీన్ని అనుసరించిన మన నన్నయ బ్రహ్మనుకలిపి మనోజుడ్ని వదిలాడు, పంపకవి హరిహరాది స్తవంలో బ్రహ్మను విడిచిపెట్టడంసహేతుకం. సర్వబ్రాహ్మణ మందిరాల్లోనూ, అవిచ్ఛిన్నంగావర్ధిల్లుతున్న దేవతార్చనలో హరిహర ఆదిత్య గజానన మాతృదేవతలను అర్చించడం విధి. దీన్నే పంచాయతం అంటారు. ఈ అర్చనా విధినే కావ్యంలోకూడా సంప్రదాయంగా నెలకొల్పుకున్నారు. ఈ పంచాయతంలో బ్రహ్మలేడు గనుక, పంపకవి బ్రహ్మను తాను చేసిన దేవతాస్తవంలో కలుపలేదు. కానీ నన్నయ ఏకారణం చేతనో కలిపాడు. నన్నయ కలిపాడు కనుక, తిక్కన కూడా అదే అనుసరించాడు. కానీ సంప్రదాయ బీజం మాత్రం కన్నడ వాఙ్మయం నుంచి వచ్చింది. పోతే, శ్లోకంతో కావ్యారంభం చేయడం ఒకటి మనలో కొంతకాలం సాగింది. నన్నయ భారతంలోనూ, తర్వాత "శ్రీరాస్తాం మనుమక్షితీశ్వర భుజాస్తంభే," అని తిక్కన నిర్వచనోత్తర రామయణం లోనూ సాగింది. అయితే నన్నయ తిక్కనలకు మధ్య కాలంలో మత విషయం లోనూ తద్వారా వాఙ్మయ విషయంలోనూ తీవ్రమైన మార్పులు వచ్చి వీరశైవమూ దేశి

మార్గమూ ఉద్ధత స్థాయికి వచ్చేసరికి తిక్కనవంటి మహత్తర వాఙ్మయశక్తి దేశి మార్గంవైపు మొగ్గేసరికి వాఙ్మయంలో నూత్నమార్గాలు నెలకొన్నాయి. ఆకారణంగానే శ్లోక సంప్రదాయం అంతరించింది. అయితే నన్నయతో ప్రారంభమయిన యీ శ్లోక సంప్రదాయం నన్నయకు పూర్వం కన్నడ వాఙ్మయంలో ఉన్నదే. విశేషం ఏమిటంటే కన్నడులు కావ్యం మధ్యలోనైనా సరే దేవతాస్తవం వచ్చినప్పుడు శ్లోకాలు వాడేవారు.

మన ప్రాచీన కవి ప్రయోగాలు కొన్నింటికి మాతృకలు కన్నడంలో ఉన్నట్లు తెలుస్తూ ఉంది. కలకంఠుడు, ప్రాణగొడ్డము,ముల్లోక విభుడు,యిత్యాది ప్రయోగాలుశాస్త్ర విరుద్ధమనీ, గ్రామ్యాలనీ పండితులు చెపుతారు. కానీ ఉభయ భాషా పరిశీలన జరిగిన తర్వాత వాటి పుట్టుపూర్వోత్తరాలు అర్థమయినాయి. కన్నడదేశంలో వీరశైవం విజృంభించిన తర్వాత తద్భవాలనుదేశ్యాలను సంస్కృతంతో సమసించడం విరివిగా జరిగింది. అయితే వీరశైవ వాఙ్మయం కన్నడ దేశంలో దీర్ఘకాలం సాగి ఒక ప్రబలమైన శాఖగా నెలకొనడం మూలాన ఈ వినూత్న ప్రయోగాలతో కూడిన భాషా పరిణామాన్ని వాళ్ళు హొస కన్నడమనే పేరుతో (నవీన కర్ణాటకం) శాస్త్ర సమ్మతంగా స్వీకరించారు. ఆ సంప్రదాయాన్నే శ్రీనాధుడికాలం వరకూ మనవాళ్ళు బహుళంగా కాకపోయినా కొంతవరకైనా గైకొన్నారు. కానీ 11, 12, 13 శతాబ్దుల కవులు పాల్కురికి సోమనాథుడు

నన్నిచోడుడు ప్రభృతులు బహుళంగానే గైకొన్నారు. అయితే కన్నడ వాఙ్మయ పరిచితి లేక ఆ సంప్రదాయం తెలీక ఆ ప్రయోగాలు శాస్త్ర విరుద్ధంగా తోస్తున్నాయి. పాల్కురికి సోమనాథుడు "పుడమిూశ" అని వాడితే శ్రీ చిలుకూరు నారాయణరావుగారు దాన్ని దోషాల జాబితాలో వేశారు. నన్నిచోడుడు కూడా "పుడమిపుడు" అని వాడాడు కానీ "పొడవిప" "పొడవీశ" అని హళేకన్నడ ప్రయోగా లున్నాయని అధునిక పరిశోధకులు తెలుసుకున్నారు. కన్నడ పదంలోని 'పొడ' పృధ్వికి వికృతి, ఇట్లాగే పాల్కురికి సోమ నాథుడు ముల్లోకసంధ్య, ముల్లోకనాథుడు, శూలకుట్లు, రుద్రాక్షసక్కరలువగైరాప్రయోగాలుచేచాడు. దుర్వాసన్ + ముఖ్యులు = దుర్వాసముఖ్యులేగానిదుర్వాసోముఖ్యులు కాదుఅని శ్రీనారాయణరావుగారు వ్రాశారుగాని, నాచన సోమనాథుడు తన ఉత్తరహరి వంశంలో చతుర్థాశ్వాసం,41 ప. "వనభూమిం బరమోప దేశమున దుర్వాసోమునీంద్రుడు" అని ప్రయో గించాడు. ఇద్దరు ప్రాచీన కవులు భాషావిశారదులు చేసిన ప్రయోగం కనుక వెనుక చెప్పిన సంప్రదాయానుసారంగా వెతికితే ఏదైనా కారణం కన్నడ భాషలో దొరుకుతుందేమో.

మన కవులు వారికున్న విశేష కన్నడ భాషా పరిచితి మూలంగా కన్నడ పదాలుకూడా తమ కావ్యాల్లో వాడారు. "చోళనాళిక కాక క్షోణితలేశ" అని పండితారాధ్య చరిత్రలో ప్రయోగం. కీ. శే. శ్రీ వేటూరు ప్రభాకరశాస్త్రి గారు చోళనాళిక అంటే జొన్నలునాలికతో (జోళ అంటే కన్నడంలో జొన్నలు) అని అర్థం చెప్పారు.

"జొన్నలు గొన్న ఋణంబు నీదగున్" అని నన్నిచోడుడు కుమార సంభవంలో వ్రాసిన దానికి పంప భారతంలోని "జోళమ నెంతు నీగు" లేక రన్నభారతంలోని "జోళదిపారియం" మూలమయి ఉంటుందని శ్రీపాద లక్ష్మీ పతి శాస్త్రిగారు విశదీకరించారు. వారే నన్ని చోడుడు తన కుమారసంభవంలో పంపరన్నల భారతాలనుంచి పద్యాలు తీసుకుని ఆరీతిగానే ఎట్లా తన పద్యాలు కుదుర్చుకున్నారో కూడా చూపించారు. నన్నయ తిక్కనలుకూడా పంప భార తాన్ని వర్ణనా విశేషాల్లోనూ పద్యనిర్మాణంలోనూ బాగా అనుసరించారని కూడా తన పరిశోధనా ఫలితమని చెప్పారు. శాస్త్రిగారు మరొక చక్కటి దృష్టాంతం చెప్పారు. నన్ని చోడుడు "నేలయు నింగియు దాళముల్ వాయింప నెంత మావుల బట్టి బండవలయు" అని ఒక సీస పద్యం కుమార సంభవంలో వ్రాశాడు. అట్లాగే పాల్కురికి సోమనాథుడు, "నెట్టన నేలకు నింగికి సూత్రపట్టమో కాళ్ళను బట్టతలలును" అని వ్రాశాడు. ఇక తిక్కన "నేలయు నింగియు దాళముల్ గా జెసి, మేపునరేగి వాయించి యాడ" అన్నాడు. ఇందరిలో ఉన్న ఈ "నేలయు నింగియు తాళముల్" అనే పద్ధతి నయ సేనుని ధర్మామృతం అనే గ్రంథములో ఉందట. అది, "ధరణి చక్రము వియత్తళముమం గంటిక్కువర్ ముంచ నచ్చరి యప్పంతు," యిత్యాది – ఈ నయసేనుడు 1112 సం. ప్రాంతంవాడు. ఇతడు సమకాలీన కవుల్లో వున్న సంస్కృత పద ప్రయోగమన్న దోషం లేకుండా కావ్యం వ్రాస్తానని ప్రతిజ్ఞ చేశాడు. అచ్చ తెనుగు రామాయణం లాగా అన్న

మాట. తిక్కన సోమయాజిలాగే మార్గాభినివేశం ఉన్న వాడు.

మనవాళ్ళు కావ్యాల్లో వాడుకున్న బిరుదు లన్నీ కన్నడ బిరుదావళినుంచి స్వీకరించినవే. "విజయమోదవంత, హుస బిరుదరగండ, మన్నెవిభాళభీమ, సుజన మనితషోడశ దానమండలేంద్ర, గండరగూళి, గండరగండ, ఇన ద్రోహర గండ-ఇవన్నీ కన్నడ వాఙ్మయం నుంచి తెచ్చుకున్న వే. శివ ద్రోహర గండడు అని పాల్కురికి సోమనాథుడు వాడితే శ్రీ చిలుకూరి నారాయణరావుగారు కన్నడపదంతో సంస్కృతం సమసించాడని దాన్ని లోపాల్లో ఒకటిగా చూపాడు. కానీ ఇది కన్నడ వాఙ్మయ సంబంధం చేత వచ్చిన వాడుక అని చెప్పవలసింది.

కన్నడం నుంచి తర్జుమాగానో, ఆధారం చేసుకనో తెలుగువారు వ్రాసిన గ్రంథాలు చాలా ఉన్నాయి. కెరయ పద్మరసు (1165) కన్నడంలో వ్రాసిన "వీరశైవ దీక్షాబోధ" అనే గ్రంథం ఆధారంగా పిడుపర్తి బసవన ఆ పేరుతోనే ఒక తెలుగు గ్రంథం వ్రాశాడు. పిడుపర్తిసోమన చామరసు కన్నడంలో వ్రాసిన ప్రభు లింగలీల అనే గ్రంథానికి తెలుగు అనువాదం చేశాడు. రట్టకవి (1300) కన్నడంలో వ్రాసిన రట్టమతం అనే గ్రంథాన్ని భాస్కరుడు, అయ్యలార్యుడు అనే కవిద్వయం తెలుగులో పద్య గ్రంథంగా చేశారు. కాల జ్ఞాన వచనాలు మనకు కన్నడదేశం నుంచి వచ్చాయి. సింహాసన ద్వాత్రింశిక, భేతాళ పంచవింశతి. శుకసప్తతి, హంసవింశతి కథలు కన్నడంలో పూర్వంనుంచీ, ఉన్నాయి.

విశేషమేమిటంటే - తెనాలి రామకృష్ణవలె అని మన తెనాలి రామకృష్ణుడి కథలాకూడా ఉన్నాయి. అన్నీ మనం చెప్పుకునే కథలే.

ఈ విధంగా మనవారు ఛందోలంకారాది లక్షణ సామగ్రిని, కావ్య సంప్రదాయాలను, వర్ణనా విశేషాలను, భాషా ప్రయోగాలను, కావ్య వస్తువులను కన్నడం నుంచి తీసుకుని మన వాఙ్మయం నిర్మించారు. (అందుచేతనే శ్రీనాథుడు "నిజము నాది కర్ణాట భాష" అన్నది) ఈ నాటికి కూడా కన్నడుల్లో ఉన్న సాహిత్య పరిణతి మనలో లేదని తత్‌జ్ఞులు అభిప్రాయం. మన దురభిమానానికి అది అనుకూలంగా లేకపోవచ్చు. కానీ సత్యం.

మన వాస్తవ స్థానం గుర్తించడానికీ, మన వాఙ్మయ రహస్యాలు గ్రహించడానికీ. మన దురహంకార వ్యాధి నివారణార్థమూ కన్నడ వాఙ్మయంతో పరిచయం కలిగించుకోవడం అవసరము. అప్పుడప్పుడూ ద్రవిడ కన్నడ ఆంధ్ర భాషావేత్తలు సమావేశమై పండిత గోష్ఠి ప్రసంగాలు జరపడం లాభదాయకం, భాషల పుట్టుపూర్వోత్తరాలు వాఙ్మయ విశేషాలు తెలుస్తాయి, సమరసమైన వినయ వివేక సంపన్నమైన, విశాలమైన విశ్వజనీనమైన సాహిత్యం ఉదయించే అవకాశం కలుగుతుంది.

# గాథా సప్తశతి

"జీవితంలో ఏది విలువైంది?" అనే ప్రశ్నకు భర్తృహరి రెండు పద్యాలు చెప్పాడు లోకంలో రెండు తెగలున్నాయని ఆయన భావం.

ఒకటి :

"జాతి తొలంగుగాక గుణ
శక్తి రసాతల సీమకుం జనుం
గాక కులంబు బూదియగు
గాక నగంబున నుండి శీలముం
బాతము జెందుగాక బహు
భంగుల విత్తమె మాకు మేలు వి
ఖ్యాతగుణంబులెల్ల తృణ
కల్పము లొక్క ధనంబు లేవడిన్"

రెండవది :

నీతిప్రౌఢవిహారులైన నిపుణుల్
నిందింపనీ మెచ్చనీ
ఖ్యాతిం జెందిన సంపదల్, నిలువనీ
గాఢంబుగా సాగనీ
ఘాతం బప్పుడ పొందనీ నియతిమై
గానీ యుగాంతంబునన్
నీతిశ్లాఘ్యపథంబు దప్పరుగదా
నిత్యంబు ధీరోత్తముల్ !

ఒక వర్గం ధనమే ప్రధానమని, రెండవ వర్గం అది కాదు అనీ. రెండవవర్గం ఉత్తమ వర్గంగా పేర్కొన్నాడు భర్తృహరి. అందుచేతనే మరో సందర్భంలో మొదటి తెగ వారిని "నేలతున్కలో నడరు లవంబులో తునియ యందొక మూలకు నాథులైనవా రడలక వైపరీత్యమున హర్షము జెందెద రెంత మందులో" అనీ, "ఈ పంచమహాపట్టణేశుల కపార మదజ్వర మింతయేటికిన్" అనీ తీవ్రంగా ఖండించాడు. పోతే సుమతి శతకకర్త "అధికార రోగపూరిత బధిరాంధక శవము జూడ పాపము సుమతీ" అన్నాడు. నిజంగా అహంకార పూరితులైన ధనవంతులను, అధికారులనుచూస్తే కోపంరాదు గానీ నవ్వొస్తుంది - ఎంత అజ్ఞానులు అని. అయితే అహంకార పూరితులైన విజ్ఞానుల్ని చూస్తే ఏడుపొస్తుంది-విజ్ఞానం వ్యర్థమయిందని.

అర్థమూ, అధికారమూ అన్నదమ్ములు. రావణ కుంభకర్ణుల్లాగ. ఇవి మానవుల్లో మానవత్వంపాళ్ళు తక్కువ ఉన్నవాళ్ళలో ఎక్కువ ప్రకాశించేవి. కోటీశ్వరులు కోట్ల కొలది భూలోకంలో పుట్టారు. పోయారు, కానీ ఒక్కడి పేరు కూడా నిలువలేదు. నీతికిగానూ సామ్రాజ్యం త్యజించిన హరిశ్చంద్రుడి పేరు మాత్రం యింటింటా దీపాంకురమై ఈనాటికీ వెలుగుతూనే ఉంది. అట్లాంటి హరిశ్చంద్రులు ఏ దేశంలో ఎక్కువమంది ఉన్నారు అన్నదే గొప్పతనంగానీ, ఒక జాతి గొప్పతనం కొలవడానికి ఎందరు కలెక్టర్లున్నారు? ఎందరు కోటీశ్వర్లున్నారు! అనే ప్రశ్నగాదు కొలతబద్ద.

మరి ధనం విలువయింది కాకపోతే విజ్ఞానం ఉత్తమ పదార్థమా? అదీ కాదన్నారు. కాదనేది మనకు నిత్యం జీవితంలోనే స్పష్టమవుతూ ఉంది. వారి రచనలు చదివి మనస్సులో ఎంతో గొప్పవారని చిత్రించుకొని దర్శించడానికి వెళ్ళినప్పుడు బ్రహ్మరాక్షసులుగా ప్రత్యక్షం కావడం చూస్తూనే ఉన్నాము. చిత్రమేమిటంటే జమదగ్ని, జాబాలి, అత్రి, భరద్వాజుడు ఇత్యాది ఋషివృషభులుండగా వారు మామూలు మనుష్యులే అయి శ్రీరాముడు మాత్రం దేవుడెట్లా అయ్యాడు? శ్రీరాముడు కవిగాడు, పండితుడు గాడు, శాస్త్రజ్ఞుడు కాడు, వేదవేదాంగ పారంగతుడు కాడు, ఏవీ లేనివాడు గొప్పవాడున్నూ, అన్నీ ఉన్నవాడు మానవ మాత్రుడూనా? ఇందులో ఏదో మర్మముంది. ఆ మర్మమే మానవజాతిపరమార్థం. అదే శ్రీరాముడిలో సమగ్రంగా మూర్తీభవించింది. అట్లాగే వెనుక చెప్పిన హరిశ్చంద్రుడి కాలంనుంచీ ఇప్పటివరకూ మధ్య ఎందరో విజ్ఞానవేత్తలూ, పండితులూ పుట్టివుంటారు. కానీ పురాణం అంటే, హిస్టరీ— వారి నెవరినీ లిస్టులోవేయకుండా హరిశ్చంద్రాదులను గురించే పేర్కొన్నది. వారు లోకోత్తర గుణసంపన్నులనీ – లేకపోతే కర్ణుడు బి. ఏ. చదివాడా, ఎమ్ ఏ. చదివాడా? పెద్ద తత్వవేత్తా లేక శాస్త్రజ్ఞుడా? ఈనాటికీ ఆయన గాథ సమస్త మానవులను పులకిత గాత్రులుగా చేస్తుంది. వినమ్ర శిరస్కులను చేస్తుంది. విజ్ఞానవంతులూ, సంస్కారశూన్యులూ అయినవారిని పురాణం రాక్షసవర్గం అన్నది. పెద్ద పండితుడైనా సద్గుణాలు లేకపోతే బ్రహ్మరాక్షసు డవుతాడట! రావణా

సురుడు పండితుడు, సంగీతవిదుడు, రాజనీతిజ్ఞుడు, వేదవేదాంగ పారంగతుడు, త్రైలోక్యవిజేత. ఎందుచేత రాక్షసుడయినాడు? ఇవేవీ అంతగాలేని శ్రీరాము డెందుకు దేవుడయ్యాడు అని మళ్లీ ఒక ప్రశ్న. హిట్లరుకంటె విజ్ఞానవంతులూ సమర్థులూ ఉన్నారా? మరేమిటి? అతనిపాత్ర చరిత్రలో సువర్ణాక్షరాలతో కాదుకదా బొగ్గుతో తారుతో చిత్రిస్తామంటున్నారెందుకు చరిత్రకారులు? మరొక పురాణగాథ చూడండి. హిరణ్యకశిపుడు భువనత్రయాధినేతృత్వం సాధించాడు. అద్వితీయ పరాక్రమశాలి, ప్రతిభావంతుడూ అయి ఉండాలి. అపారవిజ్ఞానవంతుడూ అయి ఉండాలి. నేనే దేవు డన్నాడు గనక, అంటే అహం బ్రహ్మాస్మి అన్నాడు అంతే. అయితే ఏం లాభం? ఆ ఐశ్వర్యమూ ఆ విజ్ఞానమూ అహంకారానికే దారితీశాయి. హిరణ్యకశిపుడు లోకకంటకుడయ్యాడు. అంత భువనత్రయాధినేతకూ, అంత విజ్ఞాన ధురంధరుడికీ ఒక అర్భకుడిచేత బుద్ధి చెప్పించాడు కథకుడు. అదే విశేషం! కథలో "నీలో వినమ్రత లేదు, నీలో దయాదాక్షిణ్యాలు లేవు. నీవు మనిషివి కావు ఎన్ని ఉండీ ఏం లాభం? నీ జీవితం నిరర్థకం, లోకభీకరం. నీవు భూమిమీద ఉండకూడదు" అని చెప్పాడు కథకుడు.

అందుచేతనే రచయితల దగ్గర్నుంచీ రాకెట్లు చేసే శాస్త్రజ్ఞులవరకూ రాజకీయ వేత్తలవరకూ విస్తరించుకొని ఉన్న వైజ్ఞానిక వర్గాన్ని విమర్శగా చూస్తే మానవ జాతికి మోక్షం విజ్ఞానంలో కూడా లేదేమో అనిపిస్తుంది. మరి

యెందులో ఉంది? అది తెలిస్తే జీవితంలో దేనికి విలువివ్వాలో తేలిపోతుంది. అదే సంస్కారం, లేక ఆధునిక భాషలో ఆత్మసౌందర్యం, లేక మానవత్వం. అది అనేక సూక్ష్మ సుకుమార సద్గుణ సముచ్చయము. మధ్యలో ఒక వజ్రంకూడా ఉంటుంది. అది నీతి. వీటన్నిటి సమిష్టి స్వరూపం సంస్కారం అనవచ్చు. మానవుడికి అందాన్నిచ్చేది ఔన్నత్యాన్నిచ్చేది ఎప్పుడూ డబ్బు అనే దానికీ విజ్ఞానం అనేదానికి పైననే ఉంటుంది. రావణాసురుడిలో లేనిదీ రాముడిలో ఉన్నదీ అదే - ఆ ఆత్మ సౌందర్యం.

శ్రీకృష్ణుడు అద్వితీయ ప్రాభవోపేతుడు. రాజభవనాంతర్భాగంలో ఉన్న ఆయన కోసం రుక్మిణీదేవి పంపించిన బ్రాహ్మణుడు వెళ్ళాడు. కృష్ణుడు బ్రాహ్మణుడ్ని మారాన్నే చూచి "తను గద్దియ దిగ్గున డిగ్గి బ్రాహ్మణుం గూర్చుండ వియోగించి", భోజనం అయిన తర్వాత, "లోకరక్షణ ప్రశస్తంబయిన హస్తంబున" ఆయన కాళ్ళు పిసికాడట. ఆ భగవానుడే ఏమన్నాడంటే, "సర్వభూత సుహృత్తములకు, ప్రాప్తలాభ ముదిత మానసులకు, శాంతులకును, సుజనులకును గర్వహీనులకు వినతు లేనొనర్తు" అన్నాడు. సంస్కారం అంటే అది. సాధువులకు దేవుడు కూడా నమస్కరిస్తాడు.

దయ, సత్యం, అహింస యిట్లాంటి సద్గుణాలు ఎవరో ఋషులే అలవరచుకోవలసిన గుణాలు కావు. నిత్యజీవితంలో ప్రతిమానవుడికి కావలసినవి. అదే సంస్కృతి. ఆ స్థాయికి వెళ్ళని జాతిని గురించి గర్వించవలసిన అవసరం ఏమీ లేదు.

ఆ సద్గుణాలే చదువుల పరమార్థం కనుక చిన్నపిల్లలకు కూడా వాటినే ఉగ్గుతో కలిపి పొయ్యాలి. కృశించిపోయిన కుక్కను గురించి జాలిపడడానికి, దీనుల గాథలు విని కంటతడిబెట్ట టానికి కావలసిన సౌకుమార్యము, సౌశీల్యము అంకురింప జేశామంటే సమగ్రంగా చదువు చెప్పామన్నమాట. డిగ్రీలు యిచ్చినంతమాత్రంచేత చాలదు, తెచ్చుకున్నంత మాత్రం చేతా చాలదు. ఈనాడు మన పరిస్థితి ఎట్లా ఉందంటే ఏ సద్గుణమైనా పుస్తకాల్లో ఉంటేనే సంతోషిస్తున్నాము. ఎవ డన్నా ఆచరిస్తే వెర్రివెధవ అనిపించుకుంటున్నాడు. కర్ణుడు మహాదాత అని పుస్తకాల్లో చదివి మెచ్చుకొంటాడే గాని, కొడుకు ఒక రూపాయి దానంచేస్తే :తండ్రి వీడు ప్రయోజ కుడు అయ్యే సూచన ల్లేవంటాడు. ఎవరన్నా యీనాడు పరోపకారార్థం తొడకోసి యిస్తే అప్రయోజకు డంటారే గానీ శిబికి పుస్తకాల్లో యిచ్చిన స్థానం యిస్తారా? ఎంత సేపూ ఏదో లాభదాయకంగా ఉండే పనులు చేస్తేనే తల్లి దండ్రులు సంతోషిస్తారు: మిత్రులు నా మిత్రుడని చెప్పు కుంటారు. సంఘంలో గౌరవం వస్తుంది. అంతేగానీ, పుస్త కాల్లో విషయాలు అమలుజరపడం మొదలుపెడితే పిచ్చివాడి క్రింద జమకట్టి అనర్హుడనీ, అసమర్థుడనీ దూరదూరంగా పోతారు ప్రజలు. అందుచేతనే మనజాతి చాలా అధోగతిలో ఉందనుకోవాలి. భారతీయ సంస్కృతి అని పూర్వగాథలు వల్లెవేస్తూ కాలక్షేపం చేయడం హాస్యాస్పదం.

ధనమూ, విజ్ఞానమూ, సంస్కారమూ ఈ మూడు త్రిమూర్తులు. బ్రహ్మ విజ్ఞానము, ఈశ్వరుడు ధనము, సంస్కా

రము విష్ణువు. ధనం సంపాదించడం (ఐశ్వర్యం) అతి సులభం, శివుడు సులభసాధ్యుడే గదా! అట్లాగే బ్రహ్మకూడా— అంటే విజ్ఞానం కూడా. వీరిద్దరి అనుగ్రహం పొందినవారంతా రాక్షసులే. కానీ అతిదుర్లభుడు విష్ణువు. ఐశ్వర్యం నశించి, అహంకారం నశించి, అనేక బాధలతో కృశించి, చితికి, చివికి "బలి" అయిపోయే దశలో ప్రత్యక్ష మవుతాడు. బలి తలపై కాలుమోపిన ఘట్టంలో త్రివిక్రమమూర్తి అదే చెబు తాడు. సంస్కారం అన్నిటికీ అతీతమయింది. అంత దుర్లభ మయింది.

ఇటీవల వార్తాపత్రికల్లో ఒక చిన్నవార్త లండన్ నుంచి వచ్చింది. ఒక బ్యాంకు భవనం కిటకీలో ఒక పావురం గూడు కట్టుకుందట. ఇక గ్రుడ్లుపెట్టి పొదిగి పిల్లలై, పెద్దవై ఆకాశంలోకి ఎగిరిపోయేవరకూ ఆ పావురం కాపురంఅక్కడే. ఆ గూడు పెట్టిననాడు ఆఫీసు బంట్రోతు దాన్ని తీసివేసి తలు పులు వేయబోయాడు. కానీ ఆఫీసువారు ఆ బంట్రోతుకు గూడు తీసివేయవద్దని చెప్పి, వాళ్ళే ఆ గదిని ఖాళీచేసి మరొక గదిలో పనిచేసుకోవడం ప్రారంభించారట. పావురం కాపురానికి అంతరాయం కలిగించకూడదన్నారట. ఈ వార్తను పత్రికలో రెండుమూడు చదరపు అంగుళాల స్థలంలో ఎక్కడో మారుమూల వేశారు, ఎంతో అప్రధానమైన విషయంగా. నిజమే! కెన్నెడీలు, కృశ్చేవ్‌లు, ఆక్రమించుకున్న పత్రికల్లో పావురానికి తావెక్కడుంటుంది? నేనేగనుక సంపాదకుణ్ణయితే ఆ వార్తను మొదటి పేజీలో మొదటివార్తగా తాటికాయంత అక్షరాలతో ప్రకటించి

ఉండేవాణ్ని. ఆ ఆఫీసువాళ్ళు ఎంతమంచివాళ్ళో! వాళ్ళు ఏం చదువుకుంటే ఏమి, చదువుకోకపోతే మాత్రమేమి, ఏ దేశమైతే ఏమి, ఆ దేశం ఎంతగొప్పది. ఆ ప్రజలెంత ముందుకు వెళ్ళారు — అని ఆశ్చర్యపడ్డాను. అభినందించాను, ఆలోచనలో పడ్డాను.

పావురానికి గది ఇచ్చారు వాళ్ళు. అదీ సృష్టి పరమార్థం. చివరకు మొత్తం జీవజాలం అంతా మనకుటుంబంగా తీసుకోవాలి. కోళ్ళూ, కుక్కలూ, ఆవులూ, గేదెలూ, మన పిల్లలు, మనం అంతా ఒకకుటుంబం. ఒకయింట్లో ఉంటాము. మనలో మనకు అన్వయింపజేసుకునే ప్రజాస్వామ్యంలాంటి ధర్మాలు తదితర జీవవర్గాలకూ మనం అన్వయింపజేయాలి. గుర్రాలు, ఎద్లు, గాడిదలు, వీటి మూపు మీద చిరకాలంగా మన స్వార్థంకోసం మనం మోపిన దాస్య భారాన్ని తొలగించాలి. గడ్డి పరకల్ని కూడ గౌరవించాలి. ఇదీ సంస్కారం.

మనజాతి పరమార్థం చివరకు అక్కడికి వెళ్ళుతుంది. సృష్టి పరిణామం. ఈ శిఖరాగ్ర స్థాయికి పూర్వం భారతీయ ఋషులు వెళ్ళారు. మన గ్రంథాల్లో కనుపించే ఋష్యాశ్రమాల్లో యీ పరిస్థితులే అమలు జరిపారు. ఆశ్రమ మృగమూ పిల్లీ, ఎలుకా, పాము, కప్పా యిత్యాదుల సామరస్యము, రాలిన ధాన్యమే గ్రహించి భుజించడమూ యివన్నీ ఆ శిఖరాగ్ర స్థాయినే ప్రతిబింబింపజేస్తాయి. అయితే ఈ లోకమంతా ఆ స్థాయికి వెళ్ళగలదా? క్రిక్కిరిసిన భూలోకం తిండికి దెబ్బలాడుకుంటూ వుంటే అహింసకు తావెక్కడున్నది అనవచ్చు. కానీ యిక్కడే యంత్రమూ విజ్ఞానము మానవుడికి సహాయం

చేస్తాయి. మానవుడు విజ్ఞాన పీయూషం తోటి ఆకలిదప్పులు జరామరణాలు జయిస్తాడు. ఇది సృష్టిపరిణామం. దీన్ని ఎవరూ ఆపలేరు.

ఆత్మసౌందర్యమే మానవత్వం. సృష్టిపరిణామం మానవత్వం అయితే మానవుడికి పరమార్థం విజ్ఞానం. మృగాల నుంచి మానవుల్ను, మంచి మానవుల్ను, అక్కడినుంచి దేవతల్లాంటి మానవుల్ను తయారు చేయడం ప్రకృతి స్వభావం. అయితే ప్రకృతి స్వభావాన్ని దినదినాధికంగా తెలుసుకోవడం మానవుడి స్వభావం. ప్రకృతి పరాకాష్ఠ దేవతలు ఆవిర్భవించడం అయితే మానవుడి పరాకాష్ఠ విజ్ఞానులు ఆవిర్భవించడం. మామూలు నేలమీద సంచరించే అమృత పూర్ణ హృదయులైన దేవతల్లాంటివారూ గొప్పవారే. నిస్సంగులూ, వైజ్ఞానిక శిఖర సమారూఢులైన జ్ఞానులూ గొప్పవారే. మంచివారి గొప్పతనం అర్థం చేసుకోలేకపోతే మాత్రం మన జన్మలు వ్యర్థం.

—౦—౦—

# ముఖ్యమైన అచ్చుతప్పులకు సవరణలు

| పేజీ | వాక్యం | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 10 | ఒకటే | ఒకటే అని తెలుసుకోరు. |
| 3 | 13 | రూపొందింది | రూపొందించవని తెలిసింది. |
| 5 | 6 | దూరదృష్టి | వారిదృష్టి |
| 54 | 5 | చేతనే అధునిక | చేతనే జనించిందనీ తెలిసింది |
| 69 | 8 | దాసాహం | దాసోహం |
| 80 | 16 | గత | తత |
| 85 | 4 | అనిపిస్తుంది. | అనిపిస్తుంది (చుక్క లేదు) |
| 85 | 5 | చేతులలో | చేతులలో. (చుక్క ఉంది) |
| 90 | 6 | భేషా | భేషా |
| 110 | 20 | క్రిందనుంచి | క్రింద మంచి |
| 112 | 5 | సారంగానే | సారంగానో |
| 112 | 19 | కొండరంగ | పల్లికొండ రంగ |
| 114 | 18 | చిలకలూరి | చిలుకూరి |
| 121 | 8 | ముతాలు | మతాలు |
| 130 | 6 | [illegible]లసకం | [illegible]ం సకల |
| 147 | 8 | వినిపించాడు. పండి | వినిపించాడు అని పండి |
| .58 | 11 | నికాయం దౌఖ | నికాయదౌశ్ |
| 158 | 12 | మేతన్న మెడ్ | మేతన్న మెడ్ |
| 158 | 16 | సమ్మిశ్రితముం | సమ్మిశ్రితముం |
| 173 | 15 | పరమార్థం | పరమార్థం. (చుక్క ఉంది) |
| 173 | 15 | వెళ్ళుతుంది. | వెళ్ళుతుంది (చుక్క లేదు) |
| 162 | 11 | దార్వానస్ | మార్వానస్ |
| 165 | 1 | రామకృష్ణపలె | రామకృష్ణ కతె |